# ద్రోణప్రశస్తి

(దురాక్షేప నిరాకరణము)


రచయిత:

దీపాల పిచ్చయ్యశాస్త్రి

నెల్లూరు.



1960





వెల. రు. 2-50

# పండితాభిప్రాయములు



'విమర్శకాగ్రేసర'

## శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు

తమ 'ద్రోణప్రశస్తి'యు, జాబును చేరినవి. ధన్యోస్మి. గ్రంథము చేతి కందినదే తడవుగా సాంతము చదివితిని. ఈవల కొంత శ్రద్ధతో క్రమముగా మూలభారతమును చదువుచున్నాను. ఆదిపర్వమున ద్రోణాచార్యుని విచిత్రవ్యక్తి యెంతో హృదయంగమముగా చిత్రింపబడినట్లు తోచినది. సత్వరజస్సులు రెండును సమానముగా కలిపి మెదిపిన మూర్తి యతనిది. కాని రజస్సే ప్రబలమై వెలసి ఒకమారు సత్వముప్రక్కను, ఇంకొకమారు తమస్సు ప్రక్కను మొగ్గుదల చూపినది. ఇట్టి ప్రకృతిగల వ్యక్తికి, అతని వలన ఇతరులకును సంభవించు త్రైవర్గికములైన చిక్కులు అతని జీవితమున ప్రతిఫలించినవి. శ్రీ వ్యాసభగవానుని కైవాడమే అట్టిది. ప్రతి పాత్రమునందును విశిష్టమైన గుణదోషములు దుష్ప్రతీకారముగానుండి అందువలన జీవితమున కలుగు ధర్మార్థకామముల చిక్కులను మన కంటియెదుట నిలుపుట, అవసరమైన చోట్ల నెల్ల ఆ చిక్కులకు ధార్మిక నైతిక ప్రతీకారములను సూచించుట. ద్రోణాచార్యుడు గొప్పవాడే. అసాధారణ వ్యక్తియే, మేధావియే, కాని ఆదర్శమూర్తి కాడు. కనుకనే మన ప్రాచీన లెవరును అతనిని ఆరాధ్యమూర్తిగా పరిగ్రహింపలేదు. భీష్మునికి మనలోగల గౌరవము, ఆధ్యాత్మికోన్నతి ద్రోణునికి లేదు. గొప్పవారందరును మంచివారు కారు అను తత్త్వమును మహాభారతము ద్రోణపాత్రమూలమున మనకు తెలిపినది.

ఇక్కడ నన్నయ్యగారి తెలిగింపులో ఒక గొప్ప మూలవిరోధము కానవచ్చుచున్నది. ద్రోణుడు అర్జునుని గురుదక్షిణ యాచించినది-

"యుద్ధే ఽహం ప్రతియోద్ధవ్యో యుధ్యమాన స్త్వయానఘ"
(ద్రోణ. 128-14)

అనియే. దాని కనుగుణముగా అవకాశము కలిగినప్పుడంతయు అర్జునుడు గురువుతో పోరాడ వెనుదీయలేదు.

నన్నయపాఠ మొకవేళ "యుద్ధేఽహం న తు యోద్ధవ్యో" అని యేమైన నుండునేమో! కాని అర్జునుడు అట్లు గురువుగారికి ప్రతిజ్ఞ చేసియుండినను దాని నెప్పుడును నిలుపుకొనలేదు. స్మరింపనైనను లేదు. రాగద్వేషములను స్వాభిమానమును ప్రతిష్ఠాకాంక్షను పూర్తిగా నియమించుకోలేని ద్రోణునికి మూలమందలి మాటయే అనుగుణముగానున్నది.

ఈ భావములను తాము సాంగోపాంగముగా ప్రతిపాదించితిరని సంతసించుచున్నాను. తాము చేయగల కార్యమే నిర్వహించినారు-గనుక ప్రత్యేకముగా ఈ గ్రంథమును ప్రశంసింప బనిలేదు. సహజమై పరిణతము నైన తమ శైలి విషయగౌరవమును హెచ్చించినది.

కర్ణుని విషయమున మాత్రము తగినంత న్యాయము తాము చేయలేదేమో అనిపించినది. బ్రహ్మప్రధానమైన జన్మము క్షత్రమునందు మరలించి, చచ్చువరకును పాంచాలజాతిమీద కసితీర్చుకొన్న ద్రోణాచార్యులు శ్లాఘ్యులేని, క్షత్రజన్మమెత్తి సూతజాతిలో పెరిగి, శక్తియుక్తులకు తగని పరాభవమును తిరస్కారమును అనుభవింపవలసిన కర్ణుని శోచనీయ చరిత్రను గమనించినప్పుడు అతనిపై మన మెక్కువ అనుకంపాగౌరవములను చూపదగునని నా భావన.

పెండ్యాలవారి యపభ్రష్టగ్రంథమును ఎంత ఖండించినను తగును తా మా పని చక్కగా చేసితిరి. అసలు ఆయన చిత్తవృత్తిని చెరచినది కట్టమంచి రామలింగారెడ్డిగారు. ఆయన వినోదప్రియుడు. విప్లావనబుద్ధి.

కనుక కొంత వినోదముగాను మరికొంత నవ్యదర్శన ప్రీతితోను రెడ్డిగారు చేసిన వాదములకు ఆపాదమస్తకముగా వంగి సలాముకొట్టి పెండ్యాల శాస్త్రులు కృతకృత్యమ్మన్యులైరి. వారి పాండితికి నేను కొంత గౌరవము చూపుచుంటిని. నాయెడ వారికిని వాత్సల్యముండెను.

వారికి వయస్సు ముదిరి చూపు మందగింపగా– 'నేను భారత మహా వ్యక్తులను అగౌరవముగా విమర్శించుటచేత– ఆ పాపఫలముగా– కన్నులు గ్రుడ్డియైనవని కొందరన్నారు' అని నాతో వారు చెప్పిరి. అట్టి వారిలో నేనుగూడ ఒకడనని వారితో మొహమాటములేక చెప్పితిని. "నీకు సత్యామక్కరలేదా?' అని వారడిగిరి. ఎన్నడో మరచిపోయినవి, లేదా అన్యథా సమర్థితములైనవి యగు ప్రాచీనుల లోపములను– అవి లోపములనియే సత్యములనియే వాదమున కంగీకరించినను – మరల త్రవ్వి లోకమున కెత్తి సత్యప్రీతిని ప్రకటించుటకు పాండవ కౌరవుల కాలముదాకా పోనేల, మీ తల్లిదండ్రులు తెలిసియో తెలియకయో చిన్నతనమున చేసిన తప్పులను పరిశోధించి కనుగొని ప్రకటించి మీ సత్యాభిమానము చాటుకోరాదా?' అని ప్రతిప్రశ్న నేను అధికప్రసంగముగానే వేసితిని. పాపము వారి తలిదండ్రుల దోషములు నాకేమియు తెలియవు. కాని వారును మనుష్యమాత్రులే కనుక ఈ 'సత్యాభిమానము' కలవారు పరిశ్రమించినచో, ఇక్కడ ప్రయోగించిన హేతువాదపద్ధతినే ప్రయోగించి చూచినచో, ఏదో ఒకటి రెండైనను దోషాభాసములు కానరాక తప్పవు. ఈ సత్యప్రియులైన పుత్రరత్నాలకంత చాలును.

ఎందరెన్ని యంతస్తులలో ధర్మ మాచరించినను, ఆచరింపక తప్పినను, ఈశ్వరసృష్టియందు మానవజీవితమునందు ఆ ధర్మము – ఇట్టిదని నిక్కరముగా నిర్వచింపరాకున్నను – ఆధారతత్త్వముగా ముందు వెనక ఇరు ప్రక్కలతోడై వివిధ విలాసములతో నర్తించును అను తత్త్వమును మహాభారతము మన కన్నులకు కట్టించుచున్నది.

"ఊర్ధ్వబాహు ర్విరౌ మ్యేషః న చ కశ్చి చ్ఛృణోతి మే
ధర్మా దర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే"
అనికదా వ్యాసుడు ఘోషించి మహాభారతము ముగించినాడు?

చిత్తగింపుడు
నమాంసి
తిరుపతి
2-2-1960
రా. అనంతకృష్ణశర్మ

---

విద్వత్కవిశేఖర, విద్వాన్, ఆయుర్వేదవిద్వాన్,
శ్రీ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రిగారు

మనీషిశతంసా!

మీ "ద్రోణప్రశస్తి" భారతమహాపురుషుల సద్యశస్సమున్మేషమునకు నికషోపల మనఁదగియున్నది.

"మందా విదధతు నిందాం నిపుణో హరిపాద సేవనం కురుతే
మందూకేషు రటత్స్వపి మధుప స్సరసిజరసం న సంత్యజతి"

అను న్యాయము ననుసరించి, మీరు రసజ్ఞులగు భృంగసదృశులు. మీ ఝుంకారములే, యీ 'ద్రోణప్రశస్తి'. సెబాస్!

కొందఱు పండితమ్మన్యు లిటీవల, మహాత్ములగు భీష్మద్రోణ యుధిష్ఠిరాదులను కుయుక్తులతో నాక్షేపించుచు, పరమ పతివ్రతలైన కుంతీమాద్ర్యాదులను నిందించుచు, ముష్టి చతుష్టయమునుగూర్చి యానవసరాభిమానము ను ప్రదర్శించుచు వ్రాత్యపు వ్రాతలు వ్రాయసాగినారు. ఇటువంటి వారిని గుఱించియే కాబోలు,—

"రాక్షసాః కలిమాశ్రిత్య జాయంతే బ్రహ్మయోనిషు"

అను పౌరాణికోక్తి పుట్టినది.— "ఎంతవాని మెచ్చనంతవాఁ" డన్నట్లు

ఇట్టివారు దుర్యోధనాదులను ప్రేమింపక భీష్మ యుధిష్ఠిరాదుల నెట్లు ప్రేమింతురు?

"శాస్త్ర స్యాపార్థ వాదిత్వమ్" ఇత్యాదులు కాలచోదితులగు దుష్ట పండితుల లక్షణములు. అట్టివారి కువ్యాఖ్యలను ఖండించుచూ, తా మీ ద్రోణప్రశస్తిలో కనుపరచిన సహజన్యాయైకదృష్టికి, ధర్మనిష్ఠకు, తత్త్వాన్వేషణకు, నిష్పక్షపాతబుద్ధికి, వృద్ధోపసేవిత్వమునకు,– తోణుకు బెణుకు లేని ప్రతిభాసంపత్తికి – నమస్కరించుచున్నాను.

ఇట్టి సద్గ్రంథములచే ఆంధ్రసరస్వతిని తా మింకను విశేషించి అర్చింపవలె.

మకాం–కల్యాణదుర్గం
అనంతపురం–జిల్లా
వికారి–రథసప్తమి

భవదీయుఁడు,
గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రి

---

వేదశాస్త్ర పురాణసంప్రదాయార్థ వేత్తలు, సుప్రసిద్ధ విమర్శకులు–
శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, యం. ఏ.
(Lecturer in Sanskrit, S. R. R. & C. V. R.
Govt. College, Vijayawada)

మీరు పంపిన 'ద్రోణప్రశస్తి' మిక్కిలి ప్రశస్తముగానున్న దనుటకెన్నియైన నుదాహరణముల నీయవచ్చును. పాఠకు లెవరికి వారే మీవిమర్శ పాటవమును, ఏతద్గ్రంథా వశ్యకతను తెలిసికొనగలరు. పిడివాదమునకు పిడివాదమునే చూపి, యుక్తికి యుక్తిని చూపి, వచనమునకు వచనమును చూపుట సామాన్య విమర్శకుల పద్ధతి. మీరింతకంటె పై శ్రేణివారగుటచే నొకటికి రెంట మాఁటను సమాధానమిచ్చినారు. బెత్తెడు భాసవాఙ్మయములో మహాభారతములోని యొక విషయము ఇమడ్చబడనంత మాత్రమున

ఆ విషయము భారతములో ప్రక్షిప్తమని వాదించు ప్రతిపక్షుల అవివేకము నకు న్యాయముచే సమాధానమునే చెప్పనక్కఱలేదు. మీ ఔదార్య ముతో సమాధానమిచ్చుచు ద్రౌపదీవస్త్రాపహరణ ప్రసంగము భాసనాట కములో నున్నట్లు చూపి వారి యవివేకమును ద్విగుణీకృతము చేసినారు.

మీవిమర్శ మంతయు నిక్లే ప్రతివాదమునణచుటకు పర్యాప్తమైన బలమునే కాక అధికబలమును గూడఁ గల్గియున్నది.

సత్యనారాయణపురము.
విజయవాడ-2.
2-2-60

జటావల్లభుల పురుషోత్తము

---

## కవిసమ్రాట్, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, M. A.
## (Principal, S. R. R. Government Arts College, Karimnagar.)

ద్రోణప్రశస్తి యన్న తమగ్రంథము చేరినది. బాలవ్యాస బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'మహాభారత తత్త్వకథనము' అను పేర ఆరుసంపుటములు తమరు సమాధానము చెప్పవలసివచ్చిన సందే హములవంటి సర్వసందేహములకు నివృత్తి చెప్పుచుఁ బ్రకటించిరి. * తమ రాగ్రంథములు చూడలేదేమో.

సరే: తమరి గ్రంథ ప్రస్తావన, 2 పుటలో 'తూర్పుగాఁబారు మహా ప్రవాహమును బడమటికిమళ్లింపఁ దరమగునా?' – 'అస లది యేమిపని?' అనియున్నది.

---

* నే నా గ్రంథములను చూడలేదని నా 'ప్రస్తావన' (పు.20) లో తెలుపుకొనియే యున్నాను.–

దీ. పి. శాస్త్రి

ఈ 'అస లది యేమిపని' అన్న మాటయే చాలును. ఇంత గ్రంథ మక్కఱలేదు. ఆ మాట గ్రుచ్చుకోని వానికి యీ గ్రంథ మేమియుఁ బని చేయదు.

మరి. ఆ ప్రస్తావనలోని 19 వ పుటలోఁ జివర శ్రీ సుబ్బరామయ్య శ్రేష్ఠిగారీమాత్రపు తెలుక లేనివారు కారు. ప్రాజ్ఞులే. వారీ యాక్షేపములను సవరణలను నాటి సభలో వెల్లడించుట సందేహనివృత్తి కొఱకేగాని మరియొక యుద్దేశముతోఁగాదు' అని తమరు వ్రాసితిరి. చదివెడి వానికి లౌక్యమనిపించును. యథార్థమైనచో యాథార్థ్యావభాసము కలుగునట్లు తమరు వ్రాయలే దనుచున్నాను.

'సారపు ధర్మముఁ విమలసత్యము' అన్న పద్యము మీయందు శ్రేయోదాయి యగుఁగాక.

కరీంనగరు. ఎ. పి.
2-2-1960

విశ్వనాథ సత్యనారాయణ

---

తర్కవ్యాకరణ వేదాంతపారీణ - 'బాలవ్యాస'

శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

అయ్యా! తమ పుస్తకము ఉత్తరము అందినవి. తాము ద్రోణ ప్రశస్తిలో చాల విచారణచేసి బాగుగా వ్రాసినారు.- 'మహాభారతతత్త్వ కథనము' మీకు లభింపనట్టు వ్రాసిరి. అందులో ప్రమాణోపపత్తులతో ఆక్షేపములు పరిహరింపబడినవి.

దానికి మీ గ్రంథ మక్కడక్కడ ఛేదించినది. కౌరవ పాండవ కలహ కారణము రాజ్యాధికారనిర్ణయపూర్వకముగా నిరూపింపదగి యున్నది. ఆ రాజ్యాధికారము పాండురాజుదే (ధృతరాష్ట్రు)నిది కాదని నిరూపింపబడినది.

సమ్యగ్దృష్టితో గ్రంథరచనజేయు తమకు 'తత్త్వకథనము' లోని రెండు భాగములు పంపుకొనుచున్నాను. ఏకలవ్య విషయము, ద్రోణ భీష్ములవంచన, ఆత్మవధోపాయకథనము—అను అంశములు— 'పాండవ నిందా నిరాకరణము' 809 పేజీనుండి ఒకసారి చూడగోరుచున్నాను.

'అర్జుననిది అధర్మయుద్ధము' .. 'కర్ణునిది ధర్మయుద్ధము' అనుట యుక్తముగా గనబడదు.— "మన రథం బిప్డు మాధవ మరలనిమ్ము" అన్నది సంశప్తక యుద్ధరంగములోనుండి యన్నమాట. కర్ణుని యుద్ధరంగములో నుండి అన్నది కాదు.

పిఠాపురము<br>
11-2-60

వా. సుబ్రహ్మణ్యశాస్త్రి

---

మధురకవి శ్రీ బెల్లూరి శ్రీనివాసమూర్తిగారు.-

క. కాలవశాత్తు తమోగమ<br>
నాలసులగు వేదుఋలకు నాద్యంతము దీ<br>
పాల వెలుంగులు చూపుచు<br>
నాలంబములయ్యెఁ దావ కాద్భుతరచనల్.

క. ప్రత్యయము లేదు బుద్ధి<br>
వ్యత్యాసము కలిమి జనుల కార్యపథములన్<br>
సత్యనిరూపణ సల్పితి<br>
రత్యంతము నింపు పిచ్చుయార్య సుధీంద్రా!

క. 'ద్రోణప్రశస్తి' తెలుఁగుల<br>
కాణాచిగ నార్ష ధర్మకల్పద్రుమమో,<br>
వాణీ నవ్యాభరణ<br>
శ్రేణీగత రోచియో, విశిష్టత దాల్చెన్.

ఉ. కాలమహోదధిన్ భయదగర్జల సందడి ధర్మనౌక తా
నై లయమొందనున్న తరుణంబున వెల్వడి యీ సమీక్ష వా
తూలము వోలె వీచి, దరిఁద్రోసి. మహోపకృతి ప్రశాంత సౌ
ఖ్యాలయసీమఁ జేర్చినది – అంజలి మీ ప్రతిభాప్రశస్తికిన్.

క. భారతవీర వరేణ్యుల
ధీరోదాత్తత మనోజ్ఞ ధీనైపుణ్యము విం
డారఁగఁ జల్లిన రచనా
వీరవిహారంబు హృదయవీథిఁ గరంచెన్.

గీ 'ప్రణయకుసుమంబు' పూచిన భవదనూన
సాహితీనందనోద్యాన సరణిలోన
'మేఘదౌత్యమ్ము' నడచిన మేలిజాడ
నీ మనోహర వ్యాఖ్య రాణించుఁగాత.

బెళ్ళూరి శ్రీనివాసమూర్తి

---

మహాకవి, ఉభయభాషాప్రవీణ, ఉభయభాషాకవితా విశారద,
ఆంధ్ర వైయాకరణ కేసరి,

శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మగారు.
(Lecturer, S. V. O. College - Tirupati)

ఆర్యా!

తాము పంపిన 'ద్రోణప్రశస్తి'ని పూర్తిగ సంతృప్తిగ చదివితిని. ఇంత వఱకును మీరుచేసిన భాషాసేవకుఁగల ప్రశస్తిని మించిన ప్రశస్తిని ఈ ద్రోణప్రశస్తి సంపాదించుకొన్నది. మీరు భారతవీరుల ధర్మాధర్మ నిర్ణయమునకు శ్రుతిస్మృతి పురాణేతిహాసముల కవిరోధముగ భీష్మ ద్రోణావతారములను పునస్సాక్షాత్కరింపఁ జేసితిరి.

"భారతకథితము గావున నారాయణాస్త్ర సదృశము" అన్న మీ నుడి దుర్విమర్శకులకు నారాయణాస్త్రమే. "కర్ణుని రాజనీతి పరుడనవచ్చునుగాని రాజభక్తిపరుడనరాదు" అని మీరు నిర్ణయించిన సిద్ధాంతమును గాదనగల మొనగాడేడీ? రమ్మని పిల్చుచున్నది మీ రచన.

"కర్ణుని కలరూపు" అను భాగమున-ఘోషయాత్ర గొడవలోను, కవచకుండల దానములోను, కర్ణుని యాంతర్యములోను మీరు చూపిన ప్రమాణములు - సమన్వయములు అద్వితీయములుగ, అమోఘములుగ, హృద్యములుగ, ప్రతి పక్షకోటికిగూడ పాఠము చెప్పునవిగ నున్నవి.

మొత్తముమీఁద మీరు గుణమును గుణముగ, దోషమును దోషముగ నిష్పక్షపాత బుద్ధితో గ్రహించుటలోను, ప్రతిపక్షులనుగూడ గ్రహింపజేయుటలోను మిక్కిలి సమర్థులు. కర్ణార్జునులలోగల గుణదోషములను రెంటినీ విడవక విమర్శించి చూపిన మీ భారతకథా సమన్వయరీతి సకల జనామోదకరమగునని నా విశ్వాసము. పక్షపాతప్రవృత్తిరహితమైన యీ మీ విమర్శనము భావిపండిత విమర్శకుల కాదర్శ మయితీరునని గ్రహించి యానందించితిని.

ఈ ద్రోణప్రశస్తిని అధునికోన్నత విద్యార్థుల కందజేయు బాధ్యత సకల విద్యాధికారులు వహింప నవకాశమును కాలశక్తి యిచ్చుగాత.

సరస్వతీవిహారము
తిరుపతి.
22-2-1960

ఇట్లు
సకల విధేయుఁడు
చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ

---

నా యీ గ్రంథమును పూర్తిగా చదివి, నా విమర్శ తత్త్వమును గుర్తించి, ఋజుహృదయముతో తమతమ భావములను తెలిపిన పండితవరేణ్యుల కనేక నమోవాకములు. ఎంతజాగరూకత వహించినను అచ్చు తప్పుల తల్లు తప్పులేదు. అట్టి తప్పులను దయతో సవరించుకొనవలెనని పాఠకులకు నా మనవి.

గ్రంథకర్త.

# ముద్రణ సహాయము; కృతజ్ఞత

"నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతాః"

ఒక కావ్యముగాని, విమర్శగాని వ్రాయుట సులువైన పని కాదు; ఎంతో బలువైనపని. అందును కావ్యముకంటెను విమర్శ కడుమిక్కిలి శ్రమకారి. అయినను రచయిత కా శ్రమ శ్రమగా తోచదు. అతని కది యొక యనిర్వాచ్యమైన యానందము. ఆ యానందములో మునిగియున్నంతకాలమును అతనికి తక్కిన కష్టసుఖము లేవియు స్మృతికిరావు. కాని రచన ముగిసి ముద్రణ విషయము మనసుకు రాగానే అతడు ముచ్చముడిగి వెచ్చనూర్చును. అచ్చుపనికి కావలసినది అర్థము. ఏదీ? అర్థ మతని వ్రాతలో సమృద్ధిగా నున్నను, అతని తల వ్రాతలో తక్కువగదా! రచయితలలో నూటికి తొంబైమంది యీ తరగతిలో చేరినవారే;- అందువలన, రచనానంతరము డబ్బుకొరకబ్బుర్లాడుచూ గడపపూజలకు బయలుదేరుట; ఏ ఘనునకు దయవచ్చునా యని-స్వాతిచినుకులకు ముత్యపు చిప్పవలె-నోరుతెరుచుకొని యెదురు చూచుచుండుట యను కర్మ రచయితయైన ప్రతివానికిని - అంతో యింతో - అవశ్య మనుభోక్తవ్యమే. 'అదృష్టగడియ' నెట్టుకొనివచ్చి, ఆ పుస్తక మచ్చైనప్పుడుగాని, ఆతనిలో అడుగంటిన యానందము మరల తల చూపదు. అంత వరకును అతడు పడు బాధ భగవంతునికే యెరుక.

రచయితృజన సాధారణము గావున, ఆ బాధ నాకును అనుభూతమే. కాని, ఆ యనుభవ మత్యల్పము. నే నిప్పటికి వ్రాసిన యిరువది గ్రంథములును, భారతీపరమానుగ్రహమున భాషాభిమానుల మన్ననకు భాజనములై, అల్పాల్పయత్న ములతోనే అచ్చయిపోయినవి. ఇప్పు డీ కృతి నా ప్రయత్న మణుమాత్రమును లేకయే ముద్రణ భాగ్యము నందుకొన్నది. అది యాశ్చర్య జనకమును, అభినుత్యార్హమునునైన యపూర్వ సంఘటనము గావున మనవిచేయుచున్నాను.

నేను వ్యాసమును పూర్తిచేసి, సాఫు వ్రాయుచుండగా, మా యింటికి - దైవవశమునగా - దయచేసినారు,-

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు.

శ్రీ రెడ్డిగారు సంస్కృతాంధ్రముల రెంటను చక్కని సాహిత్యమును, సాహిత్యమునకు వన్నెదెచ్చు సునిశిత విమర్శ దృష్టియు గలవారు. వారి 'నన్నిచోడకవిచరిత్ర' - 'కృష్ణగీత' వారి ప్రతిభావ్యుత్పత్తులకు నిదర్శకములైన యుత్తమ గ్రంథ ములు. చరిత్ర పరిశోధనమున రెడ్డిగారి యుపజ్ఞ, యుత్తమ విమర్శకులచే నుపగీతమైనది.

రెడ్డిగారు నాకు చిరకాలమిత్రులు. వారికిగల సాహిత్య విద్యాభినివేశమే మా మైత్రికి నిదానము. వారు నా యోగ క్షేమములు విచారించి, ఆ యీ సారస్వత విశేషములను గూర్చి ముచ్చటించుచు- "శాస్త్రిగారూ! మీ భాసనాట

కానువాదము లారును అచ్చై నవా!" అన్నారు.- అయిన వని చెప్పి, నే నప్పుడే వారి కా గ్రంథము లిచ్చినాను. వారు నా యవిరతభాషారాధనము నభినందించి "మరి యిప్పు డచ్చు కావలసినది యేమీ లేదా!" అని ప్రశ్నించినారు. నే నీ వ్యాసమును చూపి విషయమంతయు వివరించినాను. వెంటనే రెడ్డిగారు "ఇట్టి విమర్శలే యీకాలమున కావలసినవి; మీ గ్రంథమును రేపే అచ్చుకు పంపండి" అన్నారు. నాకు ఏనుగు నెక్కినంత సంబరమైనది. కాదామరి! ఎంతో శ్రమపడి వ్రాసిన గ్రంథము అతర్కితోపనతమును - అభిమానపురస్సరమునునైన ద్రవ్యముతో దివ్యముగా అచ్చగుటకంటెను అదృష్టముండునా? అంతకంటెను ఆనందకరమైన విషయ ముండునా? రెడ్డిగారటు తమ యిల్లు చేరుటయే తడవుగా, ముద్రణమునకు వలసిన పుల్లె - ముద్రమూడుపుగా - ఇటు మా యిల్లు చేరినది. ఇట్లు భాషాసేవకుల యక్కర నడిగి తెలిసి కొని మోదముతో ఆదుకొను వా రెవరండీ!

శ్రీ రెడ్డిగారి యీవియు, విద్వదభిమానమును అసాధారణములన్నను ఆదర్శకల్పములన్నను అతిశయోక్తి యగునా?

క. దేవరపల్ల్యన్వయమణి
శ్రీ వేంకటకృష్ణరెడ్డి చేపట్టుటచే
భావుకతఁ గాంచె మత్కృతి
భాషజ్ఞ సమాదరాప్తి భాగ్యము కాదే!

చ. ఘనతరగూఢవస్తుమయ కావ్యరహస్యములిట్టె సూక్ష్మదృ
ష్టిని గనిపెట్టి, తద్గత విశేష చమత్క్రియ లాకళించి, ప్రా
క్తన కవిరాజ గుప్త చరితమ్ముల నిమ్ములఁ దెల్పి తత్త్వవి
ద్వినుతులఁగొన్న మత్సఖుని వేంకటకృష్ణుఁ బ్రశంసచేసెదన్.

ఆ. వె. పాకనాటి రెడ్డిప్రభువుల కోవకుఁ
జెందినాడు; సిరుల నందినాఁడు.
కావ్యశోధనమునఁ గడుఁ గ్రొత్త మార్గంబు
ద్రొక్కినాఁడు; గణుతి కెక్కినాఁడు.

ఆ. వె. విత్తమున్నచోట విద్యయుంటయు, విద్య
యున్నచో వితీర్ణి యుంట యరిది;
వెలసెఁ గలసిమెలసి విత్తంబు విద్యయు
వితరణంబు రెడ్డి విభునియందు.

క. అలఁతులఁ మెచ్చఁడు; మెఱమె
చ్చుల కొసఁగఁడు; తనకు నచ్చుచో హెచ్చుగు నీ
వులనిచ్చుఁ; గలరె కలవా
రలలో నేతత్సమాన రసికవదాన్యుల్!

గీ. పండిత విమర్శక ప్రీతిఁ బరిఢవిల్లి
పుత్ర పౌత్రాయు రారోగ్య భోగభాగ్య
వేల్ల దసకృ త్సమాఖ్య వర్ధిల్లుఁగాత
నీశ్వర కృపాప్తి వేంకటకృష్ణరెడ్డి.

నెల్లూరు.
వికారి; పెద్దపండుగ. దీపాల పిచ్చయ్యశాస్త్రి
14—1—1960,

# శ్రీ రెడ్డిగారి వంశవృక్షము

(మల్లాల గోత్రము)



బసివిరెడ్డి

|

పిచ్చిరెడ్డి

|

| మహాలక్ష్మమ్మ | లక్ష్మీదేవమ్మ |
|---|---|
| కోటారెడ్డి<br>కోటమ్మ<br>( శ్రీ వేణుగోపాల<br>శ్రీ నీలకంఠేశ్వరాలయ<br>అన్నదానసత్ర నిర్మాత్రి.<br>నిర్యాణము - 1920 ) | చెంచురామిరెడ్డి<br>(నిర్యాణము - 1910)<br>ఆదెమ్మ<br>(నిర్యాణము - 1940) |
| రంగారెడ్డి<br>(బాల్యమరణము) | వేంకటకృష్ణారెడ్డి<br>(జననము - 1899)<br>దేవాలయ ధర్మకర్త.<br>ఉలవపాడు. |

---

# సూచిక

## (ప్రస్తావన)



## (ద్రోణప్రశస్తి)

# ప్రస్తావన

## ౧. వ్యాసరచనా ప్రసక్తి

'భారత మహావీరుల ప్రశస్తి' యను విషయమును పురస్కరించుకొని నెల్లూరు - వర్ధమానసమాజమువారి యాజమాన్యమున, శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారి ఆధిపత్యమున, 20-1-58 మొదలు 6-2-58 వరకును మహాసభలత్యంతవైభవముతో జరిగినవి. ఆ సందర్భమున నేను (22-1-58) ద్రోణునిగూర్చి యుపన్యసింపవలసివచ్చినది.

సభాప్రారంభముననే, అధ్యక్షులు శ్రీ పైడా సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు- "ద్రోణుని జన్మకథ నమ్మదగినదేనా?"- "అత డేకలవ్యునకు ద్రోహము చేయలేదా?"- "ద్రోణుడు పాండవపక్షపాతి యగునా? కాదా!" ఇత్యాద్యాక్షేపములు కొన్ని మూదలించి, ఉపన్యాసమునకు విషయమును విధించినారు.

భారతవీరుల ప్రశస్తిని ప్రవచించి, ప్రజాసామాన్యమునకు భారతకథపై నభిరుచిని, భారతేతిహాసమునం దభిమానమును అలవరించుటకై సమకూర్చబడిన సభలో, ఆ వీరుల చరిత్రల కెన్నికలుపెట్టి, వారు దోషులగుదురా? కారా? యని చర్చించుటయు, భారతకథలు నమ్మదగినవి కావేమో నన్న భావము ప్రజలకు కలిగించుటయు నుచితముకాకపోయి

నను, సభానియంత నియామము ననుసరించి నా విధిని నేను నెరవేర్చినాను.

ద్రోణుని చరిత్రమున దోషము లేదనియు, ఆక్షేపములుగా పేర్కొనబడిన యంశములు కథ సరిగాచదువనివారు చేసిన ఊహాలేగాని సత్యములు కావనియు, నప్పటికి నాకుగల ఉపస్థితికొలదిని కొంతవరకు వివరించితిని. కాని అది సమగ్ర సమాధానము కాలేదు. ఎట్లు కాగలదు? విషయము పెద్దది గదా? ఉపన్యాసమునకు పరిమితమైన ఒకటి రెండు గంటల కాలములోనే తెమలునా?

అధ్యక్షులు తమ మలిపలుకులలో "ద్రోణుని యుత్పత్తి యీ విధముగా జరిగియుండు"ననుచూ, సవరణలు సూచించి సభ సమాప్తిచేసినారు. దానితో శ్రోతలలో కొందరికి 'భారతకథలు సంస్కరింపబడవలసినవే'నన్న భావ ముదయించినట్లు, వారివారి యనుభావములలో నాకు పొసపొసగా పొడ కట్టినది.

సభముగియుటతోనే ప్రాజ్ఞులు కొందరు, 'ఈ నాటి యాక్షేపములకు పూర్తిగా సమాధానములు వచ్చునట్లు ద్రోణుని శీలమునుగూర్చి యొకవ్యాసము వ్రాయవలసిన'దని నన్ను కోరినారు. నాకును అట్టి యుత్సుకత యుత్పన్నమై యుండుటచేతను, 'వ్యాసమేగదా' యన్న భరవాసాతోను నేనును తటాలున తలయూపినాను. కాని, తరువాత వస్తా

యింపవలసివచ్చినది. కారణ మేమనగా: చిన్న వ్యాస మను కొన్నది "వేలువాచి రోలైన" దన్నట్లు పెరిగిపెరిగి పెద్ద గ్రంథమేమైనది. అ ట్లేలనైన దనగా:

సుబ్బరామయ్యగారు సూచించిన యాక్షేపములు వారి సొంతముకావు. కీ. శే. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారి 'మహాభారతచరిత్ర' మను గ్రంథములోనివి. ఆ గ్రంథ ములో ద్రోణునిమీాది యాక్షేపము లింకను కొన్నికలవు. వాటినిగూడా చేర్చి అన్నిటికిని సమాధానములు చెప్పిననేగదా నా వ్యాసము సమగ్రమగుటయు- ద్రోణునిశీలము నిర్దుష్ట మని యేర్పడుటయును? ఆ విధముగా- 'పైడా' వారి మూలమున- 'పెండ్యాల' వారి గ్రంథమును విమర్శించుటయు నాకు తలవని తలపుగా తటస్థించినది. తలగించుకొనరాని తంటా మైనది. దానితో "తీగెదీస్తే డొంక కదిలిన" దన్న సామెతగా విమర్శ అంతకంతకును విస్తరిల్లి పని భారమైనది. ఎంత భార మైనను పూనుకొన్నపిమ్మట మానుకొను టెట్లు? 'రోటిలో తలదూర్చి రోకటిపోటుకు వెరవదీరదు' గావున సభ్యులకోరిక మేరకు-యథాశక్తి-నే నీ విమర్శవ్యాసమును రచించినాను. ఇందు పెండ్యాలవారి యాక్షేపములు యథోచితముగా పరా మృష్టము లైనవి.

## ౨. పెండ్యాలవారి గ్రంథస్వరూపము

ఈ వాదమునకు చోదకమైన పెండ్యాలవారి గ్రంథము యొక్క- స్వరూపస్వభావములు ముందుగా తెలిసియుండిననే

గాని, పాఠకులకు నా సమాధానములలోని సారాసారములను చర్చింప ననువుపడదు గావున దిఙ్మాత్రముగా తెల్పుచున్నాను.

వారిగ్రంథము భారతకథా పరిశోధనపరము గాదు. అది భారతకథనే తలక్రిందు చేయవలెనన్న పట్టుదలతో బయలుదేరిన పెద్ద ఆక్షేపణగ్రంథము. (డెమ్మీ సైజులో 346 పుటలు). అదియొక విప్లవసన్నాహము. వ్యాసుడు పక్షపాత బుద్ధితో పాండవులను మంచివారుగను, కౌరవులను చెడ్డవారు గను చెప్పినాడని, తాము 'కౌరవులేమంచివారు'; 'పాండవులే చెడ్డవారు'- అని రాద్ధాంతముచేయ బూనుకొన్నారు. సాధ్య మేనా? తూర్పుగాబారు మహాప్రవాహమును పడమటికి మళ్లింప తరమగునా?

అస లది యేమిపని? కౌరవులును పాండవులును వ్యాసునకు పౌత్రులు. వారి మంచిచెడ్డలు వ్యాసునకంటెను తమ కెక్కువ తెలియునా? ఆ మహర్షి "నా మనుమలలో కౌరవులు చెడ్డవా"రనగా, ఈ విమర్శకులు "కాదు కాదు; వారే మంచివా" రనుట- "ఇంటివాడు గొడ్డుగేదె అంటే బయటివాడు పాడిగేదె అన్నా"డన్న సామెతగా లేదా!

వ్యాసునిరచనలో పక్షపాత మున్నట్లు తమ కెందేని పొడకట్టియున్నచో, ఆ యంశమునుదెల్పి, అందలి పక్షపాత మెట్టిదో నిదర్శనములతో నిరూపింపవలె. అది విమర్శ లక్షణము. ఆ ఋషి యౌనన్నది కా దనుచూ- కాదన్నది యౌ ననుచూ- 'చండీ' చందమున పదపదమునను ప్రతికూల

ప్రసంగము చేయుటయు, కథాప్రణాళికనే మార్చ జూచుటయు విమర్శ యనిపించుకొనునా?

ఇంతయెందుకు: పెండ్యాలపండితులు పాండవద్వేషి. అందువలన పాండవులయందును, వారి నాదరించిన భీష్మ ద్రోణాదులయందును నీచత్వమును, దుర్యోధన కర్ణాదులయందు త్తమత్వమును ఆరోపించుటకై, తమ యూహాలతోను, అపార్థకల్పనలతోను, అబద్ధపు వ్రాతలతోను గుణదోషములు తారుమారు చేసినారు. భీష్మ ద్రోణ కృప విదుర సంజయ వ్యాసులను పాండవపక్షపాతు లన్నారు. కులహీను లన్నారు. గుణహీను లన్నారు. వారి చరిత్రలను ఇటీవలి దేశచరిత్రల (Histories)తో ముడిపెట్టి, వారివారి కులగోత్రములను, జన్మ కథలను, తమ యిష్టమువచ్చినట్లు- తమతీర్పులకు సరిపడునట్లు మారుపరిచినారు.

భారతకథలకు భారతమే ప్రమాణముగాని, యీనాటి వారి మార్పిడివ్రాతలు ప్రమాణ'మగునా? అవియును యుక్తి యుక్తములై యున్నచో పరిశీలనకైనను పనికివచ్చును. ఆర్జవములేని 'అఘాయిత్యపు' వ్రాతలు గర్హ్యము లగునేగాని గ్రాహ్యము లగునా?

పెండ్యాలవారి ధోరణి దెలియుటకు, వ్యాస భీష్మా దులను గురించి వారువ్రాసిన వాక్యములు కొన్ని చూపు చున్నాను.

## 3. పెండ్యాలవారి మహావాక్యములు

### i. 'వ్యాసుడు చండాలుడు'

(1) "కైవర్తజాతి షోడశవిధ చండాల జాతియందును నధమమని హేమాద్రికృత చతుర్వర్గ చింతామణిలోఁ గలదు. అందువలననే వ్యాసునిఁ జండాలజాతిజుఁ డని చెప్పితిని. కాని బ్రహ్మర్షియే." (పు. 153)

వ్యాసుని తల్లి - యోజనగంధి- వసురాజర్షి వీర్యమున మత్స్యగర్భమున జనించినదిగాని కైవర్తకాంతకు కలిగినది గాదు. కావున వ్యాసుడు కైవర్తుకు కాడు. చ. చింతామణి వాక్యము వ్యాసునివిషయమున నన్వయింపదు. వ్యాసుడు పుట్టుకతోనే బ్రహ్మర్షి. వేదమయుడును, నారాయణావతార మును నైన ఆ మహాత్ముని 'అధమచండాలు'డనుట అజ్ఞానము. ఈ చండాలపు వ్రాత ద్వేషమూలకము.

(2) "అతఁడు (వ్యాసుడు) పాండవు లాధారములేక వనములోఁ బరిభ్రమించుచుండఁగా వారిని గలిసికొని, మనకు సఖ్యముతగియున్న దని......హితబోధలు చేసెను." (పు. 153)

"పాండవులారా! మీవలెనే నేనును నీచకులుడనుగనుక మనకు సఖ్యముతగియున్న"దని వ్యాసుడన్నట్లు పెండ్యాలవారి వ్రాత. ఇది వట్టి అబద్ధము (Miss representation). వారి సొంతకవిత్వము. వ్యాసు డట్లనలేదు.

"పాండవులారా! ధార్తరాష్ట్రు లధర్మముగా మి మ్మడవులపాలు చేయుట విని, మీ హితము కోరి యిటు వచ్చితిని. ఈ కష్టములు మీ మేలుకే వచ్చినవి. కావున చింతింపవలదు. నాకు వారును మీరును ఒకటే. అయినను, బాలురను - దీనులను కనికరించుట మానవస్వభావము. మీరు

కష్టాలలో నున్నారు గావున మి మ్మెక్కువగా నాదరించుట నాకు ధర్మము"

* అని వ్యాసు డన్నమాటలు. పెండ్యాలవారిది దురుద్దేశపు వ్రాతయని చెప్ప నక్కఱలేదుగదా?

**ii. 'భీష్ము డర్థదాసుడు: క్షత్రియజాతివాడు'**

(1) "భీష్ముఁ డొక్కచోట దుర్యోధనాదులం జేరుటకుఁగల కారణము "అర్థస్య పురుషో దాసః దాస స్త్వర్థో న కస్యచిత్" అని చెప్పినాడు. అనఁగా ధనమునకుఁ బురుషుఁడు దాసుఁడు. ధన మెవరికిని దాస్యము చేయదు. అందువలననే- విస్తారముధనమును దుర్యోధనుఁ డిచ్చుచుండుటచేతనే- యాతనిపక్షమున నుంటి ననినాఁడు. ఇది భీష్మునివంటి విరాగికిఁ దగునా? ప్రభువునందును దేశమునందు నభిమానములేక కేవలము ధనాపేక్షచేతనే రాజతంత్రములునడుపువారు రాజోపద్రవ దేశోపద్రవములకుఁ గారకు లగుదురు. అర్థార్థియైన భీష్ముఁ డట్లే చేసెను."

(పు. 121)

పితృప్రీతికొరకు రాజ్యమునే వదలుకొన్న భీష్ముడు, డబ్బుకు మొగమువాచి, దుర్యోధనునికడ పడియున్నా డన్న లోకము నవ్వునుగాని, నమ్మునా? యుద్ధారంభమున ధర్మరాజు భీష్ముని యనుజ్ఞపొందుట కాయనను దర్శించి, సహాయము నర్థించినాడు. అప్పుడు భీష్ముడు,-

"అర్థస్య పురుషో దాసః దా స స్త్వర్థో న కస్యచిత్
బద్ధోఽస్మ్యర్థేన కౌరవ్యై యుద్ధా దన్య త్కిమిచ్ఛసి"

(భీష్మ. ౪౩. ౩౬)

---

* చూ. మూలము. ఆది. ౧౫౧. ౩.

అన్నాడు. భీష్ముని యీ వాక్యములో పెండ్యాలవారు చెప్పిన యర్థ మున్న దేమో పండితులు తెల్పుదురుగాక.

భీష్ముడు దుర్యోధనునకు- "యుద్ధముపెట్టుకొన్నచో నీవు నాశమగుటయేగాక, దేశమునుగూడా నాశముచేసినవాడ వవుదువు. కావున, ఆ ప్రయత్నము మానుకొ"మ్మని యుపదేశించినవాడు.-

"శ్రోతవ్యం ఖలు వృద్ధానాం మాభిశంకీ ర్వచో మమ
నాశయిష్యసి మా సర్వ మాత్మానం పృథివీం తథా"
(ఉద్యో. ౧౪౮. అ.)

అట్టి హితోపదేష్టను "రాజునకును- దేశమునకును ఉపద్రవము గలిగించిన వా"డనుట దుర్బుద్ధితన మనిపించుకొనదా?

(2) "భీష్ముఁడు, పాండవులు గాలికి వానదేవత మొదలగువారికిఁ బుట్టినటులఁ దాను నదికిఁబుట్టిన సంకీర్ణుఁడు గావున, పూర్వాచారపరుఁడగు దుర్యోధనున కపకృతిని, సంకీర్ణులగు ధర్మరాజాదుల కుపకృతిని జేసి యున్నాడని మువ్మాటికిని జెప్పవచ్చును." (పు. 122)

పాండవులమాట అటుండనిండు. భీష్ముడు సంకీర్ణుడు (= కల్తీకులమువాడు) అట! దుర్యోధనుడు స్వచ్ఛకులుడట! భీష్ముడు దురాచారుడట! దుర్యోధనుడు సదాచారసంపన్నుడట! వివేకులు విశ్వసింతురా?

భీష్ముడు దుర్యోధనాదుల కపకృతి చేసినాడో ఉపకృతి చేసినాడో నా యీ వ్యాసమే తెల్పును గావున, ఆ చర్చ వదలి, విమర్శకులు కుంతీమాద్రులను గురించి చేసిన హేయ ప్రసంగములు కొన్ని యుదాహరించుచున్నాను.

## iii. కుంతి - మాద్రి కులటులు

(1) "కుంతి యెటులనో యైదుగురు బిడ్డలను సంపాదించెనని కాని, కుంతీ మాద్రుల కితరుల వలన బిడ్డలు కలుగఁగా వారు దేవమహి ముల వలన బుట్టినవా రని మిష పెట్టిన దని గాని చెప్పవలసియున్నది."
(పు. 115.)

(2) "కుంతీదేవి చాల గుట్టుగల స్త్రీ. ఆమె యర్జునునిదప్ప మిగిలిన నలువుర నెటులనో సంపాదించి కాని, లేక వ్యభిచారముచేఁ దాను ముగ్గ రనుగని సవతిచేఁ గూడ నటుల కనిపించి కాని కౌరవులలో భాగస్వాము లుగాఁ దీసికొని వచ్చియుండును." (పు. 117.)

(3) "కుంతి, సవతి తన్ను నాక్షేపింపకుండఁగ నామె కిగువురం దార్చినది. కోడల కైదుగురు మగ లగుట కనుజ్ఞ యిచ్చినది." (పు. 231)

(4) "కుంతి తండ్రి కుంతిభోజుఁడు, నాగముఖ్యుఁడగు ఆర్యకుని దౌహిత్రుఁడు. నాగవనితలు వేశ్యలుగాగూడ నున్నారు. విశాఖపట్టణపు జిల్లాలో నాగజాతి వేశ్యాస్త్రీ లున్నారు. కుంతి యట్టి వేశ్యాకుల సంప ర్కము కల దగుటచేతనే రహస్యముగాను, బహిరంగముగాను పరులకే గంగగోవువలె బిడ్డలంగనినది." (పు. 231)

ఇట్లే వారు ద్రౌపదిని గూర్చియు వ్రాసియున్నారు. ఆ వ్రాత యిక్కడ నుదాహరించుటకును వీలుగానంత యస భ్యముగా నున్నందువ వదలివేసినాను. (వలయువారు వారి గ్రంథమున, 154 వ పుట చూచునది.)

పాపభీతియు-లోకభీతియు గలవారును, తల్లిత్రోడూ గల వారును - పరమ పతివ్రతలని ప్రణుతికెక్కిన-పరస్త్రీలను గురించి యిట్టి నిరాధారపు నికృష్టపు వ్రాతలు వ్రాయుదురా! తెగించిన వా రెట్లయినను వ్రాయుదురు. భయమేమి?

"నరకే సతి కో దోషో మరణే సతి కిం భయమ్?"

పండితులయ్యును పెండ్యాలవా రిట్టి విపరీత వాదములకు దిగుట,-

"సాక్షరా విపరీతా శ్చే ద్రాక్షసా ఏవ కేవలమ్"

అన్న ప్రాచీనోక్తిని తలపునకు తెచ్చుటలేదా? వారి యీ వ్రాతలలో నొకటియు విమర్శకు తాళి నిల్చునది లేదు.

కౌరవులయందు తమ కభిమానమున్నచో, వారిలో గల సుగుణములేవో తెల్పి లోకమునకును వారియం దభిమానము కలిగింపవలెగాని, "కసిబోక మసిబూసుకొన్న"దన్నట్లు, పాండవులను, వారికి సంబంధించిన స్త్రీపురుషులను, రిత్తకు రిత్త కారులు వ్రేలనేల? వీరు పొగడినంత మాత్రమున చెడ్డ వారు మంచి వా రగుదురా? వీరు తెగడుటచేత మంచివారు చెడ్డవా రగుదురా?

కుంతిని 'వేశ్య' యనియు, 'జారిణి' యనియు, 'తార్పు కత్తె' యనియు వ్రాసి, గాంధారివిషయమున వా రీ క్రింది విధముగా లిఖించినారు.

"దుర్యోధనునిపైఁగల యీర్ష్యను మహాపతివ్రతయగు గాంధారిపైఁ గూడ వ్యాసాదులు కొంతదొరలించి, యామె తనతోడికోడలగు కుంతి, బిడ్డలనుగనుచున్నదని తాను కడుపుబాదుకొని మాంసఖండముఁగనినదని ప్రకృతివిరుద్ధపుగాథ నొకదానిఁ గల్పించిరి. భర్తకులేనికన్నులు తనకేల యని గంతలుఁకట్టుకొని నయనానందసుఖము యావజ్జీవము వదలిన మహా పతివ్రత- తోడికోడలిసంతతిఁజూచి కడుపుబాదుకొనునా?" (పు. 268)

కుంతిమీఁదను - మాద్రిమీఁదను లేనినిందలు మోఫి, లేకిఁవ్రాతలు వ్రాసి విమర్శకు లిట్లు గాంధారిని వెనుక వేసికొని వచ్చుటచేతను, ఆమెలో లోప మున్నను లేదని సమర్థింప బూనుటచేతను, ఆయనకుగల పాండవ ద్వేషము- కౌరవాభిమానము బయటపడినవే గాని, కుంతీ మాద్రులు కులట లని సిద్ధాంతిత మైనదా?

మరియు వారు "వ్యాసు డీర్ష్యాపరుడు; పక్షపాతి" యన్నారు. అదియును పొల్లు ప్రసంగమే. తాము "కుంతీ మాద్రులు గుడిసెవేటులు; గాంధారి మహాపతివ్రత"యన్నారు; వ్యాసుడు- ఆ ముప్పురను మహాపతివ్రతలుగానే వ్రాసినాడు.

ఎవ రీర్ష్యాపరులు? ఎవరిది పక్షపాతపువ్రాత?

పెండ్యాలవారికి, ఏవిధముగా నైనను పాండవపక్షమును దూషించుటయందే దృష్టి గాని, తమ వాదము సప్రమాణముగను సమంజసముగను నుండవలెనన్న తలపు లేనేలేదు.

iv. 'పాండవుల పుట్టుక యెప్పుడో; ఎవరికో'

పాండవుల పుట్టుకవిషయమున వారు వ్రాసిన వ్రాతలు.- 115 వ పుటలో—

"అర్జునుఁ డొక్కఁడే కుంతికిఁబుట్టినటులఁ శార్ఙ్గ శబ్దముచే నూహింపఁదగియున్నది. యమ మరుత్తులు కుంతి జపించినంతమాత్రముననే వచ్చి ధర్మరాజ భీముల నిచ్చిపోయిరి. ఇంద్రు డట్లుగాక సంవత్సరము కుంతీ పాండులు తపస్సు చేసినఁగాని వచ్చి యర్జును నీయలేదు."

అనివ్రాసి, 231 వ పుటలో—

"పాండురాజు పోయినపిమ్మటనే యీమె (కుంతి) బిడ్డలను గని యుండునని నాఁటివారే తలఁచి రనువృత్తాంత మిదివఱకే వ్రాసియుంటిని"

అన్నారు. ఈ రెండువ్రాతలలో ఏది నిజము? ధర్మజ భీమార్జునులు పాండు డుండగా పుట్టినట్లా? అతడు మరణించిన పిమ్మట పుట్టినట్లా? విమర్శకుల తీర్మాన మేమి?

వారి రెండవవ్రాతప్రకారము నకులసహదేవుల పుట్టుక యును పాండుమరణానంతరమే అయ్యుండవలెగదా? అది యెట్లైనది?

మాద్రి సహగమనముచేసిన దని గదా భారతకథ. పాండునితో మరణించిన మాద్రి మరల బ్రతికి బిడ్డలను గన్నదా? సహగమనము చేయనే లేదా?

ఈ శంకలకు 'పెండ్యాల' విమర్శలో సమాధానము లున్నవా? లేనప్పు డది పనికిమాలినవ్రాతయే యగునుగదా!

ఇంకనువినుడు. – 115 వ పుటలో, ధర్మజభీమార్జునులను యమ మరు దింద్రులు వచ్చి యిచ్చినట్లువ్రాసి, 243వ పుటలో-

"పురాణ మునులలో ధర్ముఁడు, వాయువు, ఇంద్రుఁడు–అనువా రున్నారు. వారలే ధర్మజభీమార్జునులకు జనకులు కాఁగూడదా?"

అన్నారు. ఇట్టి స్వవచ వ్యాఘాతప్రసంగములేనా విమర్శ యనగా? పాండవులకు జనకులు వారు కాగూడదా? వీరు కాగూడదా? అని గ్రుడ్డివా డేనుగురూపము నూహించినట్లు-

తా మూహాలుచేయ నేల? చేసి ప్రయోజనమేమి? ఆయూహాల కంత మెక్కడికి? వెట్టివానియూహాలు వెయ్యివిధములు గదా!

ఈ యస్తవ్యస్తపు వ్రాతలవలన పెండ్యాలవారికి పాండవుల జననమునుగూర్చియే నిశ్చయమైన ఒక జ్ఞానము కుదురలే దని ధ్రువపడుచున్నదిగదా! అట్టివారు వ్రాసిన భారతవిమర్శ జిజ్ఞాసువుల కెట్లుపాదేయ మగును? ఎట్లు ప్రమాణమగును?

ఇవియన్నియు నిట్లుండగా, భారతములోనికథలు కొన్ని ప్రక్షిప్తములనుచూ పెండ్యాలవారుచేసిన చర్చ యొకటి యున్నది. అందును వారివ్రాత లిట్లేయున్నవి. మాదిరి కొక్కటి—

## ౪. ప్రక్షిప్తవాదము

"ద్రౌపదీవస్త్రాపహరణ కథ భారతములో తొలుత లేదు నడుమ నెవరో దూర్చినారు. భాసునినాటికిని లేదు. ఉండియున్నచో - భారత కథా ప్రతిపాదకమైన యతని దూతవాక్యములో ఆ ప్రస్తావముండదా?" (పు. 90)

అని వారి వాదము. భాసుని దూతవాక్యములో, ఈ క్రింది వాక్యమున్నది.

"దుర్యోధనః. బాదరాయణ! ఆనీయతాం స చిత్రపటో నను
యత్ర ద్రౌపదీకేశాంబరాపకర్షణ మాలిఖితమ్."

'అంబరాపకర్షణ' మనగా 'వస్త్రాపహరణమే' గదా!

ఇట్లు భాసకృతిలో వస్త్రాపహరణప్రస్తావము కనబడు చుండగా వారు "లే"దనుటకు కారణమేమి? వాదముకొఱ

కసత్యము లిఖించినా రనవలసినదే గదా? కాని, అట్లనుట కంటెను ప్రమాదపడి రనుట సమంజసము. వారి పరిశోధనలో పొరపాటులును కలవనుటకును, అందువల్ల వారి ప్రతివాక్యమును ప్రమాణముగా—అవిచారితముగా—కైకొనుట తగదనుటకును హెచ్చరికగా ఈ విషయము నెత్తిచూపినాను. అంతే గాని ప్రమాదములేనివా రెవరు? ప్రమాదము మానవ సహజముగదా!

వస్త్రాపహరణప్రస్తావము భాసకృతిలో నున్నదిగావున "ఆ కథ భారతములో ప్రక్షిప్త"మన్న పెండ్యాలవారి వాద మవాస్త మన్నది యిక్కడ వివక్షితార్థము.

ఇంతవరకును ప్రస్తావితములైన విషయములు పెండ్యాల వారి గ్రంథస్వభావము తెలియుటకు చూపబడినవేగాని, నా విమర్శకు విషయములుగావు. అందువల్ల వాటి తత్త్వమును టూకీగా వివరించి విడిచినాను.

ఇక ప్రకృతచర్చకు మూలమైన ద్రోణజన్మ వృత్తాంతమునుగూర్చి కొంచెము విపులముగా చెప్పుట యవసరము గావున చెప్పెదను.

## ౫. ద్రోణుడు జారిణీసుతుడు

పెండ్యాలవారు భారతముచెప్పిన ద్రోణోత్పత్తికథ నాక్షేపించుచూ- తాము సవరించుచూ- ఈ క్రిందివిధముగా సెలవిచ్చినారు.

"ద్రోణుఁడు భీష్మునివలె నదిలోఁ గొట్టుకొనిరాలేదు. కాని యొక జారిణికి (అప్సరసకు) భరద్వాజునివలనఁ గలిగినవాఁడు. భరద్వాజముని జలకమాడు నప్సరసంజూచి మోహింపఁగ వీర్యపతన మయ్యెనఁట! దానిని ద్రోణకలశమున నిడఁగాఁ బుట్టినవాఁడు గాన ద్రోణుఁ డని పేరు కలిగిన దఁట! స్త్రీపురుషుల శుక్లశోణితసమ్మేళనము లేకుండఁగ జన్మ మొక్క—శుక్లము చేతనేకలుగునని పూర్వపాశ్చాత్యశాస్త్రము లేవియు నంగీకరింపవు. ద్రోణజన్మకథఁజూడఁగ 'ఘృతాచి'యను నప్సరస భరద్వాజునకు ద్రోణునిఁ గని యా బాలుని ద్రోణకలశములోఁబెట్టఁగ భరద్వాజుఁడే పెంచి పెద్ద వానిఁజేసి యాతనికి ద్రోణుఁడని పేరుబెట్టియుండె నని తోఁచును"(పు.122)

ఈ వ్రాతలోని విప్రతిపత్తులు.—

(1) "ఘృతాచి బాలుని ద్రోణకలశములో పెట్టియుండె నని తోఁచును" అని వారి వాక్యము.

"తోఁచును" అనుట వాదసరణి కాదు. పెండ్యాల వారికి తోఁచినది సత్యమనియు, వ్యాసుడువ్రాసినది యసత్య మనియు వివేకు లనుకొనరు. వారి వాదము చాలవరకు 'తోఁచును'-'చెప్పవచ్చును'-'అయ్యుండును'-అను ధోరణిలోనే నడచును. కావున నంగీకార్యము కాదు.

(2) "కేవల శుక్లమునుండి జన్మకలుగ"దన్నారు.

కలుగునో కలుగదో వీరి కే మెరుక? అవి మహాత్ము లైన యోగులకథలు. మహాయోగుల యోగవీర్యమహిమలు మందబుద్ధులగు మామూలుమానవుల కగోచరములు. శుక్ల శోణితములు రెండునులేకయు కలిగిన జన్మ లున్నవి. నారదుఁడు బ్రహ్మతొడనుండియు, దక్షుఁ డంగుష్ఠమునుండియు పుట్టినాఁడు.

"ఉత్సంగా న్నారదో జజ్ఞే దక్షోఽంగుష్ఠా త్స్వయంభువః"
(భాగవతము)

ఒకకాలమున మానసికసృష్టియు నుండెడిది. ఆ కథలను నమ్మమనువారు భారతముజోలికి పోగూడదు. పోయి, తెలిసీ తెలియని ప్రసంగములు చేయుట తప్పు.

ఇక వారి సవరణసంగతి—

(1) "భీష్ముడు నదిలో గొట్టుకొనివచ్చినా"డట!

వారి కెవరుచెప్పినారు? ఈ వ్రాత కాధారములేదు. ఆధారములేనివ్రాతకు విలువలేదు. ఇది యిట్లుండగా,- వారు, 122 వ పుటలో,- "భీష్ముడు నదికిపుట్టిన సంకీర్ణు"డన్నారు. భీష్ము డెవరికోపుట్టి నదిలోకొట్టుకొనివచ్చినవాడా? నదికే పుట్టినవాడా? ఏదినిజము? ఈ మొగుడుదిగుడు వ్రాతలవలన నేమి తేలినది? పెండ్యాలవారిది అవకతవక వాద మని తేలినది. భీష్మునిజన్మ నీచ మనిపించవలెననిగదా వారీ వ్రాతలు వ్రాసినది? వారి మొత్తుకోలిం దేమి తుదిదాకినది?

(2) "ఘృతాచి-అప్సరస-జారిణి" యన్నారు.

అప్సరసలు జారిణులా? కారే; వారు దేవవేశ్యలు. వేశ్య జారిణికాదు. పోనిండు. భరద్వాజుడు జారుడా? ప్రమాణ మేమి? ఏమియును లేదు. ఆ ఋషి జారుడు కాడాయె; ఆ యప్సరస, పరస్త్రీ (జారిణి) కాదాయె. ద్రోణుడు 'జారిణీసుతు' డెట్లయినాడు? అతడు ఘృతాచికి పుట్టనేలేదు. పుట్టినను

పుట్టినట్లు చెప్పికొన్నవాడు. తన పుట్టుకనుగూర్చియే అట్లు నిస్సంకోచముగా జెప్పికొన్న వ్యాసుడు, ద్రోణుని పుట్టుకకథను గూర్చి యసత్యముచెప్పవలసిన అక్కరయేమి? భారత మొకరి ప్రీతికొరకు వ్రాయబడినదికాదు. అబద్ధములు లిఖింపవలసిన దౌర్భాగ్యము వ్యాసమహర్షి కేనియు పట్టలేదు. కావున పై సవరణ సమంజసముకాదు.

(2)

"బదరీనారాయణమునకుపోవు త్రోవలో, గంగకు సమీపముగా 'ద్రోణ'మను పర్వతమున్నది. ఘృతాచి పిల్లవానిని ఆ కొండచెంత కని యుండును. ఆ కొండపేర, పిల్లవాడు 'ద్రోణు' డనబడియుండును."

నా సమాధానము

ద్రోణునకు 'కలశజు'డనియు పేరుగలదు. కలశమున బుట్టినవానికేగాని- కొండచెంతబుట్టినవానికి- కలశజు డను పేరు రాదు.

"ఆచార్యః కలశా జ్జాతో ద్రోణ శ్శస్త్రభృతాం వరః"

(ఆది. ౧౩౮. ౧౫)

అని భారతము చెప్పుచుండగా- "కొండచెంత పుట్టియుండు" నని, ఊహతో సవరించిన సరిపడునా? మహాత్ముల రచనలను అల్పబుద్ధులమైన మన యూహలతో మార్పబూనుట సాహసము; నిష్ప్రయోజనము.

శ్రీ సుబ్బరామయ్యశాస్త్రిగారి మాత్రపు తెలుక లేని వారు కారు; ప్రాజ్ఞులే. వారి యాక్షేపములను- సవరణలను

నాటిసభలో వెల్లడించుట సందేహనివృత్తికొరకేగాని, మరి యొక యుద్దేశముతో కాదు. కాని పెండ్యాలవారి సిద్ధాంతము లపూర్వము లనీ, నిర్దుష్టము లనీ వారికి గట్టి నమ్మకమున్నది. అట్లు నమ్మినవారు - నూతనసిద్ధాంతప్రియులు - ఇంకను పలువు రున్నారు. వారును స్వయముగా పరిశీలించక, ఆ సిద్ధాంతములకే ప్రాముఖ్య మిచ్చి భారతము నాక్షేపించుచుండుటయును గలదు. తన్మూలమున భారతప్రశస్తికి భంగమును, భారతాభిమానులకు మనఃక్లేశమును తరచు తటస్థించుచున్నవి. విషయము భారతమునకు సంబంధించిన దగుటచేతను, ప్రసక్తివచ్చినది గావునను పెండ్యాలవారి విమర్శతత్త్వమును నే నిట్లు వివరింపవలసివచ్చినది. వారిది దూషణగ్రంథముగావున ప్రమాణము కా దని నూతనసిద్ధాంతప్రియ సోదరులకు నా మనవి.

ఇప్పటికే గ్రంథము చాల పెరిగినది. * వారివాదమును సమగ్రముగా చర్చింపబూనుకొన్నచో, ఇంతకు పదంతలు కాకతీరదు. అట్టిపని పెట్టుకొనవలసిన యక్కరయు నాకు లేదు. అందువలన, వారి విమర్శతీరును సూక్ష్మముగా సూచించి త్యజించినాను.

పెండ్యాలపండితులు మహాభారతవీరులలో మాననీయులైన భీష్మద్రోణులపై పక్షపాత స్వామిద్రోహమహాదోషము

* పెండ్యాలవారి వాదమును, 'బాలవ్యాస' బ్ర. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పూర్తిగా ఖండించినారని విన్నాను. కాని, వారి గ్రంథము నాకు లభింపలేదు.

లారోపించినారు. ఆ పూజ్యుల శీలమునుగూర్చి ప్రజాసామాన్యములో మరికొన్ని శంకలును ఉన్నవి. వాటిని గూడా నాబుద్ధికందినవరకు గ్రహించి, అవసరమైనపట్ల భారతప్రమాణమును చూపుచు- నాకు తోచిన సమాధానములు చెప్పినాను. హేరాళమైన యీ విమర్శలో నా యపరిజ్ఞానము వల్లను, ప్రమాదమువల్లను నెరసు లెన్నో దొరలియుండును. అట్టివాటిని గుర్తించు ప్రాజ్ఞులు దయతో తెల్పుదు రేని కృతజ్ఞతతో గ్రహించి సవరించుకొందును.

నా యీ వ్యాసమున ద్రోణునివిషయము ప్రధానము. భీష్మునిసంగతి ఆనుషంగికము. కర్ణునికథ ఆపతితము. ఇది వ్యాసముగాని కావ్యముకాదు. కనుక భాషానియమములు కొన్ని సడలింపబడినవి. విమర్శ, విద్యార్థులకును సుబోధము కావలె నన్న తలపుతో నే నిందు తేలికమైనభాష నే వాడినాను.

భారతభారతీపరివస్యగా, సత్యనిర్ణయసక్తమతితో నేను చేసిన యీ పరిశ్రమను విశాలహృదయముతో వివేచింప వలెనని విపశ్చితులకు నా విన్నపము.

నా యీ రచనకు కారణభూతులు శ్రీ పైడాసుబ్బరామయ్య శ్రేష్ఠిగారికిని, ముద్రణ కార్యమున నెక్కువ శ్రద్ధ వహించి పుస్తకము నచ్చున ముచ్చటగా తీర్పించిన వివేకానంద ప్రెస్ యజమానులు శ్రీ సుంకు శంకరనారాయణశ్రేష్ఠి గారికిని అనేక ధన్యవాదములు.

—ర చ యి త.



ఓమ్

శ్రీ గురు చరణం శరణమ్.

# ద్రోణప్రశస్తి



## ౧. జీవిత చరిత్ర

భారత మహాసంగ్రామ వీరులలో భీష్ముని వెంట లెక్కకెక్కినవాడు ద్రోణుడు.

అతడు భరద్వాజ మహర్షి కుమారుడు. శుక్ర వంశమున బుట్టిన పుణ్యమూర్తి. అగర్భజుడు. వేద వేదాంగ పారగుడు. యోగనిష్ఠాగరిష్ఠుడు. బ్రహ్మవేత్త.

మరియు నతడు, ఆగమములతోపాటు అస్త్రవిద్యయు సమగ్రముగా నేర్చిన ప్రజ్ఞాశాలి. వేదములకంటెను ధనుర్వేదమే ఆ బ్రాహ్మణునకు చక్కగా నొంటబట్టిన విద్య. ఆ విద్యయం దతడు మహామహోపాధ్యాయుడు; ఆగ్నేయాస్త్రబ్రహ్మాస్త్రాది సకలమహాస్త్రప్రయోగోపసంహారములయందు పరిపూర్ణుడు.

బ్రహ్మతేజమునకు క్షత్రతేజము తోడుపడుటచేత భారద్వాజుని పరాక్రమము అప్రతిమానమై వెలుగొందినది.

ద్రోణుని బలవీర్యశౌర్యసాహసములను, భండనపాండిత్య శౌండీర్యమును భీష్ము డిట్లు ప్రశంసించియున్నాడు.

"అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁడు"

"ఏచినమైన జతం, పెపరినఁ జమరినయట్లు బ్రమందు"

"స్పర్ధని యిశని భావింపరా దనిలోన నంగవిస్ఫురణంబు భంగినూడ"

"సచరాచరములైన జగములెల్ల
నొక్క-మొగమై కడంగినఁ జిక్కవఱచు
దివ్యబాణజాలంబుల దీటుకొలిపి"

"ప్రాణములు దాఁపఁ; డీతని పాటిదొరలఁ
గాన మే రాజ్యములయందు." (ఉద్యో. 4. 229)

అటు పాండవపక్షమునను, ఇటు కౌరవపక్షమునను గల, అర్ధరథులు, సమరథులు, మహారథులు అతిరథులు అందరును ద్రోణాచార్యునిచేతిక్రింద తీరినవారే.

జగదేకధనుర్ధరుడును, దేవాంశసంభూతుడును, కురు పితామహుడును నైన భీష్మునకును ఆ విప్రవీరునియెడ పూజ్య భావమే. పూజ్యభావమే కాదు; గురుభావముకూడా కలదు. ఒకానొకసందర్భమున భీష్ముడు,—"గురు ర్భవాణ్ శిష్యా మహత్తరా వయమ్" (మీరు మాకు గురువులు; మేము మీకు శిష్యులము) అని ద్రోణుని సంభావించినట్లు మహాకవి భాసుడు తన 'పంచరాత్రము'న నుల్లేఖించియున్నాడు.

భారతయుద్ధమున భీష్ముడు పడిపోయినపిమ్మట కౌరవుల పక్షమున సర్వసైన్యాధిపత్యమును వహించిన యోధుడు (commander-in-chief) ద్రోణుడే.

అతడాలమునఁ జేసిన కాలము నాలుగుపగళ్లు, ఒక్క రేయి, అయిదవ నాడు ఇరవై గడియలు మాత్రమే. ఆ కొద్ది కాలములోనే ఆ బ్రాహ్మణునిచేతిలో హతులైన శూరుల సంఖ్య యిరవైయొక్కవెయ్యి. భీష్ముని పదిదినముల యుద్ధములోను, అంతజనము నష్టము కాలేదు. ఆచార్యు డూచకోత కోసినాడు. అతడు చొచ్చినచో ఎల్ల మారిమసగిన ట్లైపోయినది. ఆవిధముగా తనబలము పాలికలనికి బలియగుచుండుట చూచి, అప్పుడు సవ్యసాచియే గురునితో డీకొనవలసివచ్చినది. డీకొన్నాడు. శిష్యుడని చూడక ద్రోణుడూ - ఆచార్యుడని చూడక అర్జునుడూ ఘోరముగా పోరినారు. సదృశములైన శస్త్రబలబాహువీర్యశౌర్యము లసదృశముగా పోరుచున్న ఆ గురుశిష్యులను జూచి సురఖచరవిద్యాధరగంధర్వులు,—

"హరుఁడు వినోదార్థముగా
నిరుమే నయి రణమొనర్చె నింతియ కాకి
ప్పురుసున నక్కజమగు సం
గర మొనరింపంగ నోరులఁగంటిమె యెందుఁ" (ద్రోణ. 5. 295)

అని ప్రశంసించినారు.

ఆ గాటపుపోరాటమున గెలుపోటము లెంతకును ఏర్పడలేదు. ఎట్లేర్పడగలవు? అం దెవరు తక్కువ గనుక! ఒకడు

"విలువిద్యయందు పరశురాముడును నీ కీడుగా"డని భీష్మునిచే పొగడ్తపొందిన బోటుపోటరి; మరియొకడు, అనలనేత్రుని గెల్చిన హాంపీరుడు.

యుద్ధము గడియగడియకును తీవ్రరూపమును దాల్చుచున్నది. గురుని మదినుండి మమత, శిష్యుని భావమునుండి భక్తి పూర్తిగా తొలగిపోయినవి. ఇరువురి హృదయములలోను పౌరుషము పాతుకొన్నది. అప్పుడు సమయజ్ఞుడైన జనార్దనుడు పరిస్థితి పరికించి, గురునిగెలువ నరుని కలవిగాదని తలంచి, తటాలున ధర్మరాజుచేత,—"అశ్వత్థామా హతః (కుంజరః)" అని అబద్ధము చెప్పించినాడు. వినదగని యీ మాట వీనుల బడుటతోనే ఆచార్యుడు,—"ఓకర్ణా! ఓకృపా! ఓసుయోధనా! నేను నాచేతనైనంతయు జేసితిని. ఇక నిశ్చింతగా నిర్యాణము గనగోరి, యిదిగో బాణబాణాసనముల నుజ్జగించుచున్నాను" అని చెప్పి, తాను తొలుత జెప్పిన నియమమును ననుసరించి అస్త్రసన్యాసముచేసి, యోగనిష్ఠనొంది ప్రకటజ్యోతీరూపమున నెగసి పరమస్థానము చేరుకొన్నాడు.

ఇదీ—సంగ్రహముగా ద్రోణుని జీవితచరిత్ర.

---

## ౨. ఆక్షేపములు; విచారణ



ద్రోణుడు, దుర్యోధనుని పటాలముల కధిపతియై, అయిదు దినము లఖండయుద్ధముచేసి, అరాతి వీరుల నిరువదియొక్కవేయి మందిని-వారి రథగజ తురగపదాతి సమూహ సహితముగా - హతమొనర్చి, తుదకు పగవారు పన్నిన కుయుక్తిచేత అకాలమరణమున కగ్గమైన స్వామిహితు డని చరిత్ర చెప్పుచుండగా,- * "ద్రోణుడు స్వామి ద్రోహి; మిత్ర ద్రోహి; మహాదోషి"యను నాక్షేపములతో, అపవాదము తలచూపుట ఆశ్చర్యము గాదా!

ఆ వాదమునకు జనకుడు 'పెండ్యాల' పండితు లని తెల్పితినిగదా. వారినుండి సాంక్రామికముగా దేశమున వ్యాపించుచున్న ఆ వాదమునకుగల యాధారము లేమో, అవి యెంత వర కొప్పదగియున్నవో ఒక్కొక్కటిగా పరామర్శింతము.

ద్రోణుడు నిజముగా దోషి యగునేని, అందుకు ఉత్తరవాది భీష్ముడు. ఎందువల్లననగా.—

ద్రోణుడు భీష్ముని యడుగుజాడలలో నడచినవాడే గాని, వేనుకాలంతయైనను పెత్తనము పెట్టుకొని, తాను

* "స్వామిద్రోహ మిత్రద్రోహ వీరహణ దోషములు ద్రోణునకుఁ గలవని చెప్పవచ్చును." ('పెండ్యాల'-పు. 125)

స్వేచ్ఛగా జేసిన దేమియును లేదు. ద్రోణుడు కర్త; భీష్ముడు కారయితృ. కావున నిద్దరును సమభాగులు. ద్రోణుని చేష్టితము దుష్టమైనను-శిష్టమైనను అందు భీష్మునకు భాగమున్నది. అగ్రభాగము భీష్మునిదే.

కాబట్టి, పై వాదము సరియైనదే యగునెడల ప్రథమ ద్రోహి భీష్ముడు కావలసివచ్చును.

"భీష్ముడును ద్రోహియే; దోషియే" యనుట పరమ సాహసము. అది శఠవాదము; భారతార్థ విరుద్ధము. ఈ విషయమున భారతమునువదలిచేయువాదము నేలవిడిచి సాము.

ద్రోణభీష్ములు కౌరవులకే కాదు; ఎవరికిగాని ద్రోహము తలచు దుస్స్వభావులు కారు; తమకు ద్రోహముచేయు వారికిని ఉపకారమేచేయు సుస్వభావులు.

అది యట్లుండగా, కౌరవులును-పాండవులును భీష్ము నకు మనుమలు; ద్రోణునకు శిష్యులు. మనుమలయెడ నే తాతకుగాని, శిష్యులయెడ నే గురునకుగాని ద్రోహబుద్ధి యుండునా? ఎన్నటికి నుండదు. భీష్మద్రోణులకును లేదు.

కాని, ఆ వృద్ధు లిద్దరికిని పాండవులవర్తనము నచ్చి నది; అందువల్ల వారి నెక్కువగా నాదరించుచుండెడివారు; కౌరవుల నడవడిక నచ్చలేదు; అందువల్ల, "మీ యీ పద్ధతి

మంచిదికా"దని వారిని మందలించు చుండెడివారు. అది మాత్రమున్నది.

అందు తప్పేమి? మంచి తనమును గారవించుట పక్షపాత మనియు, చెడ్డతనము పనికిరాదని చెప్పుట ద్రోహబుద్ధి యనియు ప్రాజ్ఞులు భావింతురా?

అట్టి భావముతో బయలుదేరినదే పై వాదము. అంతే గాని, భీష్మద్రోణులయం దెట్టిదోషమును లేదు.

పాండవుల మంచితనమేమి? కౌరవుల చెడ్డతనమేమి? యన్నసంగతి, బాల్యప్రభృతి వారివారి వర్తనముల తీరును వారి కుటుంబవ్యవహారమును-ఒక్కపూరు తిరుగవేసిన గాని సరిగా మనసుకురాదు గావునను, విమర్శింప వీలుపడదు గావునను పూర్వకథను ముక్తసరిగా జెప్పెదను.

---

# ౩. పూర్వకథ



## (1) కౌరవ పాండవ కలహకారణము

రాజ్యము ధృతరాష్ట్రునిది. అతడు పుట్టంధు డగుటవలన నతనికి మారుగా, తమ్ముడు - పాండుడు - రాజైనాడు. అతడన్నగారియెడ భయభక్తులు గలిగి, అన్ని వ్యవహారములను అన్నగారి పేరనే నడుపుచూ, అతని యభిమానమును, ప్రజలలో మంచిపేరును సంపాదించుకొన్నాడు. రాజ్య మభివృద్ధికి తెచ్చినాడు. ధర్మజాదులు చిన్నవాండ్లుగా నున్నప్పుడే పాండుడు పరలోకగతుడైనాడు.

ధృతరాష్ట్రుడు సోదరునియందలి ఆదరాభిమానముల చేత, పాండవులను తనయింటనే యుంచుకొని, తన బిడ్డలతో సమానముగా ప్రేమించి - పోషించుచు, విద్యాబుద్ధులు నేర్పించు చున్నాడు.

పాండుకుమారులు మంచి తెలివి తేటలుగలవారు. సహజముగనే వినీతులు. పైగా తండ్రియండ తప్పినవా రగుట చేతను, ఉన్నది పరగృహముగావునను అణగిమణగి మెలగుచు, తాతగారికిని, పెదతండ్రిగారికిని, తక్కిన పెద్దలకును విధేయులై, చుట్టపక్కాలకు తలలోనినాల్కలై అందరిమన్ననకును భాజనము లైనారు.

దుర్యోధనాదుల కది యొప్పలేదు. వారు మహారాజు బిడ్డల మన్న దిమాకుగలవార్లు. అందువలన పెద్దపిన్నయంతరువులును, అంతగా పాటించువారు గారు. వారికి పాండవులు జ్ఞాతులుగదా! జ్ఞాతిత్వమే విరోధహేతువై యుండగా, పై పెచ్చు వారు, తమయింట, తమకంటెను మిన్నగా మన్నన లందుచున్నారు. అది యెట్లుసహ్యమగును? 'గతిమాలి మా పంచనుబడియున్న యీ నిర్భాగ్యుల కింత మన్ననయా?'-అన్నభావము కౌరవుల కేర్పడినది. దానికితోడు, చదువు సంధ్యలయందును, సాముగరిడీలయందును తమకంటెను వారు మేలుచేయిగా, మెట్టుకు మెట్టెక్కిపోవుచుండుట మరింత యీర్ష్యకు హేతువైనది.

అది యట్లుండగా,-పాండుకుమారులలో భీముడు కొంటె పిల్లవాడు. బలిష్ఠుడు; మోటుగాడు. వాడు కురుకుమారులను బాలక్రీడలలో పలుమారు పరిభవించి పరిహాసించుచుండెడి వాడు.

జలకేళివేళలలో భీముడు రెండుచంకలక్రిందను పదేసి మంది నిరకబట్టుకొని, నీటముంచి-అదిమిపట్టి, వా రూపిరాడక ఉక్కిరిబిక్కిరి యగుచుండుట చూచి వదలినవ్వెడివాడు. నియుద్ధక్రీడలలో, దుర్యోధనదుశ్శాసనులను, పిడుగులవంటి తన పిడిగుద్దులతో మిక్కిలిగా నొప్పించెడివాడు. కసివూని కౌరవులందరు నొక్కమొత్తముగా కవిసినను, పట్టుపడక గున్న యేనుగు వలె వారి నందరిని కూలద్రోసి, కుమ్మికుమ్మి ఘోష పెట్టెడివాడు.

ఒకమాటు కౌరవులుకొందరు, పండ్లకొరకొక చెట్టెక్కి-యుండగా జూచి, భీము డా చెట్టును బిట్టుగా తన్నినాడు. ఆ తన్నుతో, కాయలతోపాటు కౌరవులును జలజలరాలి పడ్డారు.

* ఇవి యన్నియు పిల్లచేష్టలుగాని, భీముడు ద్రోహ బుద్ధితో చేసినపనులు కావు. కాకపోయినను బాధాకరములే గదా! అతని బలసాహసములును, దుడుకుతనమును దుర్యోధనునకు దుస్సహము లైనవి. ఇట్టివానితోగూడిన ధర్మజాదులు భావికాలమున తమరాచరికమున కడ్డుతగులకపో రన్న భావమును గలిగినది. కర్ణశకునిదుశ్శాసనులతో నాలోచించినాడు. వారందరును కలియబలుకుకొని, భీష్మవిదురుల కెరుకపడకుండా భీము నంత మొందింపవలె ననుకొన్నారు.

అనుకొని, ఒకనాడు, వనభోజనోత్సవ మొకటి కల్పించి అందు దుర్యోధనుడే స్వయముగా నందరికిని వడ్డించుచు వినోదప్రసంగములతో నెల్లవారి యుల్లముల కుల్లాసము గల్పించుచు, భీముని మంచిమాటలతో నుబ్బించుచు, నూరించుచు, కాలకూటము కలిపినయన్న మతనికి వడ్డించినాడు. అతడాకంఠముగా భుజించినాడు. అది రాత్రివేళ. భోజనానంతరము భీము డొకమూల బరుండి, విషప్రభావమువలన మృతప్రాయు

* "ఏవం స ధార్తరాష్ట్రాంశ్చ స్పర్ధమానో వృకోదరః
అప్రియేఽతిష్ఠ దత్యంతం బాల్యా న్న ద్రోహచేతసా."
(ఆది. ౨౮. ౨౪.)

డై నాడు. అది కనిపెట్టి దుర్యోధను డాతనికాళ్ళుచేతులు కట్టించి, గంగలో విసరివేయించినాడు. అంతటితో భీమునివలని పీడ విరుగడయైన దని సంతోషించినాడు. కాని, ఆ సంతోష మున్నాళ్ళముచ్చటయే యైనది.

గంగలోబడిన భీముడు నాగలోకము చేరినాడు. అక్కడ కొన్ని విషనాగములు భీముని కాటువేసినవి. ఆ కాటువలన నతని యుదరములోని విషము విరిగిపోయినది. భీముడు బంధములు త్రెంపుకొన్నాడు. ఇంతలో ఆర్యకుడను నాగముఖ్యు డచటికివచ్చినాడు. అతడు కుంతితండ్రియైన శూరసేనుని తాత. అతడు భీమునెక్కువగా నాదరించి, సర్వవిషహరమును-బలకర మును నైన రసమొకటి యిచ్చి, త్రావించినాడు. నాగరాజయిన వాసుకి భీమునకు రత్నరాసులు బహుమతిగా నొసగి పంపించి నాడు.

భీముడు సుఖముగా నిల్లుచేరుకొని, జరిగిన కథ యంతయు నన్నకుచెప్పినాడు. యుధిష్ఠిరు డీ సంగతి యెవరికిని తెలుపవల దన్నాడు. భీము డార్యకదత్త రసమహిమచేత నాగాయుతబలు డై నాడు.

దుర్యోధనుడు చేసిన మహాపకారము, మరుత్సుతున కీ విధమున మహోపకారమైనది. అదృష్టవంతుల కాపదలును సంపదలుగానే పరిణమించునుగదా !

విషాన్నము పెట్టి గంగలో త్రోసినను చావక, భీముడు బ్రతికివచ్చుట కురుపతి యీర్ష్యాగ్ని కాజ్యముపోసిన ట్లైనది. అయినను, అత డా లక్షణమును వెలిదోపనీక పాండవులతో

యథాపూర్వము కలసిమెలసి వర్తించుచు, నారిసి హాతమార్పు నాలోచనలు చేయుచునే యున్నాడు. భీముడుపోయిననేగాని తక్కిననలువురు తనకు సాధ్యులుకారని యాతని తలపు. ఆతనిమీదనే యాతని కెక్కువ యాసు. అదికారణముగా దుర్యోధనుడొకనాడు —“అత్తమీదికోపము దుత్తమీద జూపిన”దన్న సామెతగా—భీమునిసారథిని గొంతుపిసికి చంపి వేసినాడు.

భీము డాతనిక్రూరకృత్యమును, అన్నకు తెలిపి, ఆగ్రహోదగ్రుడై “అనుమతియిత్తువేని దుర్యోధనుని తుదముట్టింతు” నన్నాడు. ధర్మజుడు తమ్మునికోప ముడిపి, “తొందరపడవల” దన్నాడు. అన్నయాజ్ఞకు బద్ధుడై, అతడు కోపమును దిగ మ్రింగి మిన్నకున్నాడు.

అంతటితో దుర్యోధనుడూరకున్నాడా? మరి కొన్నాళ్లకు రహస్యముగా, మరల నొకమాటు భీమునకు విషాన్నము పెట్టించినాడు. అదియెరిగియున్న యుయుత్సుడు చెప్పినను, వడముడి లెక్కసేయక చంకలబంటిగామెక్కి, చెక్కునను చెమర్చక, గట్టునత్రేచి, నిమ్మకు నీరెత్తినట్లు నిమ్మళముగా నున్నాడు. ఆర్యకదత్తరసమహిమవలన ఆ విషమతని గర్భగోళమున హారించిపోయినది.

దుర్యోధనుని దుశ్చేష్టలను ధర్మజుడు విదురునికి విన్నవించినాడు. అతడు, “వాని యవివేకకృత్యములకు ప్రతీకారము

తలపెట్టక మీరు జాగరూకులరై యుండు"డని యుపదేశించి నాడు. [1]విదురుని యుపదేశమునుబట్టి ధర్మజుడును, ధర్మజుని యాజ్ఞననుసరించి యతని తమ్ములును—ప్రతికారప్రయత్న ములకు దిగక, కౌరవులతో మామూలుగనే మసలుకొను చున్నారు.

పాండవులనుచంపుటకు దుర్యోధనుడును, కర్ణ శకును లును చేసినశ్రమయంతయు, 'ఏటిలో పిసికిన చింతపం'డై పోయి నది. వారి క్రౌర్యముమాత్రము బయటపడినది.

మనలోమాట:-

భీమునివి పిల్లచేష్టలుగాని విరోధకృత్యములు కావు గదా! వాడు దుష్టుడే యగుగాక; వాని దౌష్ట్యమును పెద్దలకు జెప్పి, బుద్ధిచెప్పింపవలెనా? దుర్యోధనుడు వానిని చంపుటకు యత్నింపవలెనా?

[2]భీమునిం జంపి, ధర్మజధనంజయులను కారాగార బద్ధులను గావించి, సర్వసర్వంసహామండలమును తానే పాలింప వలెనని, యతని సంకల్పము. న్యాయ్యమేనా?

కౌరవపాండవకలహమున కిదే యంకురార్పణము.

---

1 "ఏవం దుర్యోధనః కర్ణః శకుని శ్చాపి సౌబలః
అనేకై రభ్యుపాయైస్తాం జిఘాంసంతిస్మ పాండవాన్,
పాండవా శ్చాపి తత్సర్వం ప్రత్యజాన న్నమర్షితాః
ఉద్భావన మకుర్వంతో విదురస్య మతే స్థితాః"
(ఆది. ౨౯. ౩౮)

2 "తం తు సుప్తం పురోద్యానే గంగాయాం ప్రక్షిప్య మహే
అథ తస్మా దవరజం శ్రేష్ఠం చైవ యుధిష్ఠిరం.
ప్రసహ్య బంధనే బద్ధ్వా ప్రశాసిష్యే వసుంధరామ్."
(ఆది. ౧౨౭. ౭.)

(2) యుధిష్ఠిర యౌవరాజ్యము; దుర్యోధన దురాలోచన

ఆ నోటబడి - ఆనోటబడి, దుర్యోధనాదుల దుష్టత్వ దుర్బలత్వములును, ధర్మజాదుల సాధుత్వశక్తిమత్త్వములును- కురువృద్ధ గురు బాంధవులకును, ప్రజానీకమునకును తెలిసిపోయి నవి.

అప్పుడు ధృతరాష్ట్రుడు, ధర్మతనూజుని ధర్మాభిరతిని, ప్రజాను రంజన ప్రవణతను, ధైర్య స్థైర్య దయా క్షమాది గుణ సంపదను సంభావించి, రాజ్య భార ధురంధరుగా నెరింగి, భీష్మ విదురులతో విచారించి, యతనికి యువరాజపట్టము గట్టి నాడు. యువరాజై నను, సర్వోన్నత గుణయుక్తిచేత యుధిష్ఠి రుడు, సార్వభౌముడుగనే విరాజిల్లినాడు.

దుర్యోధనుని హృదయము భగ్గు మన్నది. పగవారైన పాండవులకు భంగపాటేమియు లేకపోగా, పై పెచ్చు రాజ్యాధి పత్యము చేపడుట, యతనికి భరింపరాని బాధ యైనది. దాని కంతకును మూలము తన యనుచితవర్తనమే నని తెలిసికొన లేక, పాండవపక్షపాతు లని భీష్మవిదురులను, తన తండ్రిని గూడా నిరసించినాడు.

"వారివీరి వాక్కులు విని దాయలకు రాజ్యము కట్టి పెట్టుట తగనిపని"యని తండ్రితో తగవులాడినాడు. "రాజ్యము నీదిగాని, పాండురాజుది కాదు. నీ రాజ్యము నాకు రావలెగాని పాండుసుతుల పాలగుట పాడికా"దని ధర్మప్రశ్నములు వల్లించి

నాడు. పాండవుల పాలనము పాతుకొన్నచో మరి కదలింప శక్యము కాదనియు, అపుడు మేము వారి మోచేతినీటి కాసించుకొని బ్రతుకవలసినవార మగుదు మనియు, ప్రజ లిప్పటికే యుధిష్ఠిరుని యెడ ననురాగము బలిసి, అతడే రాజుగావలెనన్న యభిలాషతో నున్నా రనియు, అట్టివారి వాక్యములు నా చెవులలో శూలములై నాటుకొని బాధించుచున్నవనియు, ధర్మజుని యనంతరము రాజ్య మతని సుతునిదే యగునుగావున, ఇంతటనైన నను రాజ్యమును మీరు సాధించి, మా కధికారమును గల్పింపకున్నచో, మేము పిల్ల పిల్ల తరమును-రాజ్యహీనులమై యధోగతిపాలగుదు మనియు మొరపెట్టుకొని, ఎట్లయినను పాండవులను తరిమివేయ వలసిన దని చెప్పికొన్నాడు.

వృద్ధరా జా మాట లాలించి, కొంతచింతించి, "నాయనా, దుర్యోధనా! నీవు చెప్పిన దంతయు నిజమే. నేనును అప్పుడప్పు డట్లే యనుకొనుచుందును. కాని, పాండురాజు నాయెడ నత్యంత భయభక్తులు గలిగి మెలగి, రాజ్యమును మహోన్నతస్థితికి దెచ్చినవాడు? ఇపు డతని కొడుకులు, అతనికంటెను గుణముల మిక్కిలియై, జనముల కనురక్తులై పరగుచున్నారు. అట్టి వారిని నే నిపు డకారణముగా వెళ్లిపొమ్మనజాలను. నే నన్నను, భీష్మవిదురు లంగీకరింపరు. ప్రజలలోను అలజడి పుట్టును. అది మనకు మంచిది కాదు. కావున, నిప్పటి

నీ యీ తల పోప్ప" దన్నాడు. ఆ మాటతో దుర్యోధనుని రాజ్యాశ అడుగంటినది.

పాండవులు ప్రాణాలతోనుండగా తనకు రాజ్యము రా దనియు, రాజ్యసంపాదనకు పాండవహననము తప్ప మరి మార్గములే దనియు, దానికి చిన్న చిన్న చిల్లర యుపాయములు చాలవనియు దీర్ఘముగా యోజించి, కర్ణశకునిదుశ్శాసనులతో సంప్రతించి, ఒక పెద్దయె త్తెత్తినాడు. దానిని కార్యరూపమున బెట్టుటకుగా, మరలతండ్రికడకు పోయి,- "తండ్రీ ! నీవు పాండవులకు రాజ్యమిచ్చిన నిచ్చితివిగాక. అది యేనాటికైనను మాకు రావలసినదే. ధర్మరాజిచటనే యుండి, పాలనము సాగించుచుండునేని, ప్రకృతు లాతనియందే బద్ధానురాగు లగుదురు. పిమ్మట నాకు రాజ్యమువచ్చినను నాకు వశ్యులుగారు. కావున పాండవులను కొంతకాల మెచటికైనను పంపుట నాకు హితము. వారి పరోక్షమున, నిత్యదానసమ్మానములచేత నేను ప్రకృతి జనులను సంతోషపరిచి, వారి యనురాగమును సంపాదించుకొందును. అటుపై పాండవు లిటవచ్చినను చిక్కుండదు. కనుక వారిని కొన్నాళ్ళపాటు, వారణావతమున నుండ నియమింపుము" అని చెప్పికొన్నాడు.

'వీని కీవిధముగానైనను, ఇంత చిత్తశాంతిగలిగించుట మంచి' దనుకొని, అంధరాజు 'సరే' నని తలయూపినాడు.

* తన మంత్రము పారినందుకు దుర్యోధనుడు సింగడుబూరడై, యిదే సందని పురోచను డను మంత్రిని బిలిచి రహస్యముగా నిట్లు చెప్పినాడు.

"పురోచనా! నాకు నీకంటెను విశ్వాసపాత్రుడైన మిత్రుడు లేడు. ఈ రాజ్యమునకు నే నెట్లో, అట్లే నీవును అధిపతివి. మన మీ రాజ్యమును పాండవులనుండి రక్షించు కొనవలెను. అందుకు నీ విపుడు నిపుణతతో నిర్వహించవలసిన

---

* "దుర్యోధనః పరం హర్ష మగచ్ఛత్ స దురాత్మవాన్.
స పురోచన మేకాంత మానీయ భరతర్షభ!
గృహీత్వా దక్షిణే పాణౌ సచివం వాక్య మబ్రవీత్.
మ మేయం వసుసంపూర్ణా పురోచన వసుంధరా.
యథేయం మమ తద్వ త్తే స తాం రక్షితు మర్హసి.
నహి మే కశ్చి దన్యోఽస్తి విశ్వాసి కతర స్త్వయా."
"పాండవా ధృతరాష్ట్రేణ ప్రేషితా వారణావతమ్."
"సత్వం రాసభయుక్తేన స్యందనే నాశుగామినా
వారణావత మద్యైవ యథాయాసి తథాకురు.
తత్రగత్వా చతుశ్శాలం గృహం పరమసంవృతం
నగరోపాంత మాశ్రిత్య కారయేథా మహాధనమ్."
"అగ్ని స్త్వయా తతో దేయో ద్వారత స్తస్య వేశ్మనః
దహ్యమానే స్వకే గేహే దగ్ధా ఇతి తతో జనాః
న గర్హయేయు రస్మాన్ వై పాండవార్థాయ కర్హిచిత్.
స తథేతి ప్రతిజ్ఞాయ కౌరవాయ పురోచనః
యథోక్తం రాజపుత్రేణ సర్వం చక్రే పురోచనః."
(ఆది. ౧౪౩, అ.)

మహాకార్య మొకటి యున్నది. అది యేమనగా: పాండవులు ధృతరాష్ట్రుని యానతిపై వారణావతమునకుండ నిశ్చగించినారు. నీవు త్వరగా ముందచటికిపోయి వారికొరకు లక్కతో నొక సుందరభవనమును నిర్మింపవలెను. వా రందు చేరిన పిమ్మట, నమ్మకముగలుగునట్లు వారితో గూడి యందే వసించుచు, నిద్రించుసమయము కనిపెట్టి, యింటికి నిప్పంటించి, వారిని నిర్మూలింపవలెను. అట్లైన, పాండవు లిల్లుకాలి దగ్ధులైనారని భావించునుగాని, లోకము మనపై దోషము నారోపింపదు" అని తెలియజెప్పి నియోగించినాడు. పురోచను డాప్రకారమే జతుగృహమును నిర్మించుటయు, పాండవు లందు ప్రవేశించుటయు జరిగినది; కాని, * దుర్యోధనుని దుర్మంత్రము మాత్రము సఫలముకాలేదు.

దైవసంపదగల ధర్మజాదులు, దుర్యోధనుని దురుద్యమమును తెలిసికొని, పురోచనునికన్న మున్నుగ తామే ఒకనాటి నడిరేయి యింటికి నిప్పుపెట్టి, రహస్యమార్గమున నెక్కడికో వెళ్లిపోయినారు. గాఢనిద్రలోనున్న పురోచనుడును, ఆ యింట గూఢచారిణిగా నున్న కిరాతవనితయు, దాని బిడ్డలైదుగురును మంటలో మ్రగ్గిపోయినారు.

---

* "దుర్యోధనుఁడు లక్కయింటఁ బాండవుల దహింపవలె నను పాప బుద్ధికలవాఁడైనాడు" ('పెంద్యాల'–పు. 108)

"వారణావతమునకుఁ బాండవులను సాగనంపుటలో... సుయోధనుని కృత్రిమము వ్యక్తమగును." ( ,, – పు. 260)

కుంతియు, పాండవులును లక్కయింట భస్మమైనా రని కింవదంతి పుట్టినది. ఆ వార్తకు ధృతరాష్ట్రుడును, భీష్మాది కురువృద్ధులును, ద్రోణాదిగురుజనులును, పురమునగల యెల్ల వారును శోకాక్రాంతులైనారు. దుర్యోధనశకునికర్ణదుశ్శాసనులు మాత్రము, పురోచనునిమరణమునకు దుఃఖించి, పాండవుల పంచత్వమునకు పరమానందమునందినారు. దుర్యోధనుడు కుంతికిని, పాండవులకును దినవారములుజరిపించి, దిగులుతీరి దీమసముతో నున్నాడు.

ఇట్లుండగా, కొంత కాలమునకు, పాండవులు కుంతీ సహితముగా ద్రుపదుపురమున క్షేమముగా నున్నా రనియు: ద్రౌపదిని వివాహమై సకలసుఖములు ననుభవించుచున్నా రనియు వార్త వచ్చినది. భీష్మ ధృతరాష్ట్రాదు లానందభరిత హృదయులైనారు. దుర్యోధనునకు గుండెలలో బండపడ్డట్లైనది. నిలువున నీరైపోయినాడు. అదవదలైన మది నెటులో పదిలపరుచుకొని, 'దుండగీండ్రైన పాండవుల నింతటితో పోనిత్తునా!' యనుకొని, తండ్రితోను కర్ణునితోను మరల నిట్లొక ఆలోచనచేసినాడు.

"పుత్రమిత్ర బాంధవబలసంపన్నుడైన ద్రుపదునితో చేరుటచేత పాండవులబల మిపుడంతకు రెండంతలైనది. అందుకు తోడు బలరామకృష్ణులు యదువృష్ణిభోజాంధకాదిబంధు బృందముతో వచ్చిచేరిరా, ఇక వారి నెవ్వరును సాధింపజాలరు

కాబట్టి మన మిపుడే జాగ్రత్తపడి ద్రుపదునకు పాండవులతో విరోధము కల్పింతము. లేదా, కౌంతేయ మాద్రేయులలో భేదము పుట్టింతము. అది కాదేని, పాండవుల కై దుగురికిని అందగత్తెలైన అయిదుగురు యువతులను తగులుకొలిపి, ద్రౌపదియందు విరక్తి గలిగింతము. అదియును గాదేని, ఐదుగురి కొక్కతె యాలగుట హాస్యాస్పదమైనపని యని పాంచాలికి చెప్పించి, పాండవుల యెడ నేవము జనింపజేయుదము. కాదా, యేదే నుపాయమున భీముని జంపించి తక్కిన వారిని హీనబలులనైనను చేయుదము. ఈ యుపాయములలో నేది యుచితమో చక్కగా యోచించి చెప్పవలసిన" దన్నాడు.

అప్పుడు కర్ణుడు, "ఇదియేదియునుగాదు. మన మిపుడే దండెత్తి పోయి, ద్రుపదుని భంగపరిచి పాండవులను సహాయ హీనులను జేయుద" మన్నాడు.

ధృతరాష్ట్రుడు,- "కర్ణుడు చెప్పినదే కర్తవ్యముగా నున్నది. ఐనను బుద్ధి మంతులతో విచారించి చేయుట మంచి" దని పలికి, అప్పుడే భీష్మ ద్రోణ విదుర శల్య కృపాశ్వత్థామ సోమదత్తాదులను పిలిపించి, విషయమంతయు వివరించినాడు.

అంతయును విని భీష్ముడు, దుర్యోధనునితో,-"ఓయీ! నాకు మీరును - పాండవులును ఒకటే. నా తలపున నొకరెక్కువ, ఒకరు తక్కువ యనునది లేదు. కావున, పాండవుల

తోడి విగ్రహమునకు నే నెన్నడును నొడబడను. * మరియొక మాట. ఇది మా తాత తండ్రుల రాజ్య మని నీ వెట్లనుకొను చున్నావో, వారును అట్లే యనుకొనుచున్నారు. ఈ రాజ్యమునకు వా రర్హులు కారేని, నీవు మాత్ర మెట్లర్హుడవగుదువు? అపుడు రాజ్యార్హత యెవ్వనికిని లేదు.- 'ధర్మరీత్యా రాజ్యము నాది' యందువేని, వా రింతకుముందే రాజ్యమును పొంది యున్నారు గదా? కాబట్టి, మంచిగనే వారి సగపాలు వారి కిమ్ము. అది సర్వజనులకును హితము. మాకును సమ్మతము. మరియొక మార్గమునకు మే మిష్టపడము. నీ వపకీర్తి పాలగుదువు" అని చెప్పినాడు.

ద్రోణుడు, "కౌరవేంద్రా! మీ తాతగారి వాక్యము సాధుసమ్మతము. విపులార్థయుతము. వయోవృద్ధుడును,

* "దుర్యోధన యథా రాజ్యం త్వ మిదం తాత పశ్యసి
మమ పైతృక మి త్యేవం తేపి పశ్యంతి పాండవాః,
యది రాజ్యం న తే ప్రాప్తాః పాండవేయా యశస్వినః
కుత ఏవ తవా పీదం భారతస్యాపి కస్యచిత్
అథ ధర్మేణ రాజ్యం త్వం ప్రాప్తవాన్ భరతర్షభ,
తేపి రాజ్య మనుప్రాప్తాః పూర్వమే వేతి మే మతిః
మధురేణైవ రాజ్యస్య తేషా మర్ధం ప్రదీయతాం,
ఏతద్ధి పురుషవ్యాఘ్ర! హితం సర్వజనస్యచ
అతో న్యథాచే త్క్రియతే న హితం నో భవిష్యతి
తవా ప్యకీర్తి స్సకలా భవిష్యతి న సంశయః"
(ఆది: ౨౦౩. అ.)

కుశాగ్రీయబుద్ధియు నైన ఆ మహాత్మునివచనము చేకొనుము. అది నీకు లగ్గు. కాదని కర్ణ శకునులబుద్ధి ననుసరింతువేని నీ కెగ్గగును. నామాటవిను" మన్నాడు.

కర్ణుడు ద్రోణునిమాట కాగ్రహించి, – "రాజరాజా! ఈ వృద్ధులబుద్ధి పాటింపదగినది కాదు. శత్రువులను గలిపి కొనుమనుట నీతివిరుద్ధము. ఈ యిద్దరును నీకు హితులుపోలె నున్నారు గాని, నిజమునకు వీరు నీ కహితులు" అనుచుండగా విదురు డాతనిని వారించి, ధృతరాష్ట్రునితో నిట్లన్నాడు.

మహారాజా! దుర్యోధనుడును, ఈ కర్ణశకునులును – అభముశుభము నెరుగని బాలురు. ధర్మాధర్మములచందము వారి కేమెరుక. అట్టివారిపలుకు లాదరించి, నీతిమంతులును – బలవంతులును నైన పాండవులతో డిపగ నింకను పెంచుకొనుట యాపత్తునుకొని తెచ్చుకొనుట యగును. పాండవులు తమకు తామే యజేయులు. వారి కిపుడు బలాధికుడైన ద్రుపదుడు తోడై యున్నాడు. అట్టివారితో పోర నెంచుటకంటెను అవివేక ముండునా? నీ పుణ్యమున ఆ మహాత్ములు జననీసహితము లక్కయింట బ్రతికిరి. వారిని రావించి, యాదరించి, పురోచనుని దుష్కృత్యముమూలమున నంటుకొన్న దుర్యశఃపంకమును వారి యనుగ్రహాజలములతో కడిగివేసికొనుము. దుర్యోధనుని దుర్వర్తనమున నఖిలమహీప్రజకు నపాయమగునని నే నింతకుమున్నే నీకు చెప్పితిని. ఇప్పుడైనను మెలకువపడి, అట్లు గాకుండా, కార్యముచక్కబెట్టుము" అని బోధించినాడు.

---

## (౩) భాగప్రదానము; విరోధవర్ధనము

ధృతరాష్ట్రుడు, -

"నీవును భీష్ముఁడు ద్రోణుఁడు
భూవినుతవిశుద్ధధర్మబుద్ధుల రగుటన్
మీ వచనమున కవజ్ఞత
గావింపఁగ నంత కార్యగతిమూఢుఁడనే?" (ఆది. 8.50)

అని, వెంటనే విదురుని బంపి, పాండవులనురప్పించి, వారి భాగము వారి కిచ్చివేసినాడు.

దుర్యోధనుడు చేతులుపిసుకుకొన్నాడు. "పేదకోపము పెదవికిచే"టన్నట్లు తనలోతాను మండిపడ్డాడు. అంతకంటెను చేయగల్గిన దేమున్నది?

రాజ్యము తండ్రిదిగాని తనది కాదాయె. ఆ తండ్రి భీష్ముని చెప్పుచేతలలోనివాడుగాని స్వతంత్రుడు కాడాయె.. భీష్ముడు పాండవులకు భాగ మిచ్చితీరవలసినదే నని గట్టిగా పట్టుపట్టెను; ఆత డిచ్చివేసెను. ఇక తా నందు కలుగజేసి కొనుటకు సందేదీ? ఆతని కుంగిడిగొన్న ట్లైనది. తాతతండ్రు లకు తగుసమాధానము చెప్పలేక "ఆడలేక మద్దెల వో" డన్నట్లు - పాండవులమీాద మరింతపగబట్టినాడు.

ఇక్కడ ఒక్కమాట : అంధరాజు ఆ విధముగా పాలు పంచి యిచ్చుట కేవలము భీష్మాదులమాటలనుబట్టియు గాదు; పాండవులమీాది ప్రేమచేతను గాదు. అతనికి పాండవులయెడ గల ప్రేమ కంటెను, వారివలని భయము పెద్దది. భాగమిచ్చి

వారిని మంచిచేసుకొనకున్నచో తనకొడుకులబ్రదుకు భద్రము కాదని అతనికి స్పష్టముగా తెలియును. అందుకనే, భీష్మ ప్రభృతులు చెప్పీచెప్పకముందే పాండవులను రప్పించి గుట్టుగా భాగ మిచ్చికూర్చున్నాడు. లేకున్న అంతసులభముగా నిచ్చునా? కొడుకులురాజ్యమునుకోలుపోవుట ఆతనికిమాత్రము వ్యథాకరముగాదా? అయినను, వారు ప్రాణములను కోలుపోవుటకంటెను, రాజ్యమున కొంతకోలుపోవుట మేలుగదా అనుకొన్నాడు. రాజ్యమున సగముపోయినను తనకొడుకులు జీవింపగలరు గాని, కొడుకులు పోయినచో, ఆ దురంతదుఃఖముతో తాను జీవింపఁజాలడు. అందుకే పాప మా వృద్ధు డట్లుపాట్లుపడుట. కన్నకడుపుగదా?

అత డెన్నిపాట్లుపడి యేమిప్రయోజనము? ఆతని తత్త్వము దుర్యోధనునకు గిట్టదు. ఇతనికి కావలసినది రాజ్యమూ కాదు; ప్రాణమూకాదు. పాండవులను రూపుమాపు టొకటే యాతనికి కావలసినది. అది యొకమూర్ఖపుపట్టు. మూర్ఖత కాకున్న, తానా? పార్థులను రూపుమాపువాడు! తానెంత? తనబలమెంత! ఆ జతనమున తనకు భీష్మద్రోణుల సాయ ముండునని తా ననుకొన నవకాశములేదుగదా? వారు వలదన్నపనికి పూనుకొని, వారిసహాయమును తా నేమొగము పెట్టుకొని యడుగగలడు? మతిమాలియో, గతిమాలియో తా నడుగుగాక, అట్టిపనికి తోడుపడ నా పెద్దల కెట్లు మనస్కరించును? వారితోడ్పాటు నాశించియున్నవాడు వారియింగితము నెఱిగిగదావర్తింపవలసినది. "నీవు పాండవులతో

పగగొనుట మాకుసమ్మతము కాదు; నీకు క్షేమకరమును గాదు. నీ వింతటనైనను మనసుమార్చుకొనుము" అని ఆ వృద్ధులిద్దఱును చెప్పిరిగదా! మార్చుకొన్నాడా? వారట్లు చెప్పినపిమ్మట దుర్యోధనుడు జరిపించిన దుష్కృత్యములెన్ని?

ధర్మజుని జూదమునకులాగి, మామచేత మాయపాచికలు పన్నించి, దివాలాతీయించెను. * తన తమ్మునిచేత వలువలొలిపించి, పాంచాలికి మానభంగము చేయించెను. పాండవుల నడవులపాలుచేసి గోడుగుడిపించెను. వారు ద్యూత సమయము చెల్లించి వచ్చి, తమపాలు తమ కిమ్మనగా, నే నియ్యను పొమ్మనెను. పాండవులు బలవంతు లయ్యును హింసాకాండ కిచ్చగింపక, లోకక్షేమముకొరకు తమ దర్పము చంపుకొని, "మా యైదుగురికిని-జీవయాత్రకు-అయిదూళ్లైన నియ్యవయ్యా" అని దేవురించినను, కనికరింపక, "ఐదూళ్లు కాదుగదా, వాడిసూదిమొన మోపదగినంత స్థలమైన నియ్య"ననెను.

ఇ క్లైంతదూరము విచారించినను, దుర్యోధనుని స్వభావములోను, చేష్టలలోను మంచితనము కించిత్తైనను లేకపోయెనే; అట్టివానిని, ద్రోణభీష్ములే కాదు; మరి యెవరైనను-ఎట్లభిమానింతురు? అభిమానింపలేదని ఆ పెద్దలమీఁద [illegible] సొడ్డా!

---

* "నారీరత్నము నట్టు దెచ్చి సభలో[illegible] బాడఁగాఁ
జీరల్ ప్రోవులుగాఁగ నొల్చుటయు [illegible] మహో
గ్రారణ్యస్థలి నిల్పఁబంచుటయు దైన్య[illegible]
సైరింపంజను పాండవేయులకు [illegible]సంధిక్రమం బొప్పదే!"
(ఉద్యో. 1.232.)

# ౮. తప్పెవరిది?

న్యాయవిరుద్ధముగా రాజ్యమున భాగముగోరి, కలహమునకు కారణమైనవారు పాండవులుగావున, తప్పు వారిదేగాని కౌరవులది కాదనియు, తన రాజ్యము నపహరించిన వారిపై దండెత్తుటలో కురుపతి తప్పేమియు లేదనియు నొక వాదము.

అదియు విచారింతము:— భీష్ముడు భాగమిమ్మన్నాడు; ధృతరాష్ట్రు డిచ్చినాడు; పాండవులు పుచ్చుకొన్నారు. అంతేగాని, దౌర్జన్యముగా వా రపహరింపలేదు.

భాగము కోరుటయే అక్రమ మగునేని, ఆ వ్యవహారము న్యాయవిదుల యెదుటబెట్టి, న్యాయనిర్ణయము చేయించి, ఆ మధ్యవర్తుల చేతనే, మీది యక్రమ మని పాండవులకు చెప్పింపవలె. ఆ పెద్దలు చెప్పినను వినక, వారు దుడుకు తనమున పెడదిరిగినప్పుడు, తాను వారిపై కత్తిగట్టవలె. అది ధర్మమార్గము.

శూరులకు శౌర్యమే ప్రధానముగాని, ధర్మాధర్మ విచారణతో నిమిత్తములేదనుపక్షమున, రణభేరి చరిపించి పాండవుల నెదుర్కొని, జయమో పరాజయమో తేల్చుకొనవలె. అది శౌర్యమార్గము.

ఈ రెండుమార్గములును లోకసమ్మతములే.

ఇం దేదియును గాక, ఇంట నిద్రించువేళ నిప్పుపెట్టించుట; భార్యాభర్తలనడుమను - అన్నాదమ్ములనడుమను పోరుపుట్టింపజూచుట; జూదమున మోసగించుట; స్త్రీలను పరాభవించుట - ఇదేమిమార్గము? అశక్త దుర్జన మార్గము గాని, అదియు నొక వ్యవహార మార్గమా!

పాండవులకు రాజ్యమున పా లున్నదని తీర్పుచెప్పి, వారి పాలు వారి కిప్పించిన భీష్మునివదలి, రారాజు పాండవుల మీదికి పోవుట పనికిమాలినతనము. భీష్మునితీర్పు న్యాయ్యము కానప్పుడు తాను వివదింపవలసినది భీష్మునితోగదా! ఆ వగ లేక, అతడు పెడదారి త్రొక్కినాడు, కనుక తప్పు దుర్యోధనునిదేగాని పాండవులది గాదు.

పాండవులు కాంక్షించినది రాజ్యములో తమకుగల భాగము. దానిని పొందుటకు బన్నము లెన్నివచ్చినను భరించుచు, వారు పెద్దల కనికరమును సంపాదించు కొన్నారు. దుర్యోధనుడు, వారి భాగము వారి కియ్యకపోవుటయే గాక, వారిని పరిమార్పవలెనని పట్టుపట్టి, అది తగదని చెప్పిన పెద్దలను తిరిస్కరించి వారి యాదరమును పోగొట్టుకొన్నాడు. అంతేగాని, ద్రోణ భీష్ములకు పాండవులయెడ పక్షపాతము లేదు; దుర్యోధనునియెడ ద్రోహబుద్ధియు లేదు. ఉన్నదను వాదము, ఉలిపివాదము.

---

# ౫. ద్రుపదుని యితివృత్తము

ద్రోణుడు హస్తిపురిచేరుటకును, ఆచార్యు డగుటకును కారణము ద్రుపదుడు. అంతేకాదు; కౌరవపాండవులలో అంతఃకలహములు బలియుటకును ద్రుపదుడే మూలము. అందు వలన నతనియితివృత్తము తెలియుట మన కవసరము.

ద్రుపదుడు ద్రోణునకు బాలసఖుడు. అతడు భరద్వాజు సఖుమిత్రుడైన పృషతుడను రాజు కుమారుడు. పృషతుడు భరద్వాజాశ్రమమున తపస్విగానున్న కాలమున ద్రుపదుని పుట్టుక. ద్రుపదుడును ద్రోణునివలె అగర్భజుడే. పృషతుడు తనకొడుకును భరద్వాజున కప్పగించి తనదారిని తానుపోయి నాడు. తల్లులులేని ఆ పిల్లకాయలనిద్దరిని భరద్వాజుడే సాకి సంతరించినాడు. ఆ బాలకు లిర్వురును ఈడుజోడుగా, మిక్కిలి స్నేహభావముతో ఏకోదరులవలెనే మెలగుచుండెడివారు. ద్రుపదుడును ద్రోణునితోపాటు అగ్నివేశు డను మహామునిని శుశ్రూషించి, అన్నిశాస్త్రములు, ఆగమములు, అస్త్రవిద్యా రహస్యములు నలవరుచుకొన్నాడు. పాండిత్యమునను, పరా క్రమముననుగూడా ఆ యువకులు సరియుజ్జీలుగనే పెం పొందినారు.

చదువుకొనుచున్నదినములలో, ద్రుపదు డప్పుడప్పుడు ద్రోణునితో, "చెలికాడా! నేను రాజైనప్పుడు నిన్ను మంత్రిగా పెట్టుకొందును. అపుడు నేను పేరుకుమాత్రమే రాజును. రాజ్య మంతయు నీదే" అనుచుండెడివాడు.

సరే: కొంతకాలానికి ద్రుపదుడు, ద్రోణుని వీడిపోయి రాజైనాడు. ద్రోణుడు కృపునిచెల్లెలైన కృపిని పెండ్లాడి సంసారియైనాడు. అయినకొన్నాళ్ళకు, కొడుకు (అశ్వత్థామ) కలుగుటయు, సంసారనిర్వహణమునకు ధన మావశ్యక మగుటయు తటస్థించినది.

ద్రోణుడు వైదికుడైనను, అభిమానవిద్యగా నభ్యసించినది అస్త్రశాస్త్ర మగుటచేత అతనికి రాజసమెక్కువ. అందువలన రాజులకడకుబోయి తన్నుదాను తెలుపుకొని ధనము యాచించుట కాయన మనమొప్పలేదు. మహీపతులు మదాంధులనియు, పరేంగితజ్ఞానరహితులనియు, అపరిచితుల నాదరింప రనియు, యాచకుడన్న మరియు నీచముగాజూతు రనియు, అట్టివారి నర్థింపబోవుట తనకుపరువుగా దనియు నాతనిమతము. అందువలన, బ్రాహ్మణప్రభువైన పరశురామునిదర్శనము చేసికొని తనస్థితిగతులు తెలిపికొన్నాడు. ఆ మహాత్ము డాదరించి "అబ్బాయీ, నా యొద్దగల విత్తమంతయు విప్రకోటికి కొల్లపెట్టినాను; భూమియంతయు కశ్యపునకు ధారవోసినాను; శరములు, శస్త్రములు, శరీరముమాత్రమే యిపుడు మిగిలియున్నవి. వీటిలో నీకుకావలసినవి కైకొను" మన్నాడు. అప్పుడు ద్రోణుడు, అర్థ మెందైనను లభింపవచ్చునుగాని అస్త్రము లట్లులభించునవికావని యాలోచించుకొని, అక్కడనే కొన్నిదినము లుండి, ఆ మహానుభావు

నారాధించి, అనేకదివ్యాస్త్రములు ప్రయోగరహస్యమంత్ర సహితముగా నార్జించుకొన్నాడు.

అటుపై నొకనాడు, అతని కదాటున జ్ఞప్తికివచ్చినాడు - తన చిన్ననాటి నెచ్చెలి - ద్రుపదుడు. అతడు రాజై నను బాల్యమున తనతో తిని, తనతో తిరిగి, తనతో పెరిగి, తనతో చదివి యెంతో కాలము 'మమేకము'గా తనయింటనే యున్నవాడుగావున తన్నెక్కువమక్కువతో చూచుననియు, ఆ నాడు మంత్రిత్వమేయిత్తు నన్నవాడుగావున, ఈ నాడు ధనసహాయము తప్పకచేయు ననియు నిశ్చయించుకొని, వెంటనే బయలుదేరి సకుటుంబముగా, నెకాయెకి ద్రుపదుని పురికిబోయినాడు. పోయి, అతనిని సన్నిధిచేసికొన్నాడు. కాని, అతడు చూచియు పలుకరించలేదు. గుర్తుపట్టలేదు కాబోలు ననుకొని - "నేను ద్రోణుడను; నీ బాలసఖుడను; సహాధ్యాయిని" అని తన ప్రవర చెప్పుకొన్నాడు. తాను వచ్చినపనినిగూడా సన్నగా సూచించినాడు. ఆ మాటల కా రాజు చీదరించుకొని, మొగము ముడివేసికొని, "ఓయి తెలివి మాలినవాడా! అంతర మెరుగని నీ ప్రసంగ మంతటితో నాపుము. మహారాజును నే నెక్కడ! కూటిపేదబాపడవు నీ వెక్కడ? మన కిద్దరికిని సఖ్య మెక్కడ? ప్రభువులు కార్య వశమున నెందరినో కలియ చూతురు. ఆ కలయిక తాత్కాలికము. అది మైత్రి యనుకొనువారు ద్రవివేకులు. మమువంటి మహీనాథులకు నినువంటి నిర్భాగ్యునితో కార్యకారణమైన

సఖ్య మెన్నడును కానేరదు. ఇక నధికప్రసంగములకు దిగక, యింతటితో తిన్నగాతిరిగిపో'' అని యీసడించినాడు.

ద్రుపదుడాడిన ఒక్కొక్కమాట, ఒక్కొక్కయీటె పోటై హృదయమును నొప్పింపగా ద్రోణుడు - ''వీడు క్షత్రియుడై నను మిత్రుడుగదా యని నమ్మివచ్చి, పరువు పోనాడుకొంటి''నని చింతించి, క్రోధమున కిది తరుణముగాదని తమాయించి, తలవంచుకొని దాటిపోయినాడు.

గమనించితిరా ద్రుపదుని దురుసువర్తనము! చిన్ననాటి స్నేహితుడని చిరకాలమునకుచూడవచ్చిన యొక యుత్తమవ్యక్తికి, ధనధాన్యములు త్రవ్వితలకెత్తకపోయిన పోయెగాక; మంచిమాటలతో మన్ననయైనను చూపవలదా? తానేమి మూఢుడా? వేదశాస్త్రములు చదివినవాడే! ఎన్ని చదివి యేమి సార్థకము! వివేకము లేనప్పుడు. చదువులు ప్రకృతిని మార్చగలవా?

ద్రుపదు డైశ్వర్యగర్వమున నట్లుచేసె నందురు. కాని, అది సరియైనమాటకాదు. ఐశ్వర్యవంతు లందరును అట్లు చేయుచున్నారా? అది, ఒక్కొక్కని జాతకలక్షణముగాని, అందుకు కేవల మైశ్వర్యము కారణముకాదు.

కారణమేదయిననేమి? భారద్వాజునకు భరింపరాని పరాభవముజరిగినది.

---

# ౭. హస్తినలో ఆచార్యకము

ఆ పారున కేమియు పాలుపోలేదు. "గోరుచుట్టుమీాద రోకటిపో"టన్నట్లు, దారిద్ర్యపీడకు, అవమానబాధ తోడై నది. మానవంతునకు లేమికంటెను పరిభవము దుస్సహముగదా!

ఆ బల్లిదపు బాపని యుల్లము దుకెక్కినది. ధూర్త ద్రుపదజిగీషాతీవ్రజ్వరము ముంచుకొని వచ్చినది. ఉపాయ మూహకు రాలేదు. ఆలోచనలో పడ్డాడు. ఆ యాలోచనలో 'ఇపు డిక్కడినుండిపోవుట యెక్కడికి?' అన్న ప్రశ్న ముందుకు వచ్చినది. పారజూచినాడు. అపుడు మనసుకు వచ్చినాడు-బావ మరది-కృపుడు.

కృపాచార్యుడు హస్తినాపురమున కురుకుమారులకు విలువిద్య గరపుచూ సుఖముగా జీవనము చేయుచున్నాడు, తానును ప్రస్తుత మట కరుగుటయే ప్రథమకల్ప మను కొన్నాడు-భారద్వాజుడు. అక్కడ కొన్నాళ్లపాటుండి, తన జీవనమునకును, ద్రుపదగర్వనిర్వాపణమునకును తగినదారి నిదానముగా యోచింపవలె నని ఆయన సంకల్పము. ఆ సంక ల్పముతో, భార్యాపుత్రులతో హస్తినకు వెళ్లి బావమరది యింట బసచేసినాడు. కాని, ద్రుపదుని కథ ఆతనికి చెప్ప లేదు. తన సంసారపు గొడవను గూర్చియు ప్రస్తావింపలేదు.

ప్రభువులను దర్శించి, తనవిద్యావిశేషమును ప్రకటించి, తనయక్కరను సూచించినచో వారి మన్ననలభించుటకు

సందేహములేదు గాని, ఆ శక్తి ఆయనమన స్తత్త్వమునకు గిట్టదుగదా! అందువలన, అట్టిప్రయత్నము పెట్టుకొననే లేదు.

దినములు కడచిపోవుచున్నవి. ద్రోణునకు కర్తవ్య మేమియూ తోచలేదు. ఇట్లుండగా, నొకనాటిసాయంకాల మాతడుబుసుపోకకై పట్టణమువెలుపలి యుద్యానవనాదులు తిలకింప నరిగి, అం దొకచోట, ఒక నూతిచుట్టును పలువురు యువకులు గుంపుగాచేరియుండుట చూచి, విషయ మేమో తెలిసికొందమని, అచటికి పోయినాడు. అందు చేరియున్న వా రెవరో కారు; ధృతరాష్ట్రుని కుమారులు; పాండురాజు కుమారులు. వా రక్కడ బంతి యాడుచుండగా, ఆ బంగారు బంతి యెగిరి ఆ నూతిలో పడిపోయినది. దానిని బయటికి తీయుట కుపాయము తోచక వా రందరును మాటిమాటికిని నూతిలోనికి తొంగిచూచుచూ, నిరుత్సాహులై యున్నారు.

ద్రోణు డా సమాచారము వారివలన విని 'ఓసి! ఇంతేనా!' అని చిరునవ్వు నవ్వి, "రాజకుమారులారా! భరత వంశమున బుట్టి, అస్త్ర శస్త్ర విద్యలయం దారితేరిన గౌతముని శిష్యులై, యీ చిన్న పనికిని చాలక మీ రి ట్లొండొరుల మొగములు చూచుకొనుచూ - ఉత్సాహము చెడి యుండ వచ్చునా? మీ బంతి నిప్పుడే తీసి మీ కిచ్చెదను చూడు" డనుచూ, వారి కడనుండియే ఒక బాణము కైకొని, అభిమంత్రించి, బంతిలో గ్రుచ్చుకొనునట్లు వేసి, ఆ బాణాగ్రమున

మరియొక బాణమును, దాని చివర నింకొక బాణమును, దాని తుది వేరొక బాణమును నాట నేసి, యిట్లు వరుసగా బాణములనే త్రాడుగా జేసి, బంతిని బయటికి లాగి ఆ కుమారుల కిచ్చి వేసినాడు. వా రా యపూర్వ శరప్రయోగ విశేషమున కచ్చెరువు పడి, ద్రోణుని తమ తాతగారి కడకు తోడ్కొని పోయి, జరిగిన కథ యంతయు తెలిపినారు.

భీష్ముడు సంతోషించి, ద్రోణుని పూజించి, గొప్పగా సత్కరించి, "ఆర్యా! విల్లు నేర్పునను, నయ నైపుణమునను పరాక్రమగర్వసంపదలయందును - పరశురాముడును నిను బోలడని నే నింతకు ముందే వినియున్నాను. నీ విట్లు విచ్చేయుట వెదకబోయిన తీగ కాళ్లకు తగిలిన ట్లైనది. ఇది మా భాగ్యము. ఈ బాలురు నా మనుమలు. వీరు ధృతరాష్ట్రుని పుత్రులు- నూర్గురు. వీ రైదుగురును పాండురాజు కుమారులు"- అని వేరువేర చూపి, "వీరిని నీ శిష్యులుగా గైకొని, అస్త్ర విద్యా కుశలులను చేయవలసిన" దని ప్రార్థించినాడు. ద్రోణుడును, సంతోషముతో సమ్మతించినాడు. ద్రోణుడు ద్రోణాచార్యు లైనాడు.

అంతవరకును, ఆ బ్రాహ్మణుని హృదయమును బాధించుచున్న ధనార్జనసమస్యయు, ద్రుపదతిరస్కార ప్రతీకారసమస్యయు ఆ క్షణముతో తీరిపోయినవి. మహాప్రభువులప్రాపు; ఎంతపనికైనను చాలిన శిష్యసంఘము. ఇంకేమి కావలె?

"మూడు పూలు; ఆరు పిందెలు" అన్నట్లైనది ఆచార్యుని పని. భీష్ముని అస్త్రవిద్యాకళాశాలలో తాను ప్రధానాధ్యాపకుడు – తన బావమరది సహాధ్యాపకుడు.

ఈవిధముగా, ద్రోణుడు, ద్రుపదునిమూలమున కౌరవులకు – పాండవులకుకూడా ఆచార్యుడైనాడు.

ద్రుపదుడు ద్రోణునకుచేసిన అవమానము, ఈ తీరున గొప్ప బహుమానమునకు త్రోవచేసినది. ఒకప్పుడు కీడే మేలుకు మూలమగును.

---

# ౭. అర్జునునిపై నభిమానము



ఆచార్యుడు కౌరవపక్షమువారికి అస్త్రవిద్య సరిగా బోధింపలేదనియు *అన్నిరహస్యములను అర్జునునికే నూరిపోసినాడనియు, అది పక్షపాతముకాదా? యనియు, ఆక్షేపకుల ప్రశ్న.

కర్ణునకు బ్రహ్మాస్త్ర ముపదేశింపకపోవుట యీ ప్రశ్నకు మూలము. అస్త్రములు అర్హతనుబట్టి యొసగదగినవిగాని అడ్డగోలుగా, అడిగినవారి కందరికిని ఇచ్చివేయదగినవి కావు. ఆచార్యు డీ విషయమును,—

"వ్రతసమన్విత భూసురవర్యుఁ డొండె
నిరుపమాన తపఃపుణ్యు నృపతి యొండె
గాని యన్యులు బ్రహ్మాస్త్రదానమునకుఁ
బాత్రములుగారు; నీకు నీఁ బాడి గాదు" (శాంతి. 1.19)

అని, కర్ణునకు తెలియజెప్పినాడు. అతడు మారుమాటాడక వెళ్ళిపోయినాడు. ఇందు పక్షపాత మే మున్నది? పాడిగాని పని ఆ బ్రాహ్మణు డెట్లుచేయగలడు? ఆయన కర్ణున కియ్యదగిన యస్త్రము లెన్నో యిచ్చియున్నాడు. అందుకు కర్ణుని వాక్యమే సాక్ష్యము—

---

* "అర్జునునకు విలువిద్య నేర్పుటలో...ద్రోణుని పాండవపక్షపాతము స్పష్టపడియున్నది" ('పెండ్యాల' - పు. 124)

"కవచకుండలముల నింద్రునకిచ్చితివేని, అర్జునుండు నీకు దుర్జయుండగు"నని సూర్యుడు హెచ్చరించినపుడు, కర్ణుడు,-

"అర్జునుండు దుర్జయుండని చూడవలదు; ద్రోణుండు నాకొసంగిన దివ్యాస్త్రంబు లల్పంబులుగావు." (అరణ్య. 7.304)

అని బరవసముగా బదులుపలికినాడు. కావున, కర్ణునకు బ్రహ్మాస్త్ర ముపదేశింపకపోవుట పాడిగామిచేత గాని, పక్షపాతముచేత గాదు.

ఆచార్యుడు కర్ణునకుచేసిన అస్త్రబోధ దుర్యోధనాదులకు చేసియుండడా? రహస్యములవిషయమా? దుర్యోధనాదులకేకాదు; కొన్నిరహస్యములను, ధర్మజ భీమ నకుల సహదేవులకే చెప్పలేదు. ఒకకొన్ని తన తనయునకును దెలుపక పార్థునికిమాత్రమే తెల్పినాడు. అది పక్షపాతబుద్ధిచేతగాదు; విద్యార్థుల శక్తిసామర్థ్యముల ననుసరించి జరిగినపని.

విజయునకుగల విద్యాసక్తి, రహస్యగ్రహణశక్తి, గురుభక్తి తక్కినవారికి లేవు. అందువల్ల అతనికే బోధించినాడు. ఈ సంగతి భారతములో స్పష్టముగా చెప్పబడియున్నది.

"నరుఁ డస్త్రశస్త్రవిద్యా
పరిణతి నధికుఁడయి, వినయపరుఁడయి, శశ్వ
ద్గురుపూజా యత్నంబునఁ
బరఁగుచు సంప్రీతుఁజేసె భారద్వాజున్" (ఆది. 5.226)

"అతని యస్త్రవిద్యాభియోగమునకుఁ
బ్రియశిష్యవృత్తికిఁ బెద్దమెచ్చి,
అన్న! ధనుర్ధరు లన్యులు నీకంటె
నధికులుగాకుండు నట్లుగాఁగఁ

గలుపుదు విలువిద్య ఘనముగా నని పల్క-
ద్వంద్వసంకీర్ణయుద్ధముల తెఱఁగు
రథ మహీ వాజి వారణముల పైనుండి
దృఢ చిత్ర సౌష్ఠవ స్థితుల నేయ
బహువిధవ్యూహభేదనోపాయములను
సంప్రయోగరహస్యాతిశయముగాఁగఁ
గఱపె నర్జునుఁ; ద్రోంటి భార్గవుఁడు వింట
నిట్టిఁడే! యని పొగడంగ నెల్లజనులు'' ( ,, - 5.230)

గురువులు, తమ బోధలను శ్రద్ధగా విని చప్పున గ్రహింపగల శిష్యులనే యెక్కువగా ప్రేమింతురు. వారికే తమ విద్యను ధారవోయుదురు. వారు, అందరికిని - అన్ని రహస్యములను చెప్పరు. ఏ శిష్యు డెంతమాత్ర మందుకొనగలడో గమనించి, ఆ శిష్యున కంతమాత్రమే అందింతురు.

''తమవిద్య నెవ్వ రే మా
త్రము గనఁజాలుదురు వారి దండను దన్మా
త్రమ ప్రకటింతురు బుధు; లు
త్తముల మహిమ 'నీరు కొలఁది తామర' సుమ్మీ'' (క.శా. 2.89)

అనిగదా సుభాషితము!

ఇందు కొక్క తార్కాణము.—

ఆచార్యు డొకనాడు తన శిష్యుల వింటినేర్పు పరీక్షింపదలచి, పిట్టబొమ్మ యొకటి, చెట్టు చిటారు కొమ్మమీద లక్ష్యముగా బెట్టి, శిష్యుల కందరికిని చూపించి, ''మీ రొక్కొక్క రే-నేను పిల్చినపుడు వచ్చి, ఆ పిట్ట తల తెగగొట్టవలె'' నన్నాడు.

విద్యార్థు లందరును విండ్లెక్కు వెట్టి, అమ్ములు తొడిగి, అయ్యవారి పిల్పున కెదురుచూచుచు, బారుతీరి సిద్ధముగా నిల్చున్నారు. ద్రోణుడు, ముందు ధర్మనందనుని బిల్చి, "నీ వా లక్ష్యమున దృష్టి నిలిపి, నా మాట వెంటనే దానిని కొట్టవలె" నన్నాడు. అతడు 'సరే' నని లక్ష్యమును చూచుచు నిలువబడ్డాడు. అపు డీ మాటలు నడచినవి.

ద్రోణుడు:- లక్ష్యమును చక్కగా చూచుచున్నావా?

ధర్మజుడు:- చూచుచున్నాను.

ద్రో:- నన్నును, నీ తమ్ములను చూచుచున్నావా?

ధర్మ:- మిమ్మును, నా తమ్ములను లక్ష్యమునుగూడా చూచుచున్నాను.

ద్రోణుడు, "అట్లయిన నీ దృష్టి చెదరినది. ఇక నీ వా లక్ష్యమును కొట్టజాలవు; నీవు నా విద్యకు తగవు, తొలగిపో" మ్మన్నాడు.

భీమ నకుల సహదేవులును, దుర్యోధనాది సకల విద్యార్థులును ఆ పరీక్షలో అట్లే తప్పిపోయినారు. గురుడు తుద కర్జునుని బిల్చి లక్ష్యము చూపించి, అందరి నడిగినట్లే అడిగినాడు. అతడు "పక్షిశిరము తప్ప మరియొకటి నాకు కనబడుటలే" దన్నాడు. గురుడు "మంచిది కొట్టు" మన్నాడు. అనుటయే తడవుగా, అత డా పిట్ట తల నేలబడ గొట్టినాడు.

"అట్లశ్రమమున నా కృత్రిమపక్షి తలఁ దెగనేసిన యర్జును నచలిత దృష్టికిని, లక్ష్యవేధిత్వమునకును మెచ్చి ద్రోణు డతనికి ధనుర్వేదరహస్యము లుపదేశించినాఁడు."

ఈ కథ చదివిన బుద్ధిమంతులు, భారద్వాజుని బాణ విద్యాశిక్షలో పక్షపాత మున్నదందురా?

'చాద స్తము' గాని, పక్షపాతము ప్రతిభను కలిగించ గలదా? పాండిత్యమును ప్రసాదించగలదా? గ్రహణశక్తిలేని ముసలాగ్రబుద్ధికి, ద్రోణుడు కాదు; స్థాణుడైనను చదువులు పట్టింప గలడా? కుంతి కడగొట్టుకొడుకు కుశాగ్రబుద్ధి. అది కనిపెట్టి, గురు వన్నిరహస్యములును అభిమానపూర్వకముగా నేర్పినాడు; అతడు నేర్చుకొన్నాడు. అందు గురుని పక్షపాత మేమున్నది?

చెప్ప మరచినాను. అస్త్రాచార్యుని హృదయమున, అర్జునునిపై నభిమాన మాచార్యక మారంభమైననాడే అంకు రించినది. ఎట్లనగా—

ద్రోణుడు తన నూటైదుగురు శిష్యులను నిలువబెట్టి, "కుమారులారా, మీలో, నా విద్యయంతయు నేర్చి, నేను చెప్పెడిపని నెరవేర్చి, నా కోరికతీర్పగలవా రెవరో ముందరికి ర"మ్మన్నాడు. "ఆపని యెట్టిదగునో! మనము నెరవేర్ప గలమో - లేమో!"యని శంకించుకొని, గుసగుసలుపోయి కురుకుమారులు కొందరు తెల్లమొగము పెట్టినారు. కొందరు మొగములు తిప్పుకొన్నారు. ధర్మజ భీమ నకుల సహదేవులు ఆలోచనామగ్ను లైనారు.

అర్జునుడు ముందుకువచ్చి, "ఆచార్యా! అది యెట్టి పనియైనను నెరవేర్చి, నేను మీ కోరిక తప్పకతీర్చెదను" అని ధీరముగను సోత్సాహముగను ప్రత్యుత్తరమిచ్చినాడు.

ఆతని ధైర్యమునకును, సాహసమునకును, గురువాక్పరిపాలన తత్పరతకును సంతోషించి ద్రోణుడు, "ఈ గుంపులో నా పేరు నిలుపగలవాడును, నాకు పనికివచ్చువాడును వీ డొక్కడే"నని నిశ్చయించుకొన్నాడు. ఆ నిమిషమునుండియే యతనిపై నొక కన్నుంచసాగినాడు. క్రమక్రమముగా ఆ యభిమానముస్థిరపడినది. పార్థుడు దేశికునకు తనయెడగలిగిన సదుద్దేశమును జాగ్రత్తగా కాపాడుకొనుచు, భక్తిశ్రద్ధలతో బాణవిద్యావిశేషము లభ్యసించుచు, ప్రధానశిష్యుడైనాడు.

అట్టి యుత్తమాంతేవాసి నభిమానించుట ద్రోణుని దోషమా? అది పక్షపాతమా?

---

# ౮. గురుదక్షిణ

అస్త్రవిద్యాశిక్షణ మవసితమైన పిమ్మట కుంభసంభవు డొకనాటి యుదయమున, శిష్యుల నెల్ల రావించి, "బాలవీరు లారా! మీరందరును నా శిక్షణమున బాణవిద్యలో పండితు లైనారుగదా! మరి, నాకు గురుదక్షిణ యేమిచ్చెద" రన్నాడు. "మీ రేది కోరిన నది యిచ్చెద" మని యెల్లరు నేకవాక్యముగా పలికినారు. అప్పు డాచార్యుడు, "మీరు నా కేమియు నియ్య నక్కరలేదు. పాంచాలాధీశుడైన ద్రుపదుడు నా కపరాధి. అవివేకకారణ దారుణైశ్వర్యావ లిప్తుడైన అవ్వాని నోడిచిపట్టి తెచ్చి నా ముందు నిలువ బెట్టుడు. అదే నాకు గురుదక్షిణ" అన్నాడు.

అనుటయే తడవుగా దుర్యోధనుడు కర్ణు నండగాగొని, తమ్ములతోను, తన జట్టుకు చేరిన తక్కిన క్షత్రియ కుమారుల తోను బయలుదేరి బారుబూరున పోయినాడు. పాండవుల కన్న ముున్నరిగి, ద్రుపదుని లాగుకొనివచ్చి, గురువుగారి మెప్పందవలెనని యతని యుబలాటము. అంతేగాని, ద్రుపదు డెంతటివాడు; తన బలశౌర్యము లేపాటివి; ఆ పని సాధ్యమా, అసాధ్యమా! అన్న యోచన, అతనికి తట్టనేలేదు. ఆతని హృదయమున లోతు తక్కువ.

దుర్యోధను డటు పోయిన తరువాత, అర్జునుడు ద్రోణు నితో, "గురువరా! ద్రుపదుడు మీకు సఖుడై, మీతో సమ ముగా శరవిద్య నేర్చినవాడనియు, మీ కెనయైన జోదనియు నేను వినియున్నాను. అట్టి జెట్టి, యీ దుర్యోధనాదుల కలవి

యగునా? అయినను చూతము. పోయినవారిని రానిండు. అవసరమగుచో నే నరిగి, ఆ పని చక్కబెట్టుకొని వత్తు" నన్నాడు.

ఆచార్యుడు చిరునవ్వుతో 'మంచి' దన్నాడు. * కర్ణ దుర్యోధనులును, వారి బలగమును ద్రుపదునిచేత తన్నులు తిని, బిక్కమొగములతో చక్కావచ్చినారు.

వెంటనే సవ్యసాచి, ఆచార్యునకును – అన్నగారికిని అభివాదనములుచేసి, అనుజ్ఞపొంది, వడముడియు కవలవారును తోడునడువ కదలిపోయి, ద్రుపదుని సేనలను దుమారుమ్మాళిగా తూలించి, అతనిని బట్టి తనబండిచక్రమున కంటగట్టి తెచ్చి, గురువుగారి ముందర నిలువబెట్టినాడు.

ద్రోణుడు, ఎంతో కాలముగా తన డెందమున గూడు గట్టుకొనియున్న పరాభవఖేదము తొలగి పరమానందపరవశు డైనాడు.

ఆ విధముగా తన ప్రతిష్ఠను కాపాడిన, అర్జునుని, ఆతని పక్షమును ద్రోణు డభిమానించుట దొడ్డనేరమా?

ద్రుపదు నట్లు పట్టుకొనివచ్చినపిమ్మట, ఆ శిష్యుని యసిగదాశక్తితోమరాది ప్రహరణప్రవీణతకును, పరమహీపాల పరాజయోత్పాదనపరాక్రమమునకును హెచ్చుగానిచ్చ మెచ్చి ద్రోణు డతనికి బ్రహ్మశిరోనామకాస్త్రమును సప్రయోగ

* "యజ్ఞసేనేన సంగమ్య కర్ణదుర్యోధ నాదయః
నిర్జితాః సం న్యవర్తంత తథాన్యే క్షత్రియర్షభాః"
(దిఆ. ౧౬౫. ఆ.)

నివర్తనముగా ననుగ్రహించినాడు. 'నివర్తన' మనగా ఉపసంహారము (విడిచినబాణమును వెనుకకురప్పించుట).

ఆ బ్రాహ్మణుడు తన కుమారున కా బాణమును ప్రయోగించు టేగాని, ఉపసంహరించుట నేర్పలేదు. మరి, ఆయన కా శిష్యునిపై గల కూరిమియెట్టిదో, దానికి కారణ మేమెూ ఆక్షేపకు లాలోచింపవలదా!

ఇంకనువినుడు :- అర్జునున కా మహాస్త్రము ననుగ్రహించి, ఆచార్యుడు "కుమారా, నేను యుద్ధముచేయునవుడు నీవు నాతో నెన్నడును ప్రతియుద్ధము చేయకుండునది. ఇది గురుదక్షిణగా నిన్ను గోరుచున్నా" నన్నాడు. ఫల్గునుడు ప్రమోదమునంది, గురునిచరణములకు ప్రణమిల్లి, తన యంగీకారమును తెలుపుకొన్నాడు. అట్టిగురుడును, అట్టిశిష్యుడును లోకముననున్నారా!

ద్రోణు డావిధముగా దక్షిణ కోరుటలో నొకరహస్యమున్నది. తనకు ప్రాణమువంటివాడు గనుక, అతనిని గొట్టుటకు తనకు చేయాడదన్నది యట్లుండగా, అతనిని గెల్చుట తనకుసాధ్యముకాదు. అందుకే గురు డావిధముగా ముందుగనే తప్పుకొన్నాడు.

ఏమిరా! పార్థు డంతటి మహాశూరుడా?యన్న, సందుకు సందేహమేమి? వీరాధివీరుడైన భీష్ముడే "నను మార్కొనంగఁ బురుషులనుర్వింగానఁ గిరీటికి నొక్కని, కే నోర్వ, నతండు శరము లెక్కడెఱుంగుఁ" అనలేదా! అంతటివాడే అట్లన్నప్పుడు, ఇక ద్రోణుడా పార్థుని గెల్చువాడు! సరే: ఇది విషయాంతరము.

---

# ౯. అర్జునుని గురుభక్తి



ఆచార్యున కర్జునునిపై గల ప్రేమ యెంత గాఢమో, అర్జునుని కాచార్యుని యెడగల భక్తి అంత గాఢము.

అర్జునుని గురుభక్తి కొక్క తార్కాణము.—

ఉత్తరగోగ్రహణమున గురుశిష్యుల కెదురు తాకిళ్లైనవి. అప్పటి కర్జును డాచార్యుని వదలిపోయి యెన్నో యేండ్లైనది. పార్థుడు ప్రచ్ఛన్న వేషములో నున్నాడు. గురుడు దూరమున నున్నాడు. అట్టి సమయమున పార్థు డుత్తరునితో నన్నమాట లివి.—

"గురునకుఁ బ్రదక్షిణమ్ముగ
నరదము పోనిత్త మి మ్మహాపురుషు నెడం
బరిభవము వలవ, దీతఁడు
కురుకుల నృప తనయ శిక్షకుఁడు సుమ్మనఘా!" (విరా. ౫-౫)

"ఈతనితోడి కయ్యమున కియ్యకొనందగ, దేను దుష్పథ
ద్యూత జయోద్ధతుండగు సుయోధనునిం బరిమార్పఁ బోవుచో
శాత శరోత్కరం బితఁడు చక్కఁగ నేయునో, నన్ను నేయఁడో
చూతము; తాన మున్ననికిఁ జొచ్చినఁ జొత్తముగాక పిమ్మటన్"
(విరా. ౫-7.)

గురునియెడగల భక్తిభావములో నేమాత్రము పొరపొచ్చెమున్నను, పరోక్షమున నింత నిష్కల్మషవాక్కు వచ్చునా?

ద్రోణాచార్యుని యందే కాదు; కృపాచార్యుని యందును అర్జునున కట్టి భక్తియే కలదు.

ఆయనను గురించి యర్జును డుత్తరునితో నన్న మాటలు:—

"ధైర్యధనుఁ డితఁడు ద్రోణా
చార్యుల కెనవచ్చు దివ్య శరవిదుఁడు కృపా
చార్యుఁడు, మత్పితృసఖుఁ డా
చార్యక మొనరించె మాకు శైశవము తఱిజ్ఞ," (విరా. 5-9)

"వీర లిరువురు మాన్యులు వీరితోడి
కయ్యమున కిడ్డు మన మంత గాలుద్రవ్వ
వలవ దెచ్చోట నెడరుగా మెలఁగి రచట
మన రథం బల్లనల్లన చనఁగ నిమ్ము." (విరా. 5-10)

ఆచార్యులయెడ నర్జుననకుగల భక్తి యకలంక మని ప్రకటమైనదిగదా! మరి, యట్టి శిష్యుని గురువు లభిమానించుటలో తప్పేమి?

రణ సంరంభముననను నరుడు గురుభక్తి మరవలేదు సరిగదా, గురు డంతరించిన పిమ్మటనైనను ఆ భక్తి కొరవడ లేదు.

అశ్వత్థామ 'అపాండవము కావలె' నన్న దారుణ భాషణములతో బ్రహ్మశిరోఽస్త్రమును ప్రయోగించి నప్పుడు, అర్జునుడును ఆ యస్త్రమునే ప్రయోగింపవలసివచ్చినది. అప్పు డతడు చప్పున రథముదిగి, నియమపూర్వకముగా ఆచార్యుని సంస్మరించి, చాపము నందుకొని, సమంత్రకముగా శరము

సంధించి "ఈ మహాస్త్రప్రయోగమున నా గురునందనున కెట్టి కీడునుగలుగకుండవలయు" నని ప్రార్థించి వదలినాడు.

అట్టి మహాపత్సమయమునను, అత డాచార్యు నట్లు స్మరించినాడన్న నాతని గురుభక్తి యెట్టిదో వేరుగా జెప్పవలెనా?

తన వంశమును ధ్వంసముజేయ బూనిన క్రూరునకు అశ్వత్థామకు 'కీడొందకుండవలె' ననుట 'గురుపుత్రు'డన్న భక్తి విశ్వాసముల చేతనే గదా! ఇట్టి భక్తి విశ్వాసములు గురువునెడ తక్కిన శిష్యుల కున్నవా? లేనపుడు గురు వేల యభిమానించును? ఉత్తమ శిష్యు నెట్లభిమానింప కుండును?

---

-

# ౧౦. ఏకలవ్యుని వృత్తాంతము



"అర్జును డుత్తమశిష్యుడే యగుగాక; తన కుపకారియే యగునుగాక. అతని నిమిత్తముగా ద్రోణు డేకలవ్యుని జీవితమును నాశముచేయుట ద్రోహముకాదా? దోషముకాదా?" అని ప్రశ్న.

ప్రశ్న సరియైనదే; ఐనను ద్రోణుని ద్రోహి యనిగాని, దోషి యనిగాని వాకొనుటకు వలనుపడదు. ఇది నిదానముగా పరామర్శింపవలసిన ప్రౌఢఘట్టము. ఇందు సాధకబాధకములు చాలా కలవు.

ఏకలవ్యుని విషయములో ఆచార్యుడు చేసినది క్రమమని యెవ్వరును అనరు. అది యక్రమమనియు, అప్రతిష్ఠాకరమనియు నాచార్యుడును అనుకొనియే యుండును. కాని యేమిచేయగలడు? అనివార్యమైనప్పుడు.

అంతటి యనివార్య మేమివచ్చిన దనగా- బాణదేశికుడు పార్థు నెక్కువగా ప్రేమించినాడు. "నిన్ను మించు విలుకాడు లేకుండునట్లు- నీకు విద్యనేర్పుదు" నని బాస యిచ్చినాడు. ఇచ్చిన ప్రకారమే, అతనికన్ని రహస్యములును తెల్పి, తాను కృతార్థుడ ననుకొనుచున్నాడు. లోకైకవీరుడ నన్న దర్పముతో మురియుచున్నాడు- పార్థుడు.

ఇట్టి స్థితిలో తెలియవచ్చినది యేకలవ్యుని వృత్తాంతము. వాని ప్రజ్ఞముందు తన ప్రజ్ఞ 'దివిటీ క్రింది దీప' మనిపించినది - యర్జునునకు. అది యతనికి తలకొట్టినట్లైనది. కాదామరి? పుట్టుకచేత క్షత్రియుడై, అస్త్రాచార్యున కత్యంత ప్రియాంతేవాసియై, అతిలోక ధానుష్కు డనిపించుకొనుచున్న తనకంటెను, ఊరును పేరును లేని యాటవికు డొక డస్త్రవిద్యయం దధికుడై యుండుట, యతని కీర్తికి భంగకరమే గదా! అపకీర్తి భరింపవచ్చునా? "సంభావితస్య చాకీర్తి ర్మరణాదతి రిచ్యతే" (ప్రతిష్ఠావంతునికి మృతికంటెను అపకీర్తియే యెక్కువ దుఃఖకరము) అనిగదా గీతావచనము. అట్టి యపకీర్తిని తొలగించుకొనకున్న నతడు లోకములో తలయెత్తుకొని తిరుగగలడా? మరి యది తొలగించుకొనుటెట్లు? అర్జునున కుపాయమేమియూ గోచరించలేదు. అప్పుడు గురువు కడకు పోయి,—

"విలువిద్య నొరులు నీ క
గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు నని మున్
బలికితిరి నాక కా దీ
త్రిలోకముల కధికుఁ జూచితిమి యొక యెఱుకన్"

( ఆది. 5–239)

"నాకంటెను మీకంటెను
లోకములో నధికుఁ డతి బలుండు ధనుర్వి
ద్యా కౌశలమున నాతఁడు
మీకుం బ్రియశిష్యుఁడటె యమిథ్యావచనా!" ( ,, 5–240)

అని తనహృదయ వేదనను చెప్పికొన్నాడు. ఆ చెప్పికొనుట, పైకి మర్యాదగాను - దైన్యసూచకముగాను కనబడుచున్నను, అందులో,— "ఏమయ్యా, నిన్ను మిగులు విలుకాడు లేకుండునట్లు నీకువిద్యనేర్పెద"నని నాకు వాగ్దానముచేసి, చాటుమాటుగా నీ వా యెరుకలవాని కంతవిద్యనేర్పితివా? అబద్ధాలమారీ! నాకంటెను వాడు నీ కంతగా ప్రియశిష్యుడైనాడా?" అన్నయెత్తిపొడుపు అంతర్లీనముగా నున్నది.

ఆ మాటలకు ద్రోణు డదిరిపడ్డాడు. పాప మా బ్రాహ్మణు డే కర్మమునెరుగడు. ఏకలవ్యుడు ద్రోణుని గురువుగాభావించుకొని, అస్త్రవిద్యయంతయు స్వయముగా సాధించుకొన్నాడే గాని, ద్రోణుడు వాని కొక్క-ముక్క-యైనను చెప్పినది లేదు. లేకపోయినను, వాఁడేమో, నేను ద్రోణశిష్యుడ ననియే చెప్పికొనెడివాడు. వాని కా బాపనియందు కుదిరినభక్తి యట్టిది.

వానికి తనయెడగల అకల్మషగాఢభక్తికిని, వాని ప్రజ్ఞాప్రకర్షకును మెచ్చి, ఆచార్యుడు వానిని, అర్జునునికన్న నెక్కు-వగా ప్రేమించియుండవలసినది. కాని, ఆ మార్గము తప్పిపోయినది. ప్రేమించుటకు మారు, విధిగా ద్వేషింపవలసి వచ్చినది. వానిని ద్వేషింపనిచో, అర్జునుడు "నీవు ముమ్మాటికిని మిథ్యావాదివే" నని గట్టిగా ముడివేయును. "కుచ్ఛితుడవై ఆ కిరాతునికి, దొంగతనముగా అస్త్రరహస్యములు కరపి నాకు ద్రోహముచేసితి"వని నిందించి, మచ్చరికించును. —

ఈ విధముగా ఆచార్యునకు అనివార్యమైన ధర్మ సంకట మేర్పడ్డది.

అప్పు డా బ్రాహ్మణుడేమిచేయవలె? అర్జునుని తృప్తి పరుచుటకై, యేకలవ్యున కపకారమైనను చేయవలె; లేదా, అర్జునునితోడి సంబంధమునైనను వదలుకొనవలె. అర్జునుని వదలుకొనుటలో, ఆయనకు పెక్కు-చిక్కు లున్నవి. కావున అది కానిపని. తన్ను దేవునివలెనమ్మి యారాధించుచున్న యేకలవ్యుని జెరచుటయో అది పరమద్రోహము. ఇరువురును శిష్యులేగావున, నెవరిని నిగ్రహించినను శిష్యద్రోహమే యగును. ఈ విధముగా ఆచార్యునియవస్థ కత్తి - గొడ్డలి సందున పడ్డట్లైనది.

అప్పు డాతడు లోతుగా నాలోచించినాడు. తా నేక లవ్యున కపకారము చేయు పక్షమున తాను భరింపవలసినది లోకనింద యొక్క-టే. వానియెడ కనికరము వహించు పక్షమున, తన యాచార్యకమున కపకర్షయు, తనకు మిథ్యా వాదియన్న యపనిందయు, తన ప్రత్యక్షశిష్యునకు తల వంపును, పైపె చ్చాతనితో విరోధమును తటస్థించును. ఇట్లిన్ని విధములుగా చెడుటకంటెను, ఒక్క- లోకనిందకు తల యొగ్గుటయే ల గ్గనుకొన్నాడు. గత్యంతరములేక, ఏకలవ్యున కపకారముచేయుటకే మనసు నొప్పించుకొన్నాడు. నిజముగా అది నిష్ఠురకృత్యమే, కాని, అట్టి పట్టున, ద్రోణాచార్యుడే కాదు; ఏ యాచార్యుడైనను, అంతకన్న నేమి చేయగలడు!

ఈ సందర్భమున ద్రోణు డెంతవరకు నింద్యుడో లోకవ్యవహారవిదులు విచారింతురుగాక.

ఇది, ద్రోణుడు నిందార్హుడు కా డనుటకు వ్యవహార మార్గమున కనబడుచున్న సమాధానము.

పౌరాణిక మార్గమున మరియొక సమాధానమును కలదు.— అందు, ఏకలవ్యునకుజరిగిన యపకారము దైవికము. ద్రోణుడు నిమిత్తమాత్రుడు. అదియెట్లనగా:-

ఏకలవ్యుడు సామాన్యపు టాటవికుడుగాడు. మహావీరుడు. అర్జును డన్నట్లు, అర్జునుని కంటెను, ద్రోణునికంటెను అధికబలుడు. * వాడు క్రోధవశగణమువలన బుట్టినవాడు. కనుక అసురప్రకృతి గలవాడు. శిశుపాల జరాసంధుల జట్టులోనివాడు. జరాసంధునకు బంధువుకూడా నట.

అందువల్ల కృష్ణునకు ప్రతిపక్షకోటివాడు. ఏ డొకమాటు, జరాసంధునితో జేరి కృష్ణునిపై దాడిచేసి, కృష్ణుని చుట్టమైన శతద్యుమ్నునితోను, మరియొకమాటు పౌండ్రక వాసుదేవునకు బాసటయై, ద్వారకపై దండెత్తి బలరామునితోను ప్రబలయుద్ధము చేసినవాడు. (చూ. హరివంశము.)

---

* "ఏకలవ్య స్సుమిత్రశ్చ వాటధా నోఽథ గోముఖః
గణాత్ క్రోధవశా దేవ రాజపూంగోఽభవత్ క్షితౌ."
(ఆది. ౬౩-౬౩).

భవిష్యత్తున వీనివలన బాధపడవలసివచ్చునని కృష్ణుడు ముందుగనే మెలకువపడి, యీ కన్నుదగులు పుల్లను మెల్లగా తొలగించుట మంచిదనుకొని, ద్రోణున కట్టి బుద్ధి పుట్టించి, ఆ వీరుని వికలాంగుని జేయించినాడు. ఈ రహస్య మర్జును నకును తెలియదు. కృష్ణుడే, ఒక సందర్భమున,—

* "ఏకలవ్య శిశుపాల జరాసంధుల నీక కా నొక్కొక్క తెఱంగునం బిలుకుమార్చితి; నిత్తతి వార లున్న౯ గౌరవపతి వారలం బెచ్చుకొను; నమ్మువ్వురుం గూడిన నెవ్వరికి నోర్వరాకుండు." (ద్రోణ. 5.239.)

అని పార్థునకు తెలిపినాడు. అతనికిని, అప్పుడే తెలిసినది. ఈ కథ యెరుగనివారు ద్రోణుని దూషింతురు. అంతేగాని, నిజానికి ఆచార్యుడు ద్రోహికాడు.

---

* "జరాసంధ శ్చేదిరాజో మహాత్మా
మహాబాహు శ్చైకలవ్యో నిషాదః
ఏకైకశో నిహతా స్సర్వ ఏతే
యోగై స్తై స్తై స్త్వద్ధితార్థం మయైవ."
(ద్రోణ. ౧౮౧. ౭.)

# ౧౧. ఏకలవ్యుని సౌశీల్యము



ఇక్కడ మనము గమనింపవలసినది, యేకలవ్యుని శీలము. అతడు కులముచేత ఎరుకైనను, మొరకుకాడు. ఎరుకగలవార మనుకొను ఉన్నతకులసంభవులందును తరుచు కానరాని యుత్తమగుణములు కలవాడు. అతని అసలుపేరు- హిరణ్యధన్వుడు. ఏకాంగుళి లవనముచేత 'ఏకలవ్య' డను పేరు కలిగినది.

వాడు తొలుత, ద్రోణుని ప్రసిద్ధి విని, ఆయన సన్నిధికి వచ్చి, బాణవిద్య ప్రసాదింపు మని ప్రార్థించినాడు. ద్రోణుడు, నీవు నిషాదుడవు గావున నిన్ను శిష్యునిగా చేకొన నన్నాడు. ఆ మాట కా నిషాదబాలుడు విషాదపడలేదు. "ఇది యేమి వేదమా? శాస్త్రమా? కిరాతులమైన మాకు అంపసాదన కులవిద్యగదా! అట్టి విద్య నా కేల నేర్పరాదు?" ఇత్యాది తర్కవితర్కములకు దిగలేదు. ఆయనయెడగల గురుభావమును చెడలేదు. అది ఆచార్యుడు పెట్టుకొన్న నియమము కాబోలు ననుకొని, "అట్లైన మహాత్మా! మిమ్ము గురువుగా బెట్టుకొని, అస్త్రాభ్యాసము చేసుకొందును. దయతో అనుమతి యొసగు" డని వినయముతో వేడుకొన్నాడు. ఆచార్యు డనుమతి యొసగినాడు. అంతే ద్రోణునకును- ఏకలవ్యునకునుగల గురుశిష్యసంబంధము.

ఏకలవ్యుడు గురునకు నమస్కరించి, సెలవు పొంది, యింటికిపోయి, మంటితో గురుప్రతిమను తీర్చి, భక్తి శ్రద్ధలతో నారాధించుచు, మేధాశక్తిచేతను, నిరంతరాభ్యాసము చేతను సకలాస్త్ర రహస్యములను చక్కగా ఆకళించుకొని ఆచరణమున రూఢములు కావించుకొని మహావిద్వాంసు డైనాడు. అతని దంతయు సహజపాండిత్యమే.

అస్త్రవిద్యయం దేకలవ్యు డట్లు తనకంటెను గొప్ప వాడై యుండుట అర్జునున కసహ్యాహృదయశల్యమైనది. వా డట్లే యింకను అభివృద్ధికి వచ్చిన యెడల తనపేరు నిలువదని భయపడి అర్జునుడు, ఏకలవ్యుని ప్రజ్ఞాధిక్యమున కే విధముననైనను ఊనము కలిగించవలసినదని గురువు నొత్తిడిచేసినాడు. స్వార్థపరు లెట్టియకృత్యమునకైనను తెగింతురుగదా! గురుడు చేయునదిలేక, అందు కొడబడి, అర్జునుని వెంటబెట్టుకొని యేకలవ్యుని యింటి కేగినాడు. గురునిరాక యెరిగి, అత ఉెదురుగా వచ్చి, ద్రోణుని పాదముల మ్రోల చాగిలపడి మ్రొక్కి, లేచి, "స్వామీ! నేను మీ శిష్యుడను. మి మ్మారాధించి విలువిద్య సంపాదించుకొన్నాను. అనుగ్రహింపవే" అని విన్నవించుకొని, చేతులు మోడ్చి నిలుచున్నాడు.

అప్పుడు ద్రోణుడు, "ఏమోయి, మ మ్మారాధించి గదా నీవు బాణవిద్యలో ప్రవీణుడవై తివి? మరి మాకు గురుదక్షిణ యేమిచ్చెద" వన్నాడు. వెంటనే యేకలవ్యుడు,—

"ఇదె దేహం బిదె యర్థం
బిదె నా పరిజనసమూహ మిన్నిటిలో నె
య్యది మీ కిష్టము దానిన
ముదమొదవఁగ నిత్తుఁ గొనుఁడు"

అని భక్తితో ప్రత్యుత్తర మిచ్చినాడు.

కలశజుడు కవ్వడిప్రీతికొరకు కటికి మనసు చేసికొని, "ఏకలవ్యా! నీ కుడిచేతి పెద్దవ్రేలు కోసి యి" మ్మన్నాడు. అనటమే తడవుగా నతడు తన బొటవ్రేలు కరకుటమ్మున కరక్కున నరికి గురున కర్పించినాడు. మరుమాట ఆడలేదు.

ఆహా! ఏమి త్యాగము! ఏమి మనోనిగ్రహము! ఏమి సాహసము! ఏమి గురుభక్తి! ఏకలవ్యుని గురుభక్తి ముందు అర్జునుని గురుభక్తి దిగదుడుపన్న తప్పగునా?

---

# ౧౨. ద్రోణుని సౌజన్యము

ఏకలవ్యునివ్యవహారమున నాచార్యుడు విధిలేక అట్లు కాఠిన్యమును వహించినాడుగాని, స్వభావతః అతడు మృదు హృదయుడు. సుజనుడు. ఇందుకు ద్రుపదునికథ దృష్టాంతము.

అర్జునుడు ద్రుపదునిగట్టి తెచ్చి ద్రోణునియెదుట నిలువ బెట్టినాడు. నిర్విణ్ణుడై నిలబడిన ద్రుపదుని జూచినంత నే ద్రోణునికోపము సగానికిసగము దిగిపోయినది. బాపని కోపమూ - వరిగడ్డమంటా యెంతసేపు? కాని, ద్రోణుడు వైదికుడయ్యును లౌకికుడు. బ్రాహ్మణత్వముతోపాటు క్షాత్ర మును గలవాడగుటచేత, కుట్టకున్న తేలును కుమ్మరపురుగుగా భావించు లోకతత్త్వము నూహించి, ఆ నాడు తన్నల్పునిగా నెంచి యవమానించినవానికి తనశక్తి నించుకగానైన నెరి గించక వదలుట లోకవ్యవహారోచితముకాదనుకొన్నాడు. అనుకొని,—

"వీరెవ్వరయ్య ద్రుపదమ
హారాజులె? యిట్లు కృపణులయి పట్టువడఁగా
వీరికిఁ వల సెనె! యహహా! మ
హారాజ్యమదాంధకార మది వాసెనొకో!"

"ఇంకనైన మమ్ము నెఱుఁగఁగనగునొక్కొ?"

అని సున్నితముగా పరిహాసముచేసి, వెంటనే యిట్లన్నాడు. "ద్రుపదా! నీ కేమియు ప్రాణభయము లేదు. మేము

బ్రాహ్మణులము. బ్రాహ్మణులకు క్షమ స్వభావము. అదియును గాక నీవు నాకు బాల్యమిత్రుడవు. * ఇపుడు మరల నేను నీ మైత్రి నభిలషించుచున్నాను. రాజుకానివాడు రాజుకు సఖుడు కాదగడని నాడు నీ వంటివిగావున, నీ రాజ్యమున గంగ కుత్తరభాగమైన 'అహిచ్ఛత్రము'ను మాత్రము నే నుంచుకొని, తక్కినరాజ్యమును నీ కిచ్చుచున్నాను. పోయి సుఖముండు" మన్నాడు. అంతేకాదు, తగినసత్కారముగూడా చేసినాడు.

ద్రుపదుడు మంత్ర స్తంభిత మహాభుజంగ మైనాడు. పరాభవ దవానల దహ్యమాన హృదయముతో, ద్రోణుని వాక్యమున కంగీకారమును విధిలేక తెలిపి వెళ్లిపోయినాడు.

ఆచార్యుడు సుజనుడు కాకున్న, చేతికివచ్చిన ఆ యపరాధి నట్లు మన్నించునా? మరల నాతని చెలికారము నిచ్ఛగించి, ఆ విధముగా సత్కరించి పంపునా?

అపరాధికే యపకారముదలపని యాచార్యుడు, శిష్యుడైన యేకలవ్యునికి బుద్ధిపూర్వకముగా నపకారముచేసె ననవచ్చునా? శిష్యులును, తనకు పోషకులునునైన కౌరవులకు ద్రోహము తలచినవా డనవచ్చునా?

---

* "ప్రార్థయేయం త్వయా సఖ్యం పునరేవ జనాధిప!
వరం దదామి తే రాజన్ రాజ్యస్యార్ధ మవాప్నుహి.
అరాజాకిల నో రాజ్ఞః సఖాభవితు మర్హసి
అతః ప్రయతితం రాజ్యే యజ్ఞసేన మయా తవ."
"ఏవ ముక్త స్స తం ద్రోణో మోక్షయామాస భారత,
సత్కృత్య చైనం ప్రీతాత్మా రాజ్యార్ధం ప్రత్యపాదయత్."
(ఆది. ౧౩౮. అ.)

# ౧౩. ద్రుపదుని దౌర్జన్యము

ద్రోణుడు ద్రుపదునియెడ జూపిన సౌజన్యము విషమిం చినది. విషమించదా మరి? మంకులయొద్ద మంచితనము పనికివచ్చునా? "శఠే శాఠ్యం సమాచరేత్" అనిగదా ఆభాణకము.

ద్రుపదుడు కాలానికి కట్టువడి, భారద్వాజుడు చెప్పిన పద్ధతికి తలయూపి, మనసొప్పకున్నను మైత్రిని నటించి, మరలి పోయి నాడే గాని, ఆతని హృదయ మగ్నిపర్వతమైనది.— "ఈ జన్నిగట్టు సాదుపలవ. ఈ పప్పుబాపడా నా రాజ్యము తీసికొనువాడును; నాకు రాజ్యదానము చేయువాడును? క్షత్రి యున కింతకంటెను పరాభవ మున్నదా?" అనుకొన్నాడు. అంతేగాని, తాను తొలుతచేసిన దుశ్చేష్టను తలచుకొనలేదు. అవివేకుల కట్టి పర్యాలోచన ముండునా?

అతని కావ్రతావినష్టైనది. వీని పొగరణచుటకు మార్గ మేమా యన్న చింతతో చివికిపో సాగినాడు. తనవారితో తలపోసికొన్నాడు. బ్రహ్మతేజముగాని బ్రాహ్మణుని జయింప లేదని తెలిసికొన్నాడు. అపుడు, యాజోపయాజు లను బ్రాహ్మణుల నాశ్రయించి, "రణమున ద్రోణుని వధింప సమ ర్థుడగు కుమారుని ప్రసాదింపగల క్రతువును చేయింపు" డని ప్రార్థించినాడు. వా రట్టి క్రతువును చేయించుటయు, మంత్రా హుతులచేత తృప్తుడైన అగ్నిదేవునివలన,—

"జ్వాలా భీలాంగుఁడు, కర
వాలబృహచ్చాపధరుఁడు, వరవర్మకిరీ
టాలంకారుఁడు, వహ్నియ
పోలె రథారూఢుఁ డొక్క పుత్రుఁడు" (ఆది. 7. 18)

పుట్టుటయు జరిగినది. * వాడే ధృష్టద్యుమ్నుడు. (దిట్టతనము, బలశౌర్యోత్సాహాదులును కలవాడని-యర్థము.)

ద్రుపదుని దుర్జనత యేమనవచ్చును? తా నవమానము చేసినను మన్నించి తన కుపకారముచేసిన ద్రోణున కపకారము తలచినాడు. దుర్జనునకు మేలుచేసినను-కీడుచేసినను-వాడు కీడే చేయును. అది వాని స్వభావము. కాలితో త్రొక్కినను తలపై ధరించినను కరచుటయే గదా కాలాహి స్వభావము!

ద్రోణుడు ద్రుపదునివంటి చలపాదియే యై యున్నచో, ద్రుపదు డట్లు సుఖముగా నింటికిపోయి, ఆలుబిడ్డలను కనుల జూచుకొని యుండగలడా? లోకమున మంచికి మంచి లేదుగదా!

---

* "ధృష్టత్వా దతి ధృష్ణుత్వా ద్ద్యుమ్నా ద్యుత్సంభవా దపి
ధృష్టద్యుమ్నః కుమారోఽయం ద్రుపదస్య భవ త్వితి."
(ఆది. ౧౬౩. అ.)

"ధృష్టత్వాత్ ప్రగల్భత్వాత్-అతి ధృష్ణుత్వాత్-అతీవ పాలనే శక్తత్వాత్-ద్యుమ్నా ద్యుత్సంభవాత్-ద్యుమ్నం బలం-ఆది ర్యేషాం తే ద్యుమ్నాదయః-ఆది శబ్దాత్ కవచకుండల శస్త్ర శౌర్యోత్సాహాదీనాం గ్రహణం - తేషాం ఉత్సంభవాత్ - ఉత్కర్షేణోత్పత్తేః తై స్సహోత్పన్నత్వా దిత్యర్థః"-అనివ్యాఖ్య.

# ౧౪. ద్రోణుని విశాలహృదయత

.....o○o.....

ద్రుపదుని చర్య యంతయు ద్రోణుని చెవికి వచ్చినది. ఆయన యేమిచేసినాడో విన్నారా?

* ఆ ధృష్టద్యుమ్నుని పిలిపించుకొని, తన యింటనే యుంచుకొని, తానే యన్నవస్త్రము లిచ్చి అస్త్రవిద్య పూర్తిగా నేర్పినాడు. ఆశ్చర్యముగాదా! "తన్ను గట్టను తాళ్లు తానే తెచ్చుకొన్నా" డన్న సామెతగా, తనకు మారకుడుగా బుట్టినవానికి - ఇంకొక విద్య కాదు - రణవిద్య, మారణవిద్య తానే నేర్పడమా?

ఆ బ్రాహ్మణోత్తముని విశాలహృదయత కింత కంటెను సాక్ష్య మేమికావలె? తత్వదృష్టియు, లోకజ్ఞతయు గల మహామతి గావున, ఆచార్యుడు,- 'చంపుటకే పుట్టినవా డెట్లును చంపక మానడు; విధియేమో దాటరానిది, ప్రాణము లెప్పటికైనను పోవునవే; ఆ కుఱ్ఱవాని కుపకారముచేసి,

---

* "ధృష్టద్యుమ్నం తు పాంచాల్య మానీయ స్వం నివేశనం.
ఉపాకరో దస్త్రహేతో ర్భారద్వాజః ప్రతాపవాన్.
అమోక్షణీయం దైవం హి, భావిమత్వా మహామతిః
తథా తత్కృతవాన్ ద్రోణ ఆత్మకీ ర్త్యనురక్షణాత్"

(ఆది. ౧౬౭ అ.)

తన్మూలమున వచ్చు కీర్తిని పొందక, దానినిగూడ జారవిడుచు కొన నేల?' అని యిటు లౌకికముగను, అటు తాత్త్వికముగను దూరముగా యోచనచేసి, ధృష్టద్యుమ్నునికి అస్త్రవిద్యా దాన మొనరించినాడు.

ఇట్టి విశాలహృదయముగల ద్రోణుడు, తుచ్ఛమతితో కౌరవులకు ద్రోహ మొనరించె నన్న భావుకులు విశ్వసింతురా?

---

# ౧౫. ద్రోణుడు; రాజ్యకాంక్ష

* ద్రోణునకు రాజ్యాశ కలదట! అందువలననే ద్రుపదుని ఉత్తరపాంచాలరాజ్యములను అపహరించినాడట! మరియు నతనికి,- 'కౌరవులు, పాండవులుకూడా పూర్తిగా నశింపవలె; వారి రాజ్యముతనకురావాలె'నన్న దురాశయు కలదట! నిజమేనా? ద్రోణునకు రాజ్యాశయే యున్నయెడల, ఉత్తరపాంచాలమును మాత్రమే యేలతీసికొనును? ద్రుపదుని రాజ్యమంతయు తీసికొనియుండడా? మరల నతని సఖ్యము నేల కోరును. అతనిని రూపుమాపియేయుండడా? ఆ సమయమున ద్రోణు డేమిచేసినను కాదనువా రెవరు? ఆతనికి రాజ్యాశ కలదనుట అపోహ.

ద్రోణుడు ద్రుపదునిసఖ్యము నభిలషించినాడు. రాజ్యము లేకున్న నాతో సఖ్యముకుదురదని ద్రుపదు డనియున్నందునను రాజ్యసంపాదనకు మరి మార్గము లేనందునను, ద్రోణుడు

---

* "ద్రోణుడు పాంచాలరాజగు ద్రుపదునితోఁ జిన్నతనమునుండియుఁ బెరుగుటచే నీతనియందును రాజ్యాభిలాషయుఁ బెరిగినది. దీని కనుకూలముగా... ద్రోణద్రుపదులకు విరోధము సంభవించుటయు... ఉత్తర పాంచాలరాజ్యములను ద్రోణు డపహరించుటయు జరిగినది"

('పెండ్యాల.' పు. 122)

"ఉభయపక్షవీరుల (=కౌరవపాండవ) నాశమునకు గూడ ద్రోణుడిష్టపడెననియు నాతనికి రాజ్యతృష్ణ కలిగియున్నదనియు... జెప్పవచ్చును."

( ,, పు. 125)

ద్రుపదుని రాజ్యములోనే కొంత యుంచుకొన్నాడు. ఆ సమయమున నంతకంటెను కర్తవ్య మేమున్నది?

అత డట్లు రాజ్యవిభాగముచేయుట సఖ్యమునకు మార్గమగుటతోపాటు, ద్రుపదుడు వెనుకచేసిన అధిక ప్రసంగమునకు ప్రాయశ్చిత్తముగాను పరిణమించినది. అయినను ద్రోణునితో విరోధింప వీలులేక ద్రుపదుడును, ఆ రాజీకి సమ్మతించినాడు. అందు ద్రోణునిదోస మేమున్నది?

ద్రోణుడు రాజ్యము నపహరించినా డనుట మూల విరుద్ధము. అతడు ద్రుపదునకు రాజ్యభాగ మిచ్చుటయేగాక, సత్కారముగూడాచేసినాడు. అందుకు ద్రుపదుడు సంతోషించి,

"అనాశ్చర్య మిదం బ్రహ్మన్ విక్రాంతేషు మహాత్మసు
ప్రీయే త్వయాహం త్వత్తశ్చ ప్రీతి మిచ్ఛామి శాశ్వతీమ్"
(ఆది. ౧౩౮. అ.)

అన్నాడు.

ద్రోణునకు రాజ్యాపహరణదోషము నంటగట్ట జూచిన వారు భారతమును చదివినవారు కా రనవలెనా! చదివియు చెడ్డతలపుతో దురర్థకల్పనచేసి నా రనవలెనా? ఎట్లయినను వారివ్రాత మనము కైకొనదగినది గాదుగదా?

"ద్రోణునకు, కౌరవరాజ్యమును కాజేయవలెనన్న దుస్సంకల్పమున్న" దని వ్రాసినవారు కల్పింపరాని దురర్థము లుండునా?

---

# ౧౭. కౌరవులలో నెందుకుండవలె?

"ద్రోణుడు కౌరవపక్షమున నుండుట-వారిని నమ్మించి చెరుచుటకే"నని యొక వాదము.

"కాదేని, అతడు పాండవులు మంచివారనియు, ధనంజయుని గెల్చుశక్తి తనకు లేదనియు-నడుగడుగునను అనుచుండునుగదా! అట్టివాడు వారిలోనే చేరిపోక, కౌరవ పక్షమున నెందుకుండవలె?"నని ప్రశ్న.

ఆ ప్రశ్న యటుండనిండు. ఇక్కడ, నా దొక ప్రశ్న.—

ద్రోణుడు పాండవాభిమాని యనిగదా, మొదటినుండియు దుర్యోధనుని యభిప్రాయము? అతడు, సందుదొరకినప్పుడెల్ల,-"నీవు పాండవ పక్షపాతి"వని దెప్పుటయే గాని, "నీవు నాపక్షమున నుండవలదు; వెళ్లిపో"మ్మని ద్రోణునెన్నడైన నన్నాడా? అత డట్లనక పోవుటకు కారణమేమి?

ముందీ ప్రశ్నకు సమాధాన మాలోచించుకొన్నచో, పై ప్రశ్నకు సమాధాన మొకరు చెప్ప నక్కరయే యుండదు. అయినను చెప్పుచున్నాను.

దుర్యోధనుడు ద్రోణుని వెళ్లిపొమ్మనుటకును వీలులేదు; ఆయన వెళ్లి అవతలి పక్షమున చేరుటకును వీలులేదు. అందున్న కిటుకు, ఆ యిద్దరికే యెఱుక. అందువల్లనే, మనసుకు మనసే సాక్షిగా, ఇరువురును సరిపెట్టుకొని యుండుట.

ఆ కిటుకేమనగా:-ద్రోణుడెంతటి వీరుడో దుర్యోధను డెరుగును. కావున, నాతడు ప్రతిపక్షమున జేరునేని, తాను సమరప్రయత్నమునకు స్వస్తి చెప్పవలసివచ్చునని యు, తనకు సాయము చేసినను-చేయకున్నను-ఆ బ్రాహ్మణుడు తన యొద్ద నుండుటయే మేలనియు దుర్యోధనుడు దూరదృష్టితో కని పెట్టినాడు. అందువల్లనే, గురుడు పాండవుల నగ్గించుచు, తన్ను తగ్గించుచు పలుకుచున్నను సహించుకొని, బెడిసి పోకుండా-నడుమ నడుమ బతిమాలుకొనుచూ తన పక్షముననే యుంచు కొన్నాడు.

ఇక ద్రోణునివిషయము.—

ద్రోణుడు తొలుతనుండియు కౌరవుల పోషణమున నున్నవాడు. యుద్ధకాలమున వారిని వదలి పోవుట ధర్మ మగునా? ఈ ధర్మమును బట్టియేగదా భీష్ముడును వారిలోనే యుండుట!

"మీరుఁ బాండుసుతులు వారయ నాకొక్క-
రూప కార్య మున్నరూపు వలుక
వలయుఁ గయ్యమైన వత్తు మీలోన నా
యునికి చందమునకు నుచిత మిదియ" (ఉద్యో. 4.148)

అని భీష్ముడు, దుర్యోధనునకు చెప్పలేదా?

ద్రోణుడు భీష్మానువర్తిగావున, ఆయనతోపాటు తానును కౌరవులలోనేయున్నాడు. అట్లుండుట ధర్మబద్ధమైన బుద్ధితోగాని, దురుద్దేశముతో కాదు.

అదియునుగాక, ద్రోణునకు ద్రుపదుడు పగవాడు. అతడు తనబలగముతో పాండవులలో నున్నాడు. తానును వారిలోచేరిన యెడల, ద్రుపదునిమీది పగ దీర్చుకొనుట ద్రోణునకు కుదురదు. ఆయన కౌరవపక్షమున నుండుట కిది రెండవ కారణము; బలీయము.

ఈ కారణముచేతనే, దుర్యోధనుడు తన్నెంతగా దిసంతులడచుచున్నను, ద్రోణు డోర్చుకొనుచు, కౌరవులలోనే యుండవలసివచ్చినది. అంతేగాని, వారిని నమ్మించి చెరచవలెనను చెడ్డతలపుతోగాదు.

---

## ౧౭. పక్షపాత ప్రసంగమా?

"ఈ పక్షమున నుండి ఆ పక్షమును పెద్దచేసి ప్రశంసించుటయు, "వారజయ్యులు; వారితో విరోధము తగ" దనుటయు పక్షపాత ప్రసంగము కాదా?" అని యొక ప్రశ్న.

ఇది భారతకథ ముక్కుమొగము నెరుగనివారు వేయవలసిన ప్రశ్న.

కురుపతి కా విధముగా చెప్పినవాడు ద్రోణు డొకడే కాదు. ధృతరాష్ట్ర భీష్ములును అట్లు చెప్పినవారే. వారు చెప్పినపిమ్మటనే ద్రోణుడు చెప్పుట.

ఆ చెప్పిన విధ మిది.—

"పితృ పితామహ గురులమై ప్రీతిఁగోరు
చున్న యట్టి మా పరమ హితోపదేశ
వాక్యములు విని దుర్జన వచన రచన
గొనక బంధులతో నొడఁగూడి మనుము." (ఉద్యో. 3. 347)

"పెన్నుఁడు ప్రీతిఁజెప్పిన సవిస్తర వాక్ప్రచయంబు త్రోవఁబో
వన్న కుమార, యట్లయిన నాయువు శ్రీయును నీకుఁగల్గు మా
కన్నులుఁ సల్లగా నకట గన్గొనుచుండుదు మేము; నట్లుగా
కున్నను నీవ నేర్తు నిను నొం డన నేరము నిందుకొల్వనన్" 
( ,, 3. 348)

అని ద్రోణుడన్న మాటలు. ఈ మాటలు దుర్యోధనుని యందలి ప్రీతిచేత, ఆతని మేలు గోరి, బతిమాలుకొనుచు చెప్పి

నవిగా నున్నవా! పాండవ పక్షపాతముచేత, అతనిని నిరుత్సాహపరుచు దురుద్దేశముతో చెప్పినవిగా నున్నవా? మనుమనియందలి మమతచేత తాతయు, పుత్రప్రేమచేత తండ్రియు, శిష్యవాత్సల్యముచేత ఆచార్యుడును చెప్పిన హితవాక్యములు, విమర్శకులకు, పక్షపాత ప్రసంగముగాను, యుద్ధోత్సాహభంగకరోక్తులుగాను తోచుట విపరీతముకాదా?

ద్రోణునిమాట పోనిండు; కృపుడు, విదురుడు, సంజయుడు, కణ్వ నారదాది మహర్షులును విరోధమువల దని చెప్పినవారే గదా! వారందరును పక్షపాతబుద్ధులేనా?

వారేకాదు; విమర్శకు లెరుగరేమోగాని, కౌరవపాండవకుల కలహాంకురమునకు మూలకందమును, దుర్యోధనునకు బహిఃప్రాణమును నైన శకునియు నొకప్పు డట్లు చెప్పినవాడే. అది యెప్పుడనగా:- దుర్యోధనుడు ఘోషయాత్రామహోత్సవములో నిజ కాంతా సోదర సహితముగా చిత్రసేనునిచేత బంధింపబడుటయు, విజయునిచేత విముక్తి నందుటయు జరిగిన పిమ్మట, దుర్యోధను డా యవమానమును భరింపలేక ప్రాయోపవేశమునకు సిద్ధపడ్డాడు. అంతవరకును తన యుక్తిశక్తులచేత రారాజును గెలిపించవచ్చు ననుకొనుచున్న శకుని, ఆ సంఘటనను చూచి, తన ప్రణాళిక కొనసాగునది కా దనుకొన్నాడు. దుర్యోధనుని దౌర్బల్యమును, పాండుసుతుల ప్రాబల్యమును తలచుకొని వ్యవహారజ్ఞుడు గావున వెంటనే మనసు మార్చుకొని దుర్యోధనున కిట్లు హిత ముపదేశించినాడు.

"దుర్యోధనా! ని న్నేకచ్ఛత్రాధిపతిని జేసి, చూచి, సంతోషింపవలెనన్న ఆపేక్షతో నా బుద్ధిబల మంతయు నుప యోగించి పాండవుల భాగమునుగూడా సంపాదించి నీ కిచ్చితిని. కాని, దానిని దక్కించుకొనగల మెలకువ నీలో లేదు. అది యిప్పుడు తెల్లమైనది. పోనిమ్ము. దానికై వగచి బలవంతపు చావు చావనేల? వెఱ్ఱితనముగాని చచ్చి సాధింపగల దేమున్నది? ఆ తలపు కట్టిపెట్టి, కార్యజ్ఞుడవై యిపుడు నేను చెప్పినట్లు చేయుము. వెనుకటి కుటిలస్వభావమును వదలు కొని, మంచిమనసుతో పాండవులను పిల్వంబంచి, వారి భాగ మును వారికి హృదయపూర్వకముగా నిచ్చివేయుము. వారు నీకు భ్రాత లగుట యట్లుండ, ఆపత్సమయమున సవ్యాజా దరముతో నాదుకొని మహోపకారము చేసినవారు గావున, నీ విపు డిచ్చుభాగము కృతజ్ఞతకును సూచకమై నీకు శాశ్వత కీర్తిని పుణ్యమునుగూడ కలిగించును. వారును మీరును ఏకమై హాయిగా రాజ్యసుఖము లనుభవింపుడు. ఇపు డిదియే నీకు కర్తవ్యము" అని శకునిచేసిన యుపదేశము.

విమర్శకులు 'శకునియు పాండవపక్షపాతియే' నందురా? ద్రోణ భీష్మాదులును, అట్లే శకునియు - యుద్ధము వలదని బోధించుట, దుర్యోధనుని హితము గోరిగాని, పాండవపక్ష పాతముచేత కాదు.

ఒక్క కర్ణుడు తప్ప, రాజుమేలు గోరినవా రందరును, కయ్యము కూడ దని చెప్పినవారే. అశ్వత్థామ చెప్ప లేదా?

ఆతడును చెప్పినాడు. అది యెప్పుడనగా.—

యుద్ధము మూడు వంతులు జరిగిపోయినది. భీష్మ ద్రోణుల పని తీరినది. కర్ణుని వంతు వచ్చినది. ఆత డర్జును నితో తలపడ్డాడు. తన శక్తి యంతయు నుపయోగించి పోరు సాగించినాడు. కాని, యెంతసేపటికిని అతనిలో గెల్పు లక్షణ ములు కనబడలేదు. అది గమనించి, అశ్వత్థామ రాజు కిట్లు చెప్పినాడు.

"రాజా! భీష్ముడు పడిపోయినాడు; అస్త్రగురు డంత రించినాడు. ఇక అంగరాజా సవ్యసాచిని జయించువాడు? కృపుడును, నేనును అవధ్యుల మనియు, క్రీడిని గెల్తు మనియు నీ తలపు గాబోలు; ఆ తలపు వదలుకొని నా యీ మాట వినుము.—

మన మూల మింతటితో చాలించి, పాండవులతో సంధి చేసికొనుట మేలు. నే నర్జునునకు చెప్పి, నిలుపుదును. అతడు నా మాట నతిక్రమింపడు. నీవు కర్ణునకు చెప్పి నిలిపివేయుము. నేనును చెప్పెదను.

"పాండవుల యట్ల రాధాసుతుండు నాదు
పలుకులకు నియ్యకొను నీవు బ్రదుకు తెరువు
పట్టు; బ్రదికిన నెల్ల శుభములుఁ గలుగు;
నీసు, మానము చచ్చిన నేమి గలదు? (కర్ణ. 3. 272)

"వెడ తలఁపు లుడిగి సంధికి
నొడఁబడు మిది లెస్స దీని కొడఁబడమి గడుం
జెడు తెరు విప్పటి పదనుం
గడవఁబడుట ద్రాటఁదప్పు కరణియ చుమ్మీ" ( ,, 3. 273)

అని, అశ్వత్థామచేసిన హితోపదేశము. ఇదియును పక్షపాత ప్రసంగమేనా?

ఇంకను వినుడు: దుర్యోధను డశ్వత్థామ మాటను గీటునబుచ్చి.- "కర్ణు డీ నా డర్జునునిం బొడవడచు చూడు" మనుచు, బీరపుమాటలాడి, పోరు నడపినాడు. కర్ణుడును పడిపోయినాడు. కౌరవపక్షయోధులకు కళవళపాటు పుట్టినది.

అప్పుడు కృపాచార్యుడు, "దుర్యోధనా! మనకిక ఆయోధనము తగదు. ఇపుడు సంధియే కర్తవ్యము.—

"కలవా రెల్లను జెగి నీ
తలన నిలిచెఁ గార్య మధిప తగ నొడఁబడు మి
ట్టులమగు నాత్మ వినాశము
కలుగుట యది విపుల పాతకం బండ్రు బుధుల్"

(శల్య. 1. 57)

"ఇంతచెప్ప టనికి నే నోడి ప్రాణ ర
క్షణము చేసికొనుటగాదు నీకుఁ
బథ్య మనియుఁ దఱిమి పల్కితి విను విన
వేని నొచ్చి తలఁచె దిట్టులగుట" (శల్య. 1. 62)

అని బోధించినాడు. ఈ బోధయు పాండవపక్షపాతప్రయుక్తమేనా? దుర్యోధన పక్షపాతులయిన విమర్శకులబుద్ధి కట్లు

పొడకట్టు నేమోగాని, ఋజుబుద్ధు లిది పక్షపాతప్రసంగ మనరు.

భీష్మద్రోణులు, దుర్యోధన్నలమూలమున పాండవ పక్షపాతు లన్న అపదూరున కగ్గమైనా రేగాని, యుద్ధమున వారు పాండవులను మన్నించిన దేమున్నది?

భీష్ముడు పదిదినములు యుద్ధముచేసి, పదివేలమంది రాజులను బలిగొన్నాడు. ద్రోణుడు, తానుచేసిన అయిదు దినముల యుద్ధములోను, ఇరవై యొక్క వేయి వీరులను నురుమాడినాడు.

పాండవులకు ముఖ్యులైన ద్రుపదుడు, విరాటుడు, చేకితానుడు, ధృష్టకేతుడు, మాగధసహదేవుడు, కేకయ సోదరులు, మొదలైన మహాయోధు లనేకులు గురునిచేతిలో గూలినవారే. అసలు, అభిమన్యుని మృతికి కారణభూతు లెవరు? ద్రోణుడేగదా? తక్కిన రాజులమాట యటుండనిండు; ఆచార్యు డర్జుననికుమారునకు మారకు డగుటయు పాండవ పక్షపాతముచేతనేనా? లేక, అర్జునుని యందలి ప్రత్యేకాభి మానము చేతనా?

అధర్మమునకును పాలుపడి, ఆచార్యుడు, అతిలోక వీరుడైన యభిమన్యుకుమారు నక్రమమార్గమున జంపించుట దుర్యోధనునకు కొండంత మేలుచేయుట కాదా? పాండవుల కపారాపకారముచేయుట కాదా? ఈ ఘట్టమున ద్రోణుని కౌరవపక్షపాతి యనవలెనా? పాండవపక్షపాతి యనవలెనా?

తన కోరిక మేరకు సర్వసైన్యాధిపత్యభారమును తల దాల్చి, తనకై పాండవబలముల నట్లు నిర్దాక్షిణ్యముగా నిర్మూలము గావించిన యాచార్యుని, దుర్యోధనుడు వివేక హీనుడు గావున 'పాండవపక్షపాతి' యనిన ననెగాక, విమర్శ కులును అట్లే యనుట తగునా?

ఆ నరపతి యవివేకమున కంతమే లేదు. అతడు, ద్రోణునిచేత అంత సహాయముపొందియు, ఆయన హృదయ మును గుర్తింపలేకపోయినాడు. ద్రోణుడు పడిపోవువరకును, దుర్యోధను డాయనను 'పాండవపక్షపాతి' యనుట మానలేదు.

ద్రోణు డైదవనాటి యుద్ధమునకు సన్నద్ధుడై యుండగా, రాజాయన కడకుపోయి, ఆయన యస్త్రవీర్య శౌర్యంబుల నభినుతించి,- "ఆచార్యా! ఇట్టివాడవు నీకు సరి గాని వారిని - పాండవులను- పెద్దచేసికొని, శిష్యత్వంబు పాటించి పోటునకుం జొరక తిరుగుట నా భాగ్యంబు చందంబు గాక నే నేమి చేయవచ్చు"- నని వెక్కసముగా నన్నాడు.

ఆ చిలిపిమాట చెవికి సోకగానే గురునకు చిరాకు పుట్టినది. పుట్టినను బెట్టిదముః తోపనీక, మృదువుగా-వక్రోక్తి చాతురితో- "ఔ నౌను నిజమేనోయి! ఆఖండలుడు ఖాండ వమును కోలుపోవుటయు, ఘోషయాత్రలో చిత్రసేనాది గంధ ర్వులు నిన్ను పిడిచిపోవుటయు, నివాతకవచకాల కేయాదులు చచ్చుటయు, అర్జునుడు తమకు శిష్యుడని మన్నించియే గదా,

మరి!"- అని మందలించి, "దుర్యోధనా! వలవని యీ దురుక్తు లిపు డేమిటికి? తిన్నగా యుద్ధభూమికి పద" మన్నాడు.

ఆ పలుకుల కత డలిగి, "ఆచార్యా! నీవు సవ్యసాచికి చాలవేని చాలవకాక; నిలువుము. నీ యోపినవారితోనే పెనగుము. నేనును దుశ్శాసన శకుని కర్ణులును ఆ కవ్వడిం గూల్చెద"మన్నాడు. అనగానే ఆచార్యుడు నవ్వి "అట్ల చేయుము; ఇది కర్జము; ఇ త్తెఱంగునన గెలుతురుగాని పొందు" అని పలికి, వెంటనే,—

"కుడిచితి కట్టితి పెట్టితి
పుడమి సమస్తంబు నఖిల భోగంబుల నె
క్కుడు పేర్మి ననుభవించితి
తొడరుము వెఱ పుడిగి పార్థుతోడఁ గుమారా" (ద్రోణ. 5-277)

అనియు నొకమాట అన్నాడు.- 'నా కజేయుడైన విజయుని గెల్తునని పోవుచున్నావు గాని, నీవు తిరిగిరా'వని యీమాట లోని భావము. అంత పరుషముగా నెందుకన్నా డనగా, మంచి చెప్పిన వినక, మాటిమాటికిని అనుచితప్రసంగములతో నొగిలించి నప్పుడు, ఎంతశాంతుల కైనను కోపము రాక మానదుగదా! ఆచార్యుని ఒళ్లుమండించి దుర్యోధనుడు తుద కా మాట యనిపించుకొన్నాడు.

ఇట్లే ఒకసారి యశ్వత్థామచేతను అనిపించుకొన్నాడు. అతని దృష్టిలో అశ్వత్థామయు పాండవ పక్షపాతియే. అందువలన ఒకప్పు డిట్లు తాకనాడినాడు.

"గురుఁడు పాండవులకుఁ గూర్చు నీవును దాని
నెఱిఁగి బవరమున నుపేక్ష సేయు
దిది మదీయభాగ్యహీనతగాక నీ
వేచితేని నెవ్వ రెదురుసెపుమ" (ద్రోణ. 5. 120)

దుర్యోధనుని యీ నిష్ఠురోక్తికి, అశ్వత్థామ మనస్సు చుఱ్ఱు మన్నది.

"గురునకు నాకును బాండవు
లరయఁగఁ గూరిమికిఁ బాత్ర మగుదుర యైనన్
దురమునఁ జుట్టఱికంబను
గరు సిడికొను కేలకలుఁగుఁ గౌరవనాథా!" (ద్రోణ. 5. 123)

"పెక్కు రణంబులం గనియుఁ బెద్దయు నమ్మవు నన్ను మద్గురున్
దక్కినవారు మేము విను దాఁపము ప్రాణము లోపినట్లు పే
రుక్కునఁ బోర దైవగతి యున్నటు లుండెడుఁగాక, పాండవుల్
మిక్కిలి వారు; నీ తలఁపు మే గెలువన్ వశమే మహీశ్వరా"
( ,, 5. 124)

అని, ముందొకటి రెండు మాటలు మృదువుగా పలికి, అంతలో అతని పరేంగిత జ్ఞానశూన్యతకు హృదయము ముడుకెక్కినది కాబోలు,- * "ఓయీ! నీవు కుచ్ఛితుఁడవు; దురభిమానివి;

* "త్వంతు లుబ్ధతమో రాజన్, నికృతిజ్ఞశ్చ కౌరవ
సర్వాతిశంకీ మానీచ, తతో ఽ స్మా నభిశంకసే
మన్యే త్వం కుత్సితో రాజన్, పాపాత్మా పాపపూరుషః
అన్యా నపి స నః క్షుద్ర, శంకసే పాపభావితః
అహంతు యత్న మాస్థాయ, త్వదర్థే త్యక్తజీవితః
ఏష గచ్ఛామి సంగ్రామం, త్వత్కృతే కురుసత్తమ"
(౧౬౦. ౧౨)

కృతఘ్నుడవు; పాపాత్ముడవు; నిత్యశంకివి; నీచుడవు: యుద్ధములో, నెన్నో ఘట్టములలో ప్రత్యక్షముగా జూచియు, నీవు నన్నును, మా తండ్రినిగూడా అనుమానింతువు. మమ్మేకాదు; నీ వెవ్వరినీ నమ్మవు. అది నీ స్వభావము" అని తలవాయ చీవాట్లుపెట్టి- చివరకు, దుర్యోధనా! నీవు నన్ను నమ్మిన నేమి? నమ్మకున్న నేమి. నీ కొరకు ప్రాణము లర్పింప నేను నిశ్చయించుకొనియున్నాను. నా ధర్మమును నేను నెరవేర్చు కొందును. ఇదిగో, సంగ్రామభూమికి చనుచున్నాను" అని బరువుగా పలికి తన దారిని తాను వెళ్లినాడు.

విమర్శకు లీ కథ చదివినట్లు లేదు. చదివియే యున్నచో, దుర్యోధనుడు బుద్ధిమాలి - "మీ తండ్రియు నీవును పాండవ పక్షపాతు"లని వదరి - అశ్వత్థామచేత చీవాట్లు తినియుండుట తెలిసియు "ద్రోణుడు పాండవపక్షపాతి" యని మరల తా మేల యందురు?

---

# ౧౮. ద్రోణభీష్ములు ; వంచన

## (1) పాండవులను చంపకపోవుట

ద్రోణుడు - భీష్ముడును సమర్థులై యుండియు, పాండవులను చంపకపోవుట వంచనకాదా? యని వారిప్రశ్న.

వారు, "దురమున పాండవులను దునిమి, లేదా, ఓడించి, గెలుపు లచ్చినిదెచ్చి నీ కిచ్చెద"మని దుర్యోధనునకు బాస యేమేని యిచ్చినారా? యని నా ప్రశ్న.

అర్జునుని నేను జయింపజాల ననియు, తక్కిన పాండవులను చంపుటకు నాకు చేతులాడ వనియు భీష్ముడు తొట్టతొలుతనే స్పష్టముగా చెప్పినాడు.

"సేనాధిపత్యమునకుం
బూనెద నను మార్కొనంగఁ బురుషుల నుర్విం
గానఁ గిరీటికి నొక్కని
కే నోర్వ నతండు శరము లెక్కుడెఱుంగున్" (ఉద్యో. 4-149)

"పెఱవారి నెల్లఁదరమిడి
సఱకుదుఁ బాండుక్షితీశనందనులను రూ
పఱఁజేయఁ జేతులాడవు
దఱుమగు నామీఁద నత్యుదగ్రత వారల్" ( ,, 4-150)

అని, భీష్ముడు చెప్పిన మాట..

మరియు నతఁడు ద్రోణు నతిరథునిగా పేర్కొనుచూ,—

"అర్జునుపైఁ గూర్మి నతని నోసేయఁడు" ( „ 4-229)

అనియును, చెప్పియున్నాడు.

ద్రోణుడు,- తాను సర్వసైన్యాధిపత్యమును కైకొను నపుడు,—

"నా, దివ్యాస్త్రంబులఁ బంచి పాండవబలోద్రేకంబు మాయించెదన్" (ద్రోణ. 1. 74)

అన్నాడే గాని, "పాండవులను బరిమార్చి రాజ్యము నీ వశము చేసెద" ననలేదు.

పాండవ = పాండవులయొక్క, బల = సేనలయొక్క, ఉద్రేకంబు = అతిశయమును, మాయించెదన్ = నాశము చేసెదను — అని అయన అన్నమాట కర్థము.

వా రుభయులును పాండవులను చంపెద మని ముందు చెప్పినదియు లేదు; తరువాత చేసిన వంచనయు లే దని పై ప్రశ్నకు సమాధానము.

## (2) ధర్మజుని విడుచుట

ద్రోణుడు, 'ధర్మరాజును పట్టియిచ్చెద' నని కురురాజుకు వరమిచ్చి, చేతి కందినప్పుడు పట్టుకొనక ధర్మజుని వదలివేసెనే; అది వంచనకాదా? అందురు.

అందును వంచన యేమియు లేదు. ఎట్లనగా,—

"అర్జును డడ్డు రాకున్న పట్టి యిచ్చెదను."- "ధర్మజుడు పారిపోకున్న పట్టియిచ్చెదను" అన్నాడేగాని, 'ఏమైనను సరే; ఎట్లైనను సరే; నిష్కర్షగా పట్టియిచ్చెద' నని అస్త్రాచార్యు డనలేదు.

ఆయన తా నిచ్చిన మాటప్రకారము, పాండవాగ్రజుని పట్టుకొనుటకు, ఒకటికి రెండుమార్లు ప్రయత్నించినాడు. కాని, ఆ ప్రయత్నము నెరవేరలేదు.

ఒకమాటు గురుడు, యుధిష్ఠిరునిం గూడముట్టి, పొదివి, పట్టుకొన గట్టాయితమైనాడు. పాండవబలములు గగ్గోలుపడి,-

"అదె పట్టువడియె ధర్మజుఁ
డదయుం డగు ద్రోణుచేత నక్కట నేఁ డు
న్మదుఁడై సుయోధనుఁడు దం
డి దలిర్పఁగ నేఁగు గరిపురికిఁగొని యెలమిన్" (ద్రోణ. 1. 210)

అనుచూ, అధిపతి యాశ వదలుకొని, అలజడి పొందినవి. అట్టి సమయమున నర్జునుడు పిట్టపిడుగుగావచ్చి, యాచార్యు నడ్డగించినాడు.

రెండవమాటు, ధర్మరాజు, గురువు నేమరచి, సందు చూచుకొని పారిపోయినాడు. పోక యేమిచేయగలడు?

భారద్వాజుడు బ్రహ్మాస్త్రము ప్రయోగింపగా, పాండవాగ్రజుడును బ్రహ్మాస్త్రముతోనే దానిని ప్రతిహతముచేసి, అస్త్రగురువు నధికముగా నొప్పించినాడు. అప్పుడు ద్రోణుడు కోపించి,——

"ధర్మతనయు రథ్యంబుల ధరణిఁ గూల్చి
ధనువుఁ గేతువుఁ దునుమాడి తనువునొంచ
నాత డరదంబు డిగ్గి నిరాయుధుండు
నూర్ధ్వబాహుండునై యూరకుండె నధిప." (ద్రోణ. 3-245)

"కనుఁగొని గురుఁ డవ్విభు నే
యను బోడువను జేతులాడ కల పౌర్వ్యములం
దనచూడ్కిఁ బడిన హయరథ
మనుజద్విప సముదయముల మడియించె వెసన్." ( ,, 3-246)

"పోనీఁడు పొదువుఁ గుంతీ
సూనుని గురుఁడనుచు నుండఁ జూపఱగము ల
మ్మానవపతి యతిరయమునఁ
దా నెక్కెం బాఱి పిన్నతమ్ముని రథమున్" (3-247)

"ఇట్లు పాండవాగ్రజుండు సహదేవు రథం బెక్కి తొలఁగం దోలుకొని పోయె." (3-248)

ఇది, ధర్మజుడు తప్పించుకొనిపోయిన విధము. ఇందు ద్రోణుడుచేసిన వంచన యేమున్నది? అతడు వంచించినా డనుటయే వంచన.

## (3) సైంధవాభయదానము

ద్రోణుడు సైంధవుని రక్షింతు నని చెప్పి తప్పినా డనియు, అది వంచనకాదా? యనియు నొకవాదము.

స్థూలదృష్టి కట్లే యనిపించునుగాని, నిజ మది కాదు. లోతుగా జూచినగాని సత్యము గోచరించదు. అపుడు జరిగిన దేమనగా.—

విజయుని ప్రతిజ్ఞవార్త వినబడినంతనే సైంధవుని గుండెలు పగిలినవి. నిప్పులలో పడ్డట్లైనది. కాలోకచోట నిలువలేదు. రారాజు కొలువుకు పరుగెత్తి, తనకు మూడిన ముప్పు చెప్పుకొన్నాడు.

"ద్రోణ కర్ణ శల్య దుర్యోధనులుఁ గృప
బాహ్లికులును జముఁడు వట్టికొన్న
వానినైనఁ గావ వలఁతులు వలచిన
నొల్లకున్న నెట్టులొకొ యెఱుంగ" (ద్రోణ. 2.290)

అని మొత్తుకొన్నాడు. వడవడ వడకుచు, పెదవులుతడుపుకొనుచు, డగ్గుత్తికతో, సిగ్గువిడిచి,- "నేనెచటికైనను, పారిపోయి తలదక్కించుకొనెదను. అనుమతి యి" మ్మన్నాడు.

అప్పుడు 'నిజకార్య ధురంధరు'డైన దుర్యోధనుడు- "ఏమోయి అంతగా దైన్యపడెదవు? మే మిందర ముండగా నీ కేమి భయము! నీ మీద ఈగనైనను వాలనిత్తుమా? నేను, నా తమ్ములు, మన మహారథు లెల్లరును నీకు కోటగా నిలిచి నిన్ను రక్షింతుము. మా నడుమనున్న నిన్ను అర్జునుడు కాదు; అతని యబ్బయైనను చెనక జాలడు. నా మాట నమ్ము" మన్నాడు. కాని, సైంధవునికి ధైర్యము చిక్కలేదు. దడ తగ్గలేదు. దుర్యోధనుని పిల్చుకొని ద్రోణునికడకు పోయినాడు. తన యగచాట్లు తెల్పుకొని, అస్త్రవిద్యాకౌశలమున నర్జునునకును తనకును గల యంతర మెట్టిదని యడిగినాడు.

ఆచార్యుడు– "అర్జును డస్త్రవిద్యా విభవమున నీ కంటెను కడు నధికుడు. అందుకు సందేహము లేదు. అయినను, నేను గలుగ నీ వా సవ్యసాచికి వెఱవనేల? మద్బాణంబుల మఱువుననున్న నిన్ను దేవతలకుం దేఱిచూడవచ్చునే? వివ్వచ్చునకుం బ్రవేశింపరాని బంధురవ్యూహంబు వన్నించెద. కులధర్మంబు శిథిలంబు గాకుండ సమరంబు చేయుము" అని దుర్యోధనుని వలెనే, అతనికి ధైర్యముకలుగ జెప్పినాడు. కాని, ఆయన అంతటితో ఊరకొనలేదు. వెంటనే యిట్లొక హెచ్చరికయును చేసినాడు.

"సింధురాజా! క్రీడి నీకన్న నధికుడే యగుగాక; రణమున మరణమే యగుగాక. అందుకు భయపడి పారిపోవుట రాచపాడియగునా? పందతన మనిపించుకొనదా? వేదములు చదివితివి. క్రతువులు చేసితివి. కులము రక్షించితివి. కీర్తి గడించితివి. తుద కీ నైచ్య మేమిటికి? అజ్ఞానులవలె నీవును చావునకు వెరచుట తగునా? వెరచిన చావు తప్పునా? యాదవులు, కౌరవులు, పాండవులు, తక్కిన రాజులు - అందరునూ ఎప్పటికైనను పోవువారే గాని, కలకాలము శిలగొట్టుకొని యుందురా? బహు తపోదానయజ్ఞాదుల వలన గలుగు పుణ్యలోక సుఖానుభవము రణపరాఙ్ముఖులు కాని వీరుల కరచేతిలోనిదన్న సంగతి నీ వెరుంగనిదా? కాబట్టి మృత్యుభయమును కడగానెట్టి, పాలికలనికి పో" మ్మన్నాడు. గురుని హెచ్చరికచే నూరటచెంది సైంధవుడు కురురాజుతో కలసి సమరభూమికి పోయినాడు.

ఆ నాడు ప్రొద్దుకూకువరకును యుద్ధభూమికి రాక యేమూలబడియున్నను హాయిగా బ్రతికిపోయెడివాడుగదా సైంధవుడు; దుర్యోధన ద్రోణు లిద్దరును వానిని పోనీక ఆక పెట్టి యట్లు నిలుపుటకు కారణమేమి? ఆ నిలుపుటలోగల గుణాగుణము లేమి? విచారింతము.

సైంధవుడు పారిపోయినచో తన కవమానమగునని దుర్యోధను డాపినాడే గాని, అత డర్జును నడ్డగించుటయు, సైంధవుని రక్షించుటయు కల్ల. అట్టివాడు, "నిన్ను కాపాడు భారము నాది" యని హామీయిచ్చుట సాధ్యాసాధ్యవిచారణ లేని సాహసము. దానికి స్వార్థపరత్వము మూలము.

ఇక ఆచార్యుని విషయము. సైంధవ రక్షణ మశక్య మని యాచార్యు డెరుగును. ఎరిగియున్నను, దుర్యోధనుడు హామీయిచ్చి పిల్చుకొని వచ్చినప్పుడు, "సైంధవా! నిన్ను నేను రక్షింపజాలను; పారిపొ"మ్మని యెట్లు చెప్పగలడు? అట్లు చెప్పవచ్చునా? అదియును గాక, తాను సర్వసైన్యాధి పతి; తన సైన్యములలోని బంటు మొదలు మహారథికుని వరకును గల అన్ని తరగతుల జోదులకును కన్నాకై యుండుట యతనికి విధి. తన బలగములోని వాడును - మహారథుడును నైన జయద్రథుని పారిపో నిచ్చినచో ఆ యోటమి తనదే యగును. సర్వసైన్యాధిపత్యమునకు చాలనివా డని యేర్ప డును. అందువల్ల, సైంధవుని పారిపోనిచ్చుటగాని, పారిపో

మ్మని చెప్పుటగాని ఆయన కెంతమాత్రమును తగదు. పాశ్చాత్యులు యుద్ధవిముఖుడగు వానిని అప్పుడే కాల్చి వేయుదురు. అది రణనీతి.

రణధర్మము ననుసరించియే ఆచార్యుడు, "నేను గలుగ నీ వా సవ్యసాచికి వెఱవవల" దని యొక ధైర్యపు మాట చెప్పి, సైంధవు నట్లు నిలిపినాడు. కాపాడడమా? అది యెట్లును వట్టిదే. ఆ సంగతి మనసుకు వచ్చుటకే గదా- "చావు కై నను సమ్మతించి సమరమున నిలువవలసినదే గాని, వీరక్షత్రియుడు పారిపోరా" దని గురుడు సైంధవునకు బోధ చేసినది? అందధర్మము గాని వంచనగాని స్వార్థపరత్వము గాని యీషత్తును లేదు.

బ్రదుకుమీది యాశచేత పలాయనముచేయ సిద్ధపడిన వానిని అడ్డగాళ్ళువేసి యాపి, మృత్యువున కెరసేయుట అన్యాయము కాదా? యందురేమో; అది యన్యాయము కాదు. రణప్రకరణమున నదే న్యాయము. పోలికలనిలో అడుగుపెట్టిన పిమ్మట, తాను చచ్చుటకుగాని, తన వారిని చంపుకొనుటకుగాని వెనుకాడుట వీరధర్మము కాదు.

ఏతావతా, ఆచార్యుడు సైంధవునకిచ్చిన మాటలోను, ఆ మాటవెంటనే చేసిన బోధలోను గల భావ మే మనగా.—

"నిన్ను కాపాడుటకు నా శక్తికొలదిని యత్నింతును. అంతకు మించెనా నీకు మరణము సిద్ధము. కావున 'స్వర్గమో-

యశమో' యన్న నిశ్చయముతో యుద్ధములో నిలిచి కుల ధర్మముచు కాపాడుకొనుము" అనియే యందలి భావము. అంతేగాని, 'ఖండితముగా నేను పార్థుని ప్రతిఘటించి నిన్ను రక్షించెద' నన్న భావ మందులో లేదు. ఉన్నట్లు అజ్ఞానవశ మున దుర్యోధనుడును, అతని కోటికి చేరిన వారును అను కొన్నారు గాని, ఆచార్యుని తత్వమెరిగిన వా రెవరును అట్లను కొనలేదు.

మనలో మాట. - పార్థుని ప్రతిఘటింతునని భార ద్వాజుడు ప్రమాదముననైనను అనునా? ఎన్నడైనను అని యున్నాడా? అర్జును నెదుర్కొనుట యనగా అచ్యుతు నెదుర్కొనుటయేగదా! అది ఆయనకు సాధ్యమేనా? సాధ్యమే యగుగాక. సైంధవుని తాను బ్రతికించిన యెడల, అర్జును డగ్నిప్రవేశము చేయుట నిశ్చయముగదా! అది యాచార్యున కొప్పుదల యగునా?

అది యంతయు నపోహము. అర్జును నడ్డగించి సైంధ వుని రక్షింతునని ద్రోణు డనలేదు. అని తప్పినా డనువాదము ఋజువాదము కాదు.

## (4) రక్షణ ప్రయత్నము

"సరే; సైంధవుని బ్రతికింతునన లేదు; బ్రతికింప యత్నిం తునని యైనను అన్నాడుగదా! అట్టి యత్నమైనను సరిగా చేసినాడా?" అని యొక శంక. అదియును పరిశీలింతము.

ఆచార్యుడు శకటవ్యూహము పన్నించి, ఆ వ్యూహ మధ్యమున సైంధవుని భద్రపరిచి, అర్జునుడు చొచ్చుకొని రాకుండా తాను ఆ ముగ్గరము మొగదల నిలువబడ్డాడు. పాండవబలములు ఒక్క మొత్తముగా నెట్టుకొనివచ్చి ద్రోణు నిపై నెగబడ్డవి. ఊపిరిసెలుపుకో నివ్యూడము లేదు. అతడా ముమ్మరపుదొమ్మిలో మునిగియుండగా, అటువంక అర్జునుని తేరు తళుక్కు మన్నది. తేరు కంటబడుటయే తడవుగా, పాండవబలముల నదలించుచునే గురుడు, అలుగుల జడివానతో అర్జును నటకాయించినాడు. నరుడు గురునకు నమస్కరించి, ప్రతిబాణములు ప్రయోగించినాడు. గురు శిష్యులకు తీవ్ర యుద్ధము జరిగినది. ఇటు గురునకును, అటు శిష్యునకును బల మైన దెబ్బలు తగిలినవి. ఆచార్యుని ఖరతరశరపరంపర అర్జునునితోపాటు హరినిగూడా మిక్కిలిగా నొప్పించినది. ఒక పట్టున భారద్వాజుడు విజృంభించి గుప్పిన గొప్ప నారస మొకటి గుండెలలో గ్రుచ్చుకొని, ఫల్గునుడు పడిపోవుటయు జరిగినది. కాని, ఆ వీరు డప్పుడే తెప్పరిలి, అమర్షోద్రేకమున నతిఘోర సాయకములతో, నాచార్యు నదరంట గొట్టసాగినాడు. అప్పుడు కృష్ణుడు, వ్యవహారము ముదురుచుండుట కనిపెట్టి, "పార్థా! పౌరుషమున కిది సమయముకాదు. ధనురాచార్యు నింకను రెచ్చగొట్టిన మనకు కార్యము తప్పును. ఆ విప్రుని ప్రసన్నుని జేసికొని, తిన్నగా తప్పుకొనిపోవుట మన కిపుడు శ్రేయము" అని హెచ్చరిక యిచ్చినాడు. "అట్లైన నీ యిష్టము బావా"

అన్నాడు క్రీడి. కాని, తాను బాణప్రయోగ మాపలేదు. ఇక నిట్లుకాదని జనార్దనుడు, అరదమును గురునకు ప్రదక్షిణముగా పోనిచ్చి, వెనుకవైపుగా, మెల్లగా- అవతలికి దాటించినాడు.

ఆచార్యుడు చూచి, చిన్న నవ్వునవ్వి, "ఫల్గునా? పగవానిని గెలువకయే యెట్లు పోగలవు? నిలు నిలు" మని యదలించుచు విశిఖములు విసరుచూ, వెన్నంటి కొంత దూరము తరుముకొని పోయినాడు. ధనంజయుడు, "స్వామీ! నీవు నాకు గురుడవుగాని, పరుడవా? నిన్నెదుర పురహరునకైనను తరముగాదన, నాకు తరమగునా?" అని మనవిమాటలనుచూ సాగిపోయినాడు.

ఈ వంక పెచ్చుపెరిగివచ్చుచున్న పాండవచండచమూసమూహము నరికట్టవలసి యున్నందున, ద్రోణుడు, క్రీడి వెన్నాడిపోక వెనుకకు మరలి, శత్రుసంఘమును ఛిన్నాభిన్నము చేయుచున్నాడు.

ఇంతలో దుర్యోధనుడు వచ్చి, అర్జునుని పోనిచ్చినందుకు మండిపడి, గురువు నిట్లు నిష్ఠురము లాడినాడు.

"నిను నవలీల దాఁటి ప్రజ నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్న య
ర్జును దలయెత్తియైన నటు చూడవు, పాండవపక్షపాతి, నీ
మన మటుగాన యెప్పుడును మాదెసఁ గప్పుయొలుంగుఁ బాపవై
యునికి యెఱుంగవచ్చె నటు లూఁటగా వరమిచ్చినాఁడవో!"

(ద్రోణ. 3. 107)

"నిను నమ్మి యొండువలనికి
జనక జయద్రథుఁడు నిలిచె సైన్యములో, నా
తని జంపెడు దేనియ పూ
నిన క్రివిగాక మానిసివె యూహింపఁగ" ( ,, 3. 108)

అప్పు డాచార్యుడు,- రాజరాజా, కోపపడకుము. నరుని తేరు వచ్చుటయు, పోవుటయు మెరుపు మెరిసినట్లు క్షణములో జరిగిపోయినది. ఆ రవంతసేపులోను నేను జిష్ణుని-కృష్ణునిగూడా తూలిపోగొట్టినాను. నా యంపవెల్లి కాగలేక వా రోసరిలి దూసుకొన్నారు. కాకపోయినను, అచ్యుత సారథ్యముగల అర్జును నడ్డుకొన నా వశమా? వెన్నంటి పోరుదమన్నను ఆ సవ్యసాచి నిశితనారాచములు వెనుకవచ్చు వారిని గూడా వెంపరలాడును. ఇదియెల్ల నెరిగియెఁగి నీవు నన్ను నెపపెట్టవచ్చునా? నే నిచటనిలుచుటయు, నీ హితము కొరకే సుమా? ఎట్లందువా? నే నని మొనవదలి యాతని వెను దగిలి పోయినచో పాండవవాహిని విచ్చలవిడిగా వచ్చి విరుచుకపడును. మన యొడ్డు చెదరెనేని సైంధవునిగాచుట కష్టమగును. అట్లునుగాక, "రాజమధ్యమున- ధర్మరాజును పట్టెద" నని మాట యిచ్చియుంటినిగదా! ఆ పని యేమరదగునా? ఆతనికొరకే వేచి నిలిచియున్నాను. ఇందు నా పొరపా టేమున్నది? చెప్పు" మన్నాడు.

దుర్యోధనుడు పల్లెత్తి పలుకలేదు. ఆచార్యుడు చెప్పిన దానిలో అసత్యముగాని, చేసినపనిలో అక్రమముగాని ఆతనికి పొడకట్టలేదు. తాను తొందరపడి నిందించినందుకు నొచ్చుకొన్నాడు. వెంటనే రాజసము తగ్గించుకొని,—

"సైంధవున కడ్డమున్న రాజవ్రజంబు
పార్థురాకను వెలువెలఁ బాఱఁజొచ్చె
నార్తిఁ బలుకును నా మాట కలుగ కకట!
చావకుండంగ నాతనిఁ గావవయ్య" (ద్రోణ. 3. 110)

అని భారద్వాజుని వేడుకొన్నాడు. ఆ బ్రాహ్మణుడు,- "కురు రాజా! నీ మాటలకును, మా యశ్వత్థామ మాటలకును నాకు కోపమువచ్చునా? అట్టి దేమియు లేదుగాని, నా యీ మాట విను. - వయసు చెల్లినవాడ నగుటచేత శీఘ్రయానము నా కశక్యము. గాండీవియు, నీవును తుల్యవయోవర్తనములు గలవారు. నీవు శంక లేక అతనితో విరోధము పెట్టుకొన్నవాడవు. కాబట్టి తగు సహాయులను గూర్చుకొని నీవే యాతని కడ్డపడుము. ఆలస్యముచేయక యిప్పుడే పొమ్ము" అన్నాడు.

ఆచార్యుని యీ పలుకులలో సత్యముతోపాటు మెత్తని యెత్తిపొడుపును - ఉన్నది. అందు కాగ్రహపడి ప్రయోజనము లేదని తెలిసికొని, రారాజు 'కుక్కిన పేనై' నాడు. సత్యమునకు తలయొగ్గి, ఆచార్యుడు చెప్పిన ప్రకారమే పొలికలనికి పోయినాడు.

ఇట్లు, సైంధవరక్షణవిషయమున నాచార్యుని వర్తనమును సరిగా గుర్తింపక దుర్యోధనుడు దూరుటయు, వివరములు విని వెంటనే క్షమాపణ కోరుటయు, ఆనాడే జరిగి యుండగా, విమర్శకు లీనాడు మరల ఆవిషయమునే యెత్తుకొని, ద్రోణుడు ఋజువర్తనుడు కాడని నిర్ణయింపబూనుట వృథాప్రయాసము కాదా!

---

# ౧౯. కురుపతి యాక్రోశము

పార్థుని పరాక్రమముచేతనో, మాధవుని మహిమ చేతనో, కాలనిర్ణయముచేతనో, అన్నిటి కలయికచేతనో ఎట్లైన నేమి? సైంధవుని తల యెగిరిపోయినది. దుర్యోధనుడు దురపిల్లుచు మరల గురువుకడకువచ్చి- "ఏమిస్వామీ! అనుగు బంటన్న యభిమానముచేత నీ వర్జును నరికట్టకపోతివి. నాకు కర్ణుడే దిక్కయ్యెను. ఆ వీరుడు నీవలె 'మాయామర్మము' లెరుగని వాడు గావున, నాకై, ప్రాణములకు తెగించియు పోరాడినాడు. కాని జయద్రథుని రక్షింపలేకపోయినాడు. ఈ విధముగా మేము సైంధవుని కోలుపోయినాము" అని కర్ణుని పొగడుచు, ద్రోణుని తెగడుచు ప్రసంగించినాడు. ఆ మాట లకు మనసు కలుక్కుమని ఆ బ్రాహ్మణుడు చల్లగా ఇట్లు బదులుచెప్పినాడు.

"దుర్యోధనా! పాంచాలురును, పాండవులును అనికి తఱిమి నా యొడలు మండించుచుండగా, నీ విట్టి పోటుమాటల చేత, నా మనసేల మండించెదవు? నీ వాచేతచేసినది యీచేత అనుభవమునకు వచ్చినది. అంతేగాని, యిపు డాగంతుకముగా వచ్చిన దేమియు లేదు. ఆ నాటి శకునిచేతి పాచికలే, యీ నాడు గాండీవము క్తప్రతిష్ఠ బాణములరూపమునవచ్చి నిన్ను వేధించుచున్నవి. వాటి నెవ్వ రడ్డగింపగలరు. పరమసాధ్విని పాంచాలిని భంగపరిచితివి. ఆ మహాపాపఫల మనుభవింపక

తీరునా? నీవు పెద్దలమాట దుద్దునగలిపి, చెడుగులమాటకు చెవియొగ్గితివి. ఇట్లుగాక మరియెట్లగును? దేవతలకును అజయ్యుడైన భీష్ముడు పడిపోయినప్పుడే, కౌరవుల బ్రదుకిక వట్టిదే యని నాకు తోచినది. తోచినను అభిమానముకొలది, నీతో పాటు పెనగుచున్నాను. పేరుకు బ్రాహ్మణుడనేగాని, నిజానికి నేనొక పరమ కిరాతకుడను. కాకున్న, పడరాని యిడుమలు పడి, ధర్మసమ్మతమైన భాగమును వేడియు పొందలేక, కుందుచున్న ఆ పాండునందనులతో మార్కొందునా? ఇంతచేసియు నీ నిందకు గుఱియైతినే గాని నీ యభిమానమునకు భాజనము కాకపోతిని. ఇది నా పాపఫలము. కిరీటిని గెలువశక్యము గాదని నెత్తిని నోరుపెట్టుకొని మొత్తుకొన్నానే! నీవు నా మాట విన్నావా? సైంధవుని గాపాడలేదని యిపుడు నన్ను నిందింతువేల? ఆపని నీచేత గాలేదు; నీవు నీవా రనుకొన్న వారిచేత గాలేదు; అట్లే నాచేతను గాలేదు. మరి నన్నే యెందుకు నిందించెదవు? నేను నీ వాడను కానా?" అంటూ, వెనుకటి సంగతులన్నీ తాకనాడుచూ, నిలవదీసి యడిగినాడు. దుర్యోధనుడు పెదవి కదపలేదు. కాని, ఆచార్యుడు తనకు మనస్ఫూర్తిగా సహాయము చేయులేదన్న యనుమాన జ్వర మాతనికి అంతర్గతముగా కాయుచునే యున్నది. ఆ తాపము నాపుకొనలేక, కర్ణునికడకుపోయి, యిట్లు వెలిబుచ్చుకొన్నాడు.

కర్ణా! ఆచార్యుడు మనపాలిటి శని; మన పక్షమున అరమనసుతో మెలగినాడేగాని, నిండుమనసుతో భండనము

చేయలేదు. అతడు గట్టిగా మొనకట్టియే యున్నచో అర్జును డతని నతిక్రమించిపోగలడా? వానికి తానే దారియిచ్చినాడు. సందేహములేదు. మనముచేసిన పాపమేమో? క్రీడిపై గలిగిన కూరిమి ఆ బాపనికి మనపై గలుగలేదు. తనమాటను నమ్మి గదా మనము సైంధవుని సమరభూమికి తెచ్చితిమి? తానిట్లు మోసముచేయవచ్చునా? ఇది విశ్వాసద్రోహముకాదా? ఇప్పు డనుకొని యేమిలాభము. ఆతనిని నమ్మి మన మన్నివిధములా చెడిపోయినాము" అని, యాచార్యు నాడిపోయుచూ ఉంగ లార్చినాడు.

కర్ణుడు తనకు వంత పలుకుననుకొన్నాడు దుర్యోధనుడు. అతడు శూరుడు; వ్యవహారజ్ఞుడు. అ ట్లేల పలుకును? అతని దృష్టియే వేరు.

అత డన్నమాట, యిది. —

"అన విని కర్ణుఁ డిట్లనియె; న గ్గురు దూఱఁగ నేల? యాతఁ డో
పినటుల పోరుఁగాక నరుబీరము లావును నెక్కుడైన వా
ని నుడుపవచ్చునే? విధియు నేర్చు; విసంబిడి, యిల్లుగాల్చి, కా
ననమున కేఁగఁజేసి యొకనాశము గంటిమె గొంతి సంతతిన్"

(ద్రోణ. 5. 48)

"కావున మన సైంధవుని
దైవము తెగటార్చె వంతఁదలరి మనమునం
జేవ సెడనేల. పోరం
గా విధిపంచినటు లయ్యెఁ గడఁగనవలయున్" (5. 49)

శక్యముగాని పనిపెట్టి, చేయలేదని యాచార్యుని దూరుట యవివేక మనుటయేగాక, "దైవము పాండవుల కనుకూలమై యున్నాడు. అందువలన, కుంతి కొడుకుల నంతమొందింప నింతకుముందు మనముచేసిన యత్నములవలెనే, యీనాటి యత్నమును వ్యర్థమైపోయినది. మన ప్రతికూల దైవమే మన సైంధవునిం జంపినాడుగాని, యిందు, ఆచార్యుని మోస మేమియులేదు?' అని విషయమంతయు విడమర్చిచెప్పి, కర్ణుడు దుర్యోధను నూరడించినాడు. ఆతడును సమాధానపడ్డాడు.

కర్ణుని యీ వాక్యములు ద్రోణునిపై దూరుమోపువారి యాక్షేపములకు సమాధానములు కావా?

---

# ౨౦. ఆత్మవధోపాయకథనము

భీష్మద్రోణులు, తమ్ము జంపుట కుపాయములు చెప్పి, పాండవులకు జయముచేకూర్చి, కౌరవులకు ద్రోహముచేసినా రని వారిపై నొక నేరము.

ఇది ముఖ్యముగా విచారింపవలసిన విషయము. ముందు భీష్మునికథ విచారింతము.

## భీష్మునికథ

పాండవులు తొమ్మిదిదినములు భీష్మునితో పోరాడినారు. ఆ వీరసింహమును నిగ్రహింపలేకపోయినారు. ఆయన యనుగ్రహము పొందిననేగాని, సంగ్రామసాగరము తరింప రాదనుకొన్నారు. అనుకొని, ఆ(తొమ్మిదవ)నాటిరాత్రి, ధర్మజుడు తమ్ములను వెంటబెట్టుకొని, భీష్ముని శిబిరమున కరిగి, పాదాక్రాంతుడై రాజ్యభిక్షపెట్టు మని దీనముగా వేడుకొన్నాడు. మనుమని దైన్యమునకు మనసుకరిగి, పితామహుడు,—"ధర్మనందనా! మీకు ప్రియముచేయుటకంటెను నాకు సుకృతము గలదా! మీ ప్రార్థనమును కాదనజాలను గాని, నాచేత ధనువున్నంతవరకును మీకు జయముకలుగదు. నేను దేవతలకును వధ్యుడనుగాను. కాని, యొకరహస్యముకలదు. నే నంగనాపూర్వుని మొగము చూడను. వా డమ్ములతో నన్ను కొట్టినను, నేను వానిని కొట్టను. ఇది నావ్రతము. అట్టివాడు-

శిఖండి - దైవవశమున మీలో నున్నాడు. వానిని పురస్కరించుకొని యర్జునుడు నన్నునొప్పించి పడవైచునది. తరువాత ధార్తరాష్ట్రులనుగెల్చుట మీకు తేలికయగును" అని యుపాయముచెప్పి పంపివేసినాడు. కాని, ఆ యుపాయము వారికిష్టముగాలేదు. పూజ్యుడును, తమ్ముపెంచినవాడును నైన తాతను వంచనతోపడగొట్టుటకు ఫల్గునుడు సమ్మతింపలేదు. అందువలన వారు మరునాటియుద్ధమున భీష్మునెదుటికి శిఖండిని తేలేదు. భీష్ముడే, ధర్మజునకుజెప్పి శిఖండిని పిలిపించుకొని, వానిమూలమున కూలిపోయినాడు.

భీష్ము నిట్టిశోచ్యస్థితికి తెచ్చినవాడు దుర్యోధనుడే. ఎట్లనగా,—

ఎనిమిదవనాటిరాత్రి దుర్యోధనుడు, రణలంపటుడైన కర్ణుని ప్రేరణమున భీష్ముని నివేశమునకు పోయి,- "నీ వెనిమిది నాళ్లు యుద్ధముచేసియు సవ్యసాచిని సమయింపకపోతివి. నీవు పోరు తీరు నేను గమనించుచునేయున్నాను. నీ విక ఆలము చాలించి, కయ్యమునకు కర్ణునిబంపు"మన్నాడు. ఆ మహాత్ముని చిత్తము చివుక్కురు మన్నది. కోపమూ - విషాదముకూడా పొంగివచ్చినవి. శమ సంపన్నుడుగావున సమాళించుకొని, కొంచెముసేపు మౌనముగానుండి "దుర్యోధనా! నీకుగా నే నిన్నినాళ్లును, ప్రాణములనుదాపక పాండవబలములతో నా శక్తికొలదిని పోరాడితిని. పోరిపోరి పుల్లసిలియున్నాను. నాశ్రమ మరయక, నామన సెరుగక, నాయందలిభక్తిని

విడనాడి నీ వి ట్లనవచ్చునా? గాండీవిని గెలువరా దనియు, శిఖండిని చంపుట నాకు కాదనియు నీకు ముందే చెప్పి యున్నానుగదా! మరల నీ ప్రసంగమేల? రేపు నేను, ద్రుపద విరాట యాదవబలములతో పెనగెదను. మీ రందరును, పాండుపుత్రులతో మార్కొని గెల్వుడు. నడిరేయివచ్చి న న్నిట్లు నొవ్వబలికిన మీకు జయముగల్గునా? రేపటి యనిలో నాచేతిబలువు చూచెదవు గాక; రణభూమికి రమ్ము. పో”మ్మన్నాడు. అతడు వెళ్లిపోయినాడు.

మరునాడు-అనగా, తొమ్మిదవనాడు-కురురాజు యుద్ధమునకు సన్నద్ధుడై, భీష్ము నుపలక్షించి, తన వారితో,-“ఇతడీ నాడు పాంచాలాది బలముల నెల్ల బరిమార్చునట! రాత్రి నాతో ననియున్నాడు. మనమును, మన లావును - చేవను చూపవలె”నని యెత్తిపొడుపుగా, అన్నాడు.

“అని యాడు తులువమాటలు
విని బీభత్సంబు సిగ్గు విపుల విషాదం
బును నొక్కపెట్ట పుట్టఁగ
ననిమిషతటినీ తనూజుఁ డతిదుఃఖితుఁడై” (భీష్మ. 3.186)

“తన్నుఁ దాన యుపశమించుకొని, యున్నం గనుంగొని కౌరవేశ్వరుం డతని కన్నెఱింగినవాఁడై”- గురుకృపాశ్వత్థామలకు భీష్ముంజూపి యిట్లన్నాడు.

“సత్యవ్రతుండగు నీతండు శిఖండిపై నేయ నని మన మెత్తివిడియు నాఁడ చెప్పుట మీ రెఱుంగుదుర కాదె? యన్నీచునకు గోచరంబుగాకుండ ని మ్మహానుభావుం బొదివికొని రావలయు ననిన వారలు నట్ల కాక యనిరి.” (3. 189)

కర్ణుని దుర్భోధవలన దుర్యోధనుడు, తనకు పితామహుడును, మహాత్ముడును సర్వసముడును, హృదయ పూర్వకము గావచ్చి తనకై సమరము చేయుచున్నవాడును నైన భీష్ముని కడ నెంతయవివేకముగా వర్తించినాడో గమనించితిరా? కడచినరాత్రి "నీ పోరాటము వట్టి బూటకపు నాటకము. నీవిక యుద్ధమునకు రావలదు, నిల్చిపొ"మ్మన్నాడు; "కయ్యమునకు కర్ణుని పోని"మ్మన్నాడు. అంతటితో నూరకపోక, ఈనాడు, ఎత్తిపొడుపు మాటలతో, ఆ మహానుభావుని చిత్తము నొగిలించినాడు. ఎంతటి సమచిత్తులకైనను, అట్టి వెడమాటలు వైమనస్యమును కలిగింపకుండునా?

దుర్యోధనుని దురాలాపములతో భీష్మునిమనసు పూర్తిగా విరిగిపోయినది. 'వీనికై యింకను - ఉత్తమక్షత్రియహింస చేయుచూ బ్రతికియుండుటకంటెను, ఇంతటితో మనుగడ విరుగడచేసికొని పోవుట మంచి'దనియు తోచినది. కాని, ఆయన ఆ భావమును వెలిపుచ్చలేదు. అల్పమతులవలె మహామతులంతలో బయటపడుదురా! "రేపు పాంచాలాది బలములతో పెనగెద"నని రాత్రి యనియున్నాడుగావున ఆ మాటకు బద్ధుడై, ఆనాడును యుద్ధముచేసినాడు. ఆ యుద్ధమున తనచేతి బలువేపాటిదో, తన్ను తులువమాటలన్న దుర్యోధనునకు తెలియుగాక యనికాబోలు విజృంభించినాడు. భీష్మునిధాటికి బీభత్సుని బీరము బీరుపోయినది. కృష్ణుడు అక్రమముగాచక్రము పట్టవలసివచ్చినది. ధర్మజునకు జయాశ సన్నగిలి, తత్తరపాటు

పుట్టినది. అందుచేతనే, ఆరాత్రి భీష్ముని శరణుచొచ్చినాడు. జీవితముపై విరక్తికలిగియున్న సురనదీసుతునకు ధర్మసుతుని శరణాగతి చక్కగా అనుకూలించినది. తానెట్లును ఐహికయాత్ర నుండి విరమింప నిశ్చయించుకొనియే యున్నాడు. ధర్మజుని యభ్యర్థమును అదియే యైనది. "రోగి పాలు కోరాడు; వైద్యుడు పాలే పథ్యమన్నాడు" అన్న సామెతకు సరిపోయినది వారి ఆ వ్యవహారము.- తన తనుత్యాగము "ఏకా క్రియా ద్వ్యర్థకరీ బభూవ" అన్నట్లు, తన కనిష్టనివారకమును-ధర్మజున కభీష్టకారకమును నగుట భావించి, ఆ ధర్మవేత్త నిజ వధోపాయమును - అతనికి తెలిపి పంపించినాడు.

అందుకు కారకుడు దుర్యోధనుడై యుండగా, 'కౌరవ ద్రోహి' యనియు, 'పాండవ పక్షపాతి' యనియు భీష్ముని నిందించుట అజ్ఞానముకాదా?

ఇక పిమ్మటి కథ.——

పదియవనాటి యుద్ధమున భీష్ముడు, పాండవుల చమూ తండములను చెండుబెండాడినాడు.

"పాండవ బలముల యత్యు
ద్దండ పరాక్రమము నూచి దర్పోద్ధత వే
దండములఁ గనిన కేసరి
చండత భీష్ముండు వొదివె శరనఖరములన్" (భీష్మ. 3. 361)
"డొల్లెడు సూతులుఁ జెలఁచం
ద్రెళ్లెడు తురగములుఁగా నతి క్రూరగతిం
బెల్లేయుచు సత్వరముగ
నెల్లెడలం దాన యగుచు నేడ్తెఁ బొదివెన్" (3-362)

ఈవిధముగా, ప్రొద్దు పదిహాలువరకును విహారముచేసి, అతడు తన మనసులో,—

"ఉత్తమ క్షత్రియుల నెల్ల నుగ్రవృత్తి
నేఁడు పదినాళ్లుశేని నా నిశిత శరచ
యములఁ గూల్చితి వేసరి నట్టులయ్యె
మేనితోడి హా త్తిఁ కిట మాను టొప్పు" (3-364)

అనుకొని, కయ్యముచేయుటకుగా బోవువిధమున సైనికులను తప్పించుకొనుచు, ధర్మజుని సమీపమునకుపోయి, మెల్లగా,—

"జనియించినంతనుండియుఁ
జనపతులం గ్రూరవృత్తిఁ జంపుచునుండం
జనియెను గాలము విసిపితి
ననఘా! యే నింకఁ జాల నాసురవిధికిన్" (3. 366)

"మీరు నా హితంబు గోరుదురేని శి
ఖండి మున్నుగాఁగఁ గడఁగి యంత
కట్టువారు నొక్కపెట్టగాఁ బైఁబడి
యేయుఁ డింకఁ దడవుసేయవలదు" (3. 367)

అని బతిమాలుకొన్నాడు. తాతగారి కోరికను, ఆనతిగా శిరసా వహించి, ధర్మజుడు తమ్ములకు తెలిపినాడు. వారు శిఖండిని తగిన రక్షణతో పిల్చుకొనివచ్చి భీష్మునికి ప్రతివీరునిగా నిలిపినారు. భీష్ముడు విముఖుడై యుద్ధముమాని నిలువబడ్డాడు. అప్పు డర్జునుడు శ్రీకృష్ణుని ప్రోద్బలమున - శిఖండిని మాటు చేసికొని, కులిశములవంటి క్రూరనారాచములు గుప్పి, పితామహుని బడగొట్టినాడు శరవృలగుంపు గుచ్చప్పగించి వెట్టి

చూపులు చూచుచుండెనే గాని, ముందుగా తెలిసియుండియు శిఖండిబారినుండి గాంగేయుని తప్పింపలేకపోయినది. భీష్ముడు పడిపోవుట కౌరవుల చేతగానితనమువల్లగాని, పాండవుల యందలి పక్షపాతముచేతగాదు.

ధర్మరాజు శిఖండిని భీష్మునిపై ప్రయోగించుట భీష్ముని కోరికమేరకుగాని, స్వార్థమునకుగాదు. కేవలస్వార్థమునకే అయినయెడల - ఆ యుపాయము నిన్ననే తెలిసికొని యుండియు - ఈనాటియుద్ధమున తొలిమునుముననే శిఖండిని తెచ్చిపెట్టక, భీష్ముడువచ్చి తన్నడుగుకొనువరకును ఏల తేకుండును?

భీష్ముడు, తన్ను జంపుట కుపాయమును యుధిష్ఠిరునకు తెల్పుట పక్షపాతముచేత - నని యందురుగదా! అది నిజమే యగునేని,—

"నినుc బోరc గెలుచువిధము బోధింపుము" (భీష్మ. 1. 157).

అని యతడు సమరప్రారంభముననే యడిగెనే; భీష్ము డప్పుడు గదా చెప్పియుండవలసినది? అప్పుడు చెప్పక, పది దినములు కదనముచేసి, పదివేలమంది శూరులను - వారి చతురంగములను - సదమద మొనర్చి, తాను చనిపోవ నిశ్చయించుకొన్న తర్వాత చెప్పినాడే! అదేనా పక్షపాతము? అందువలన

పాండవుల కొఱిగిన దేమి? * యుద్ధములో పాండవసేనలకు సందిచ్చి, కౌరవసేనలను ధ్వంసము చేయించినాడా? లేదే. మరి పక్షపాత మెక్కడ?

ఇక్కడ ఒక్కమాటః- భీష్ముడు పక్షపాతముచేతనే చచ్చినా డనుకొందము. భీష్ముడు - ద్రోణుడుకూడా, సమరము సరిగా చేయనివారనిగదా కౌరవపక్షీయుల వాదము?

అట్టి కుచ్ఛితులు చచ్చుటచేత వ్యయభారముతగ్గి కౌరవులకు లాభమగునే గాని నష్టి యుండదుగదా! మరి, "ఆ వీరు లిద్దరును, తమ చావునకు తెరువులు పాండవులకు తెలిపి, కౌరవులకు ద్రోహము చేసినా" రని ఘోషించుటలో అర్థమేమి?

ఏమియును లేదు. అవి యన్నియు విమర్శజ్ఞానదూరములైన శుష్క పక్షపాత ప్రసంగములు. భీష్ముడు శిఖండి వృత్తాంతమును పాండవులకు రహస్యముగా తెలిపినా డన్నది భారత కథాంధ పరంపరా ప్రసారిత ప్రవాదముగాని సత్యము గాదు.

ఆయన "అంగనాపూర్వుడగు శిఖండిని భండనమున నేను చంపను; నొంపను" (ఉద్యో. 4-400) అని, తాను సర్వ

* "భీష్ముడు స్వసైన్యమున కెంతమాత్రము నష్టమురాని రీతి నద్భుతముగ వ్యూహముల బన్నుచు గృష్ణుని మాయోపాయములకు గాని, యర్జునుని వ్యూహభేదనా నైపుణ్యమునకుగాని యవకాశ మొసగక... మెలగెను." ('పెండ్యాల'. పు.183)

సైన్యాధిపత్యమును కైకొన్ననాడే దుర్యోధనునికి చెప్పినాడు. మరల, ఎనిమిదవనాటి రాత్రి హెచ్చరించినాడు. పాండవులకు చెప్పినది తొమ్మిదవనాటి రాత్రి. కాబట్టి ఆ విషయమున ఆయనచేసిన కృత్రిమముగాని, కుట్రగాని యేమీ లేదు.

* "భీష్ముఁ డట్టి కృత్రిమమును చేసినా డనుటవిశ్వాస్యము కా" దని విదేశపండితులు తెలిపినను తెలిసికొనక, గ్రంథమును సరిగా పరికింపక, మన దేశపు పండితులు "భీష్ముడు కపటియే; కౌరవద్రోహియే" యని రాయుచుండుట లజ్జాకరము; గర్హ్యమున్ను.

పిమ్మటి విమర్శకులు పరప్రత్యయనేయబుద్ధులై, ఈపండితుల వాక్యములనే శుకానువాదము చేయుచు, మహాత్ముల చరిత్రలను మలినీకరించుచుండుట మనస్వులు మన్నింపరాని మహాపరాధము.

---

* "భీష్ముఁడు తొమ్మిదవనాటిరాత్రి ధర్మజునకుఁ దన గుట్టు నంతయుఁ జెప్పి కపటపుఁజావు చచ్చెను. - అతఁడు సర్వసైన్యాధిపత్యము వహించి తాను పడిపోవుటకు హేతువును శత్రునకుఁజెప్పుట మాత్రము మన దృష్టిని విచారణీయాంశమై యున్నది. డాక్టరు 'వింటర్నిడ్జు' వంటి పాశ్చాత్యదేశీయుఁడుకూడ భీష్ముని ప్రఖ్యాతింజట్టి యాతఁ డట్టి కృత్రిమముఁ జేయఁడనియు, భీష్ముఁడు పడుటకుఁ దగిన యుపాయము కృష్ణుఁడే చెప్పియుండును ననియు వ్రాసి యున్నాఁడు. కాని భీష్ముఁడు. కపటియే."

('పెండ్యాల'-పు. 120, 121)

## నీరసాక్షేపము

* "భీష్ముడు పదిదినములు యుద్ధముచేసియు పేరుగల వాని నెవ్వనిని చంపలే"దని యొక ఆక్షేపము.

ఆ సత్యవ్రతుడు "నేను దినమున కొక్క వేయిమంది రాజరక్షకులను చంపుదును. పదిదినములు మాత్రమే యుద్ధము చేయుదును" అని దుర్యోధనునకు ముందుగనే చెప్పినాడు; (చూ. ఉద్యో. 4-407, 409). చెప్పినప్రకారమే చేసినాడు. ఆయనబారిని పడ్డవారు గతించినారు. ఆయననెదుర్కొననివారు బ్రతికియున్నారు. అది ఆయనతప్పా! భీష్మునిచేత పొలిసిన పదివేలమందియు చతురంగబల సమేతులైన రాజులే. కాలి బంటులుగారు.

ఇట్టి నీరసాక్షేపములు, ఆక్షేపకుల సంకుచిత కుత్సిత బుద్ధిని వెల్లడించునే గాని, అనిమిషులకును అజేయుడైన ఆ మహావీరుని ప్రతాపమహిమను కొంచెపరచగలవా? ధర్మ స్వరూపుడైన ఆ యుత్తమపురుషుని కీర్తిని కించపరచగలవా?

భీష్ముడు, తాను దుర్యోధనున కిచ్చిన బాసప్రకారము పది దినములును యుద్ధముచేసియే పడిపోయినాడు. కావున ఆయన కౌరవులకు ద్రోహముచేసినా డనువాదము దుర్వాద మనియు, పాండవులకు నిజవధోపాయము చెప్పుటలో తప్పే మియు లేదనియు, నిందు తేలిన సారాంశము.

* "భీష్ముండు పదిదినములు సర్వసైన్యాధిపత్యము చేసియు పేరుగల వాని నెవ్వనిఁ జంపలేదు." ('పెండ్యాల' పు. 120)

## ద్రోణుని కథ

"నాచేత నాయుధం బున్నంతసేపు నన్నుం జంప నెట్టి వారికి నశక్యం బేను ప్రాయోపవేశంబున సన్న్యస్తశస్త్రుండనైనం జంపుటకు నోపునట్టి వారికి నది దొరకొనుం బెద్దయు నమ్మఁగలవాఁడు సెప్ప నత్యంత దుస్సహంబైన కీడుమాట వింటినేని నట్టివాఁడ నగుదును. అట్టి పగఱకు నప్పని దీర్ప ననువై యుండును". (భీష్మ. 1-131)

అని ద్రోణుడు ధర్మజునకు చెప్పిన మాట.

అది సత్యకాలము గావున, అట్టి కీడుమాట సత్యవంతు డెవ్వడును చెప్పడనియు, ప్రాయోపవేశము చేసినవానిని కొట్టి చంపు దుష్టు డెవ్వడును ఉండడనియు - ఆ బ్రాహ్మణు డను కొన్నాడు. అట్టి నమ్మకముతోనే ఆ మాట చెప్పినాడు.

ఋతవాదియైన ధర్మతనయుడే, రాజ్యకాంక్షచేత అట్టి యనృతము చెప్పుటకు పాలుపడ్డాడు; ప్రాయోపవేశము చేసిన వానిని వధించుటకు ధృష్టద్యుమ్నుడు పాలుపడ్డాడు. నింద్యులు వారుగాని, అందు ద్రోణునిదోష మేమున్నది?

సత్యమహిమచేత ధర్మసుతుని రథమును - రథ్యములును నేలనంటక, నేలకు నాలు గంగుళముల యెత్తున పోవుచుండెడి వనియు, అత డసత్యము చెప్పుటతోనే అవి నేల కంటు నిలబడిన వనియు భారతోక్తి.

* "తస్య పూర్వం రథః పృథ్వ్యా శ్చతురంగుళ ముచ్ఛ్రితః
బభూ వైవంతు తే నోక్తే, తస్యవాహా హ్యస్పృశ న్మహీమ్"
(ద్రోణ. ౧౯౧. ౫౭)

అబద్ధమాడి, ఆచార్యున కపకారముచేసి ధర్మరాజు దోషియైనాడేగాని, ఇందు ద్రోణుని దోషమేమియు లేదు.

---

* తిక్కన పద్యము

"నేలకు నల్గెడు పొడువునఁ
గ్రాలుచు మును మెఱయు గురుని రథచక్రము ల
క్కాలంబున సమర జయ
శ్రీ లోపము దెలియ నంటసిలఁబడియె నృపా!"
(ద్రోణ. 5. 317)

ఈ యనువాదమున పొరపాటున్నది.

## ౨౧. స్వామిద్రోహు లెవరు?



ద్రోణుడును, భీష్ముడును - "మేము క్రీడి నోడింప జాలము; కలహము మనకు క్షేమకారికాదు" అన్నవారుగనుక స్వామిద్రోహు లనియు, కర్ణుడు "నేను కవ్వడివిజయించి నిన్ను గెల్పింతు" నని చెప్పి దుర్యోధనుని యుద్ధమునకు పురికొల్పిన వాడుగనుక స్వామిభక్తు డనియు విమర్శకుల సిద్ధాంతము. *

ఇది కేవల మపసిద్ధాంతము. ఆ వృద్ధు లిద్దరును కురు కులమునకురానున్న ముప్పు తప్పించుటకై, ఋజుమార్గమున హితముచెప్పి, ఆ హితమును వినక తిరస్కరించినను విమన స్కులుగాక, స్వామికై పోరి సమరమున సమసినవారు.

కర్ణుడో; అర్జునుడు తన కజయ్యుడని తెలిసియు - "నే నర్జునునివధించి నిన్ను గెల్పింతు" నని బొల్లిమాటచెప్పి, ఆశ కల్గించి, యుద్ధమునకు దింపి, ఆ యుద్ధములో తా నర్జునుని చేతిలోచచ్చి, దుర్యోధనుని పుట్టి నట్టేట ముంచి పోయినవాడు.

ఎవరు స్వామిద్రోహులు?

సూతసుతుని సహవాసమే కౌరవపతి వినాశమునకు కారణము. ధృతరాష్ట్రు డీ సంగతి తొలుతనే గ్రహించి,—

---

* "కర్ణుఁడు వినుతికెక్కిన రాజభక్తిపరుఁడు. అందువలనఁ దనప్రాణములను యుద్ధభూమిలోఁ ద్యజించెను." ('పెండ్యాల' - పు. 274)

"మృత్యుపాశోపహతుఁ డయ్యె మీఁ దెఱుఁగక
సూతనందనుతోఁగూడి నా తనూజుఁ
డకట నాశంబుఁ బొందు వాఁ డయ్యె మనకు
నింకఁ జేయంగనగుపని యెద్ది చెపుమ" (ఉద్యో. 2-297)

అని విదురునితో చెప్పికొని పరితాపపడ్డాడు.

"దౌర్మంత్ర్యా న్నృపతి ర్వినశ్యతి"

యన్న భర్తృహరి సుభాషితమునకు దృష్టాంతముగా చెప్ప దగినది కర్ణ దుర్యోధనుల కథ.

కర్ణుడు 'స్వామిభక్తిపరు' డనుట కథావిరుద్ధము.

---

# ౨౨. కర్ణుని కలరూపు



* "కర్ణుడు దుర్యోధనునికొరకు స్వార్థమును త్యజించిన త్యాగి" యని యొక పొగడిక. అతని త్యాగమును - రాజభక్తిని అతిమాత్రముగా నుతించుచు రచనలు చేసినవారును గలరు. వారి రచనలు రుచిరములైనను, అందలి విషయము మాత్రము సత్యమునకు విరుద్ధము.

సత్యమేమనగా: కర్ణుడు దుర్యోధనునకు మిత్రుడుగాను, పాండవులకు పగతుడుగాను నటించి, దుర్యోధనునకు కీడును - పాండవులకు మేలును చేసినవాడు. అతడు తొలుత కురుపతితో చేరుటలోను, పిదప కృష్ణు డెన్ని యాశలు చెప్పినను - అటుపైని తల్లి యెంత బతిమాలినను పాండవులలో చేరకపోవుటలోను, ఆతని యాంతర్యము వేరు; అతడు పైకి కనబరిచిన వైఖరి వేరు. అది స్వోద్దిష్టార్థ సాధనకై వేసిన యొక పెద్ద యెత్తు. అమాయికుడైన దుర్యోధనుడును - తత్తుల్యమైన లోకమును ఆతని బురిడీలో పడిపోయినారు. కర్ణుడు వ్యవహార తంత్రమున చాణక్యాదుల తలదాటినవాడు.

---

* కర్ణుడు స్వార్థత్యాగి. అందువలననే కృష్ణుడుద్బోధించి. నీవు పాండవులం గూడినచో సామ్రాజ్యాధిపత్యము నీకె వచ్చునని యాశపెట్టినను ప్రభునకు భక్తిసేయుటే సామ్రాజ్యలాభముకంటె నెక్కువ యని యాతడు తలంచినాడు". ('పెండ్యాల'.– పు. 275).

కర్ణుని ప్రభవము వలెనే ప్రవర్తనమును గూఢార్థ గుంభితము. అతని జన్మరహస్య మెఱుగనివా రతడు రాధ కొడుకనుకొన్నట్లే - అతని హృదయతత్త్వ మెఱుగనివారు - దుర్యోధనాభిమాని యనుకొన్నారు. ఆ కక్ష్యకు చేరినవారే ప్రకృత విమర్శకులును.

యథార్థ మెఱుగని వారికి నా యీ మాటలు వింతగాను - విపరీతముగాను - తోచును. సహజమే గదా! అట్టి వారికొరకే కర్ణుని కలరూపు తెలుప తలపెట్టినాను. అరకొరగా చెప్పినచో ఆకళింపు గాదు గావున విపులముగనే వినిపించెదను. గ్రంథ విస్తరమును పాఠకులు సహింపవలెను.

(1) కవ్వడితో కలహము; దుర్యోధనునితో దోస్తి

ద్రోణునియొద్ద విద్య నభ్యసించుచున్నప్పుడే, శరప్రయోగకౌశలమున కర్ణున కర్జునునితో స్పర్థ యేర్పడ్డది. పొట్టేళ్ళు, కోడిపుంజులు, విద్వాంసులు, వీరులు సహజ స్పర్థాళులు గదా?

"కిమపేక్ష్య ఫలం పయోధరాన్ ధ్వనతః ప్రార్థయతే మృగాధిపః
ప్రకృతిః ఖలు సా మహీయసః సహతే నాఽన్యసమున్నతిం యయా."
(భారవి.)

* వివ్వచ్చునితోడి మచ్చరము కారణముగా, కర్ణుడు,

* "సూతపుత్రశ్చ రాధేయో గురుం ద్రోణ మియాత్తదా
స్పర్ధమానస్తు పార్థేన సూతపుత్రోఽత్యమర్షణః
దుర్యోధనం సమాశ్రిత్య సోఽవమన్యత పాండవాన్"
(ఆది. ౧౩౨. ౧౨)

పాండవులకు పగవాడైన దుర్యోధనున కనుకూలు డైనాడు. "పగవాని పగవాడు బంధు" వనిగదా లోకోక్తి. అతడు దుర్యోధనునితో జేరి, అప్పుడప్పుడు పాండవుల నవమానించు చుండెడివాడు.

కురుపతికి అర్జునుడు గుండెలలోని గాలము. అర్జునునిదే ఆతనికి పెద్దభయము. కర్ణు డర్జునునితో స్పర్థగాని యుండు టయేగాక, అతనిని చెనయజాలిన సమర్థతయు గలిగియుం డుట - కుమారాస్త్ర విద్యాప్రదర్శన సందర్భమున విశద మైనది. అది గమనించి కురురాజు, వీనిని చేరదీసి కొంటిమేని మన కిక క్రీడివలని భయ ముండదని యోచించుకొని, కర్ణునకు స్వాగతము చెప్పి, "శూరవరా! నీ విచటికివచ్చుట మా అదృష్టము. నేను నీవాడను; నా రాజ్యము నీది. నీవు యథేచ్ఛగా ననుభవింపవచ్చు" నన్నాడు.

"కర్ణుడు, రాజరాజా! నీవు చెప్పిన దంతయు చేసినట్లే నేను భావించుచున్నాను. * నాకు కావలసినది ముఖ్యముగా నీతో మైత్రి; పార్థునితో ద్వంద్వయుద్ధము. ఇంతే" నని బదులు చెప్పినాడు.

ఆ మాట కతడు పొంగిపోయి, కర్ణుని కౌగిలించుకొని, "నీవు నాతో బద్ధసఖ్యుడవై, నాతో సమముగా సకలసుఖము

---

* "కృతం సర్వ మహం మన్యే సఖిత్వంచ త్వయా వృణే
ద్వంద్వయుద్ధంచ పార్థేన కర్తు మిచ్ఛా మ్యహం ప్రభో"
(ఆది. ౧౩౫. ౧౫)

లనుభవించుచు, నా శత్రువుల నణగద్రొక్కి నన్ను కురురాజ్య మేలింపవలె” నన్నాడు. కర్ణుడు 'సరే-కాని' యన్నాడు.

* కర్ణు డర్జునుని చంపు ననియు, తక్కిన పాండవులను తాము సులభముగా జయింపవచ్చు ననియు దుర్యోధనుని ఊహ. అతనిని కురురాజ్య మేలించుమాట యెట్లున్నను, తన కర్జునునితో కలహించుట కనువైన మార్గ మేర్పడినదిగదా - యని కర్ణుని సంతోషము.

అతని కదే ముఖ్యలక్ష్యము. అందువలన, కురుపతితో సఖ్యముకుదిరిన యుత్తరక్షణమే, తనతో ద్వంద్వయుద్ధమునకు రావలసిన దని కవ్వడిపై కాలుదువ్వినాడు. $ “ఆ యుద్ధములో, గురుసమక్షముననే, నీ శిరమును నా శరముచే తెగవేతు”నని ప్రతిజ్ఞయు చేసినాడు. కాని, అతని యుబలాటము సఫలము కాలేదు. అది కాకపోగా, అపుడు వచ్చిన కర్ణకులగోత్ర చర్చలో, అతడు రాజసుతుడుకాడని తెలియుటయు, రాజ వరుడైన పార్థునితో పోరుటకు రాజుగానివాడు తగడుపొమ్మని తిరస్కరించుటయు జరిగినది. ఆ యవమానముతో కర్ణుడు క్రుంగిపోయినాడు.

---

* “ప్రభువగు సుయోధనుఁడు కర్ణుని నర్జునునిజయించుటకే యేర్పఱచెను గాని, తక్కినవారిని జయించుటకుఁగాదు” ('పెండ్యాల' పు. 274)

$ “గురో స్సమక్షం యావ త్తే హరా మ్యద్య శిర శ్శరైః”

(ఆది. ౧౩౬ - ౨౦)

అప్పుడు దుర్యోధనుడు "ఏమీ! అర్జునుడు రాజుతో గాని పోరడా? అట్లైన నిదిగో నే నిపుడే కర్ణుని రాజును చేయు చున్నా"నని పలికి, భీష్మ ధృతరాష్ట్రుల యనుమతమున నతని కంగరాజ్య మిచ్చి, పట్టాభిషేకోత్సవము మహోత్సాహముతో జరిపించినాడు. దానితో కర్ణదుర్యోధనుల సఖ్యము గాఢమై మరింత రూఢమైనది.

అవమానము తొలగి కర్ణుడును, అర్జునునివలనిభయము తొలగి దుర్యోధనుడును సుఖముగా కాలము గడపుచున్నారు. కాని, అర్జునునిమీది అక్కసు కర్ణుని చిత్తమును కలవర పెట్టుచునే యున్నది.

## (2) ఘోషయాత్ర గొడవ

తరువాత కౌన్నాళ్ళకు ద్యూతపరాజయము కారణముగా, పాండవు లడవుల పాలగుటయు, వారు ద్వైతవనమున నున్నారని విని వారి నవమానించు దుస్సంకల్పముతో, దుర్యోధనుడు ఘోషయాత్రా వ్యాజమున సపరివారముగా- ఆ వనమునకు పోవుటయు నేర్పడినది. * ఆ యాత్రకు రేపెట్టిన వాడు కర్ణుడే. అప్పు డతడన్నమాట లివ్వి.—

---

* "ఘోషయాత్రా నెపమున దుర్యోధనుని ద్వైతవనమున నున్న పాండవులను హేళనచేయు మని ప్రోత్సాహపెట్టుట యను నీచకృత్యము కర్ణునిఁ గళంకితునిగాఁ జేయుచున్నది. ఇది పాండవులు తన సోదరులని తెలియనపుడు చేసినదిగాఁ దలంపవలసియుండును."

('పెండ్యాల'. పు. 283)

"పాండవప్రకృష్టులు పరమ దుఃఖార్తులగుచు ద్వైతవనమున నున్నా రని వింటిమి. సకల సామ్రాజ్య విభవంబు మెఱసి...యయాతియుంబోలె నుజ్జ్వలుండవై యున్న నిన్నుం జూచి, హృదయభేదనంబుగా వగ చెదరు. మిత్రజన మోదంబును, శత్రుజన ఖేదంబునుం గదా సంపదలకుం దగియెడు ఫలంబు." (అర. 5–347).

"నారలుఁగట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులో విప
ద్భారము నొంది వంతపడిన ఫల్గును నుజ్జ్వల రాజ్యవైభవో
దారులమై కనుంగొను ముదంబునఁ బొందఁగఁ గాంచుకంటె నిం
పారఁగ నొందు గల్గనె కృతార్థత యెందును గౌరవేశ్వరా!"
( ,, 5–349)

"అతుల సౌభాగ్య పుణ్య సమగ్రగరిమ
నొప్పుచున్న నీ దేవుల యొప్పు చూచి
ధృతి సడలఁగ తమ్ముఁ దాన నిందించుకొనుచు
హృదయమునఁ బాంచాలాంగన యెరియవలదె?" ( ,, 5–350)

ఇట్లు కర్ణుడు కురురాజును ప్రేరేపుటలో, నతని యుద్దేశ మేమి? అక్కడ పాండవులతో జగడము పెట్టుకొని, అర్జునుని పడగొట్టి రావలెనని యతని పన్నాగము. ఇది నా యూహా కాదు; సత్యము. ఈ సత్యమును దుర్యోధనుడును గుర్తించి నాడు. గుర్తించి, కర్ణుని ప్రేరణచే నుత్సుకు డయ్యెను,–

"అందుఁ బాండవు లుండుట యాంబికేయుఁ
డెఱుఁగు మన మవ్వనంబున కేఁగుటయును
గడఁగి పాండులతోడి విగ్రహముకొఱక
యని యవశ్యంబు వారించు నతఁడు మనల." ( ,, 5. 353)

అన్నాడు. ఘోషయాత్ర స్వప్రయోజన సాధనకు కర్ణుడు

కల్పించినదే నన్న విషయము మన మిక్కడ గమనింప వలసినది.

ఇక పిమ్మటి కథ.- శకునిచేత చెప్పించి, పెద్దరాజు నెల్లో యొప్పించి, కౌరవనాథుని, నంతఃపురసహితముగా గద లించుకొని, కర్ణుడు ద్వైతవనమునకు పోయినాడు. కాని, అత డనుకొనిపోయిన దొకటి; అక్కడ అయినది యింకొకటి.

కౌరవులు పాండవులను కలిసికొనకముందే, వీరి యవి వేకవర్తనము నిమిత్తముగా, ఆ వనమునయున్న చిత్రసేను డను గంధర్వపతితో వీరికి కలహము కలిగినది. ఆ యుద్ధములో, దుర్యోధనుడు చిత్రసేనునితో పోరాడుచుండగనే, కర్ణు డాత నిని వదలివేసి, రణభూమినుండి వెళ్లిపోయినాడు. దుర్యోధనుడు వెనుదీయక కొంతసేపు పెనగి, చివరకు చిత్రసేనుని చేతిలో చిక్కి పోయినాడు. అతడు రారాజును, ముందలబట్టి, యీడ్చి నేలకు గొట్టి, పెడరెక్కలుగట్టి, గుమ్మడిమూటచేసి దొర్లించినాడు. తన బంటులచేత, దుర్యోధనుని యంతఃపుర స్త్రీలను, తమ్ము లను, మంత్రులను - చేతికందినవారి నందరిని, కోలగగ్గర ద్రోయించినాడు. ఆతని బారి తప్పించుకొని పారిపోయిన కొందరు, ధర్మజుని శరణుచొచ్చి, దుర్యోధనుని దుస్థితిచెప్పి, మొరపెట్టుకొన్నారు. ఆయన కనికరించి, అప్పుడే యర్జునుని బంపి, దుర్యోధనుని బంధవిముక్తుని జేయించి రావించి "యిం కెన్నడును ఇట్టి తెలివిమాలినపని చేయకు" మని బుద్ధిచెప్పి పంపించినాడు.

ప్రబలుడైన ప్రత్యర్థితో ప్రభువు పెనగుచుండగా, అతనిని నడియుద్ధమున వదలివేసి, కర్ణుడు చల్లగా తప్పుకొన్నాడే! అది శూరధర్మమా? ప్రభుహితధర్మమా? దాని పుణ్యమా యని ఆ గంధర్వపతి కురుపతినిబంధించినాడేగాని చంపలేదు. చంపియున్నను అతని గతి యంతేగదా!

మరియు, కర్ణుడు కురునాథుని తరుణులనుగూడా తరలించుకొని పోయినాడుగదా! ఆ యబలల రక్షణమునకైనను తానందు నిలిచియుండవలదా? అట్లుండక మొగనూకిపోయి వారికిని తీరని భంగపాటు కలిగించెనే! అతడా నరపతికి నమ్మినబంటు?

"నీ దేవుల మొప్పు చూచి పాండవాంగన యెఱియవలదా"

అని రాజు నుబ్బించి, ఆతని దేవులను రావించి, పాండవాంగన యెదుట, ఎరియవలసిన దుర్గతి ఆతని దేవులకు పట్టించుట ద్రోహబుద్ధికాదా?

కర్ణుని యప్పటి చర్య నింక కొంచెము పరిశీలింతము.-

అతడు పొలికలను విడిచిపోవుటకు కారణమేమి? చిత్రసేనునకు జంకియా? జంకుట కాతడు దుర్యోధనునకంటెను తక్కువ వీరుడా? కాడుగదా! అతడు పోరుచుండగనే మరి యితడెందుకు పోయినట్లు?

ఎందుకనగా: అతనికి కావలసినది సవ్యసాచితోడి సమరము. అది సమకూరదాయెను. ఇక నతని కచట నేమి పని

యున్నది? దుర్యోధన రక్షణమా? అది యైచ్ఛికము. అందు వల్ల "నోటితో లేదనకుండా - చేతితో లేదన్నా" డన్నట్లు తానును యుద్ధమున తోడుపడ్డ ట్లనిపించి, అంతటితో సర్దుకొన్నాడు. సత్యమింతే. ఈ సంగతి కర్ణుడు దుర్యోధనునితో నాడిన మాటలలో స్పష్టము కాగలదు. వినండి.-

దుర్యోధనుడు పరాభవఖిన్నుడై యిల్లుచేరి, ఒకమూల మంచాని కడ్డముపడ్డాడు. కత్తివాటు వేసినను అతనిమొగాన నెత్తురుచుక్క లేదు. అట్టి స్థితిలో కర్ణుడు విసవిస వచ్చి,-

"నేను విరథుండనై వికర్ణుని రథం బెక్కిన నది సమరప్రదేశంబునకుం దొలంగం బఱచె" (అర. 6. 8)

అని తన పోక క్రొక కారణము చెప్పి, వెంటనే,-

"దేవా! నీవు విక్రమాతిశయంబులం బ్రతివీరుల నోర్చి యక్షతుండవై యుండుట గనుంగొని కృతార్థుండనైతి, నిట్టి పరాక్రమంబు సేసినవా రిజ్జగంబున నెవ్వరుగలరు? ఇది యత్యద్భుతంబు"

అని బట్టు కైవారము చేసినాడు. ఆ యమాయికుడు,-

"ఈతండు మత్ప్రకారం బెఱుంగక యిట్లు వలికెం గా కేమి!" యనుకొని, సిగ్గున తలవంచుకొని, చిత్రసేనుడు తన్ను కట్టి వేయుటయు, విజ్వచ్చుడు వచ్చి విడిపించుటయు, ధర్మజుడు తనకు బుద్ధిచెప్పి పంపించుటయు నతనికి చెప్పికొన్నాడు. అంతేగాని, "కర్ణా! నీ మూలమున గదా నా కిట్టి యిక్కట్టు మూడినది. నీ విట్లు చేయవచ్చునా?" అని మాటవరుసకైన ననలేదు. ఆపాటి కరకుదనమే యుండిన కర్ణు డట్లు చెవులు బట్టి యాడించునా? పోనిండు ఆతని కథ మన కేల?

కర్ణుడు, ముడుచుకొని మూలబడియున్న దుర్యోధనుని- "ఇట్టి పరాక్రమంబు చేసినవా రిజ్జగంబున లేరు; ఇది యత్యద్భుతం" బనుట సరసమా? వేళాకోళమా? నిజమైన పొగడికయా? పొగడుటకు ఓడినవాని తీ రెట్లుండునో, గెల్చిన వాని వహి యెట్లుండునో యెరుగని మూఢుడా కర్ణుడు? పరాజయమును ఆ రాజు మొగమే చెప్పక చెప్పుచుండగా, విజయ లక్ష్మీ విరాజితుని పొగడిస ట్లతనిని పొగడుట వంచన కాదా?

మరియు నతడు పొలికలను విడిచిపోవుటకు చెప్పిన కారణ మొప్పదగినదేనా? తాను విరథుడై వికర్ణుని రథ మెక్కినాడట! అది యుద్ధభూమినుండి తొలగించి తన్నుగొని పోయినదట! అంతేగాని, తనకై తాను పోలేదట! ఈమాటను దుర్యోధనుడు నమ్మిన నమ్మెగాక; వివేకులు నమ్ముదురా?

ఏదో కుంటిసాకు కల్పించుకొని, అదనున మొగము దప్పించి పరాభవము పాలు చేయుటయేగాక, పైపెచ్చు కప టపు కైవారములతో నుబ్బించి తన తప్పును కప్పిపుచ్చిన కర్ణుడు - కౌరవనాథునకు పరమాప్తుడా?

(3) దుర్యోధనుని నమ్మించుట

"నే నర్జునుని వధింతు" నని మాటిమాటికిని చెప్పుచూ కర్ణుడు దుర్యోధనునకు గట్టి నమ్మకము గల్గించినాడు. ఆ నమ్మ కపు కైపు గాఢముగా నెక్కినందున, కర్ణుని కుట్రను దుర్యో ధనుడు గ్రహింపలేకపోయినాడు. కర్ణు డాతనికి నమ్మకము గల్గించిన ఘట్టములు కొన్ని చూపుచున్నాను.

(i)

దుర్యోధనునకు, ఘోషయాత్రలో తన్ను చిత్రసేనుడు బంధించుటకంటెను, వివ్వాచ్చుడు విడిపించుట పెద్ద అవమానమైనది. ఆ భంగపాటు భరింపలేక ఆత్మహత్యకు సిద్ధపడ్డాడు. అపుడు శకుని వచ్చి–"కుమారా! ఇట్టి సాహసపుచావు నీ కేల! పాండవులను జయించు తలంపు మన కిక పనికిరాదు; అది నెరవేరని పని. వారిపు డవ్యాజాదరముతో నీకు మహోపకారము చేసినారు. కనుక, ఇంతటితో పగ వదలుకొని, వారితో చెలిమి చేసికొని వారి పాలు వారికి పంచియిచ్చి, వారితో కలిసి సుఖముగా జీవింపుము" అని హిత ముపదేశించినాడు. అతనికి అల్లుని క్షేమము ప్రధానము గనుక, తన పట్టుదలను వదలుకొని, అత డా విధముగా చెప్పినాడు.

ఇక కర్ణుడో; ఆతని ధోరణి వినండి.–

"రాజరాజా! పాండవులచేత విముక్తి నందినందుకా–నీ కీ వగపు? ఎంత బేలవయ్యా! నీవు వ్యవహారవిదుడవు కావనియు, అధీరుడ వనియు నా కిప్పుడు తెలిసినది. చూడు. పాండవులు నీ రాజ్యములోని ప్రజలు. ప్రజలు రాజునకు బంట్లు. తమ ప్రభువున కొక తీరమి పాటిల్లినపుడు తోడు పడుట బంట్లకు విధి. కావున వారి విధి వారు నెరవేర్చుకొన్నారు. అంతే. అందు వింత యేమున్నది? అదియునుగాక వారు ద్యూతమున నీకు దాసులైరి. నీ హజారమున పడిగాపులుండవలసిన వారుగదా! అది లేకపోయినను, ఈమాత్రపు

దాస్యమునైనను చేయవలదా? ఏవిధమున జూచినను వారు నీకీ పట్టున సాయపడుటలో విశేష మేమియును లేదు. నీ విట్లు విలక్షుడవు కావలసినదియును లేదు. కావున లేచి పురమునకు నడువు" మన్నాడు.

కాని దుర్యోధనున కూరట కలుగలేదు. అది గమనించి, కర్ణుడు వెంటనే,—

"మది నర్జును జూచి భయం
బొదవినయది నీకు వాని నుగ్రరణమునం
బదు నాలవయేడు జయిం
చెద నాయుధమంటి ప్రతిన సేసితి నధిపా!" (అర. 6–55)

అని యొక వీరోక్తి విసరినాడు. ఆ మాటతో దుర్యోధనుని మొగము చేటంతైనది. అర్జునుడు పడిపోయినట్లే భావించుకొని, అత్యుత్సాహియైనాడు.

విన్నారుగదా కర్ణుని వాదసరణి! ఆ వాదములోని వక్రత యట్లుండగా—"పాండవుల నీ పదమూడేండ్లును బాధలు పడనిమ్ము; పదనాల్గవయేడు, నేను భండనమున పార్థుని పరాజితుని జేసెదను. నీ విపుడు వారితో చెలిమిచేసికొనవల" దన్నాడే! అది మంచిమనసుతో నన్న మాటయేనా?

తనకు రారాజునెడ నభిమానమే యున్నచో, తన రాజును పరాభవించిన గంధర్వరాజునుగదా తాను జయింపవలసినది! అదిమాని, తన రాజున కుపకారముచేసిన అర్జునుని జయింతు ననుట వ్యవహారోచితముగా నున్నదా?

ఉచితమో, యనుచితమో; అతనికి కావలసిన దదీ. 'అర్జునుని గెల్చిన వీరు'డనిపించుకొనవలె నన్నదే యతని ధ్యేయము. కురురాజు పాండవులతో కూడునేని తన ఆ యభీష్టము సిద్ధింపదు. అందుకే "పాండవులతో పొందు వలదు; పోరే పెట్టుకొ"మ్మన్నాడు.

ఆ యుపదేశములోని కుట్రను పాపము! దుర్యోధనుడు గ్రహించలేకపోయినాడు.

(ii)

దుర్యోధనుడు కర్ణుని కైతవమును తనకై తాను గమనింపలేదు. సరిగదా చెప్పినను తెలిసికొనలేదు.

ఈ కథ వినుడు:- అతడు ద్వైతవనమునుండి వచ్చిన పిదప, అచటి యుదంతమంతయు చెవినిబడి, భీష్ముడు దుర్యోధనునిట్లు హెచ్చరించినాడు.—

"హితులై పెద్దలు బుద్ధిసెప్పఁగఁ గ్రియాహీనుండవై త్రోచిపో
యితి దుష్టాత్ములఁగూడి దానికి ఫలం బెట్లయ్యెనో చూచితే
గతవిద్వేషుఁడు ధర్మనందనుఁడు గల్గంబట్టి యిప్పాట దు
ర్గతికిం దప్పితిగాక చిక్కితిగదా గంధర్వుచే నాజిలోన్"
(అర. 6. 61)

"నీవును దమ్ములున్ సతులు నెయ్యుర వైరులచే గృహీతులై
పోవఁగఁ బాఱిపోయెఁ గడుఁబొల్లఁదనంబున సూతపుత్త్రుఁ డీ
కావరుఁ గష్టచిత్తు నధికంబుగ నమ్ముదు నీవు వీని బా
హావిభవంబు గయ్యమున నక్కడఁ జూచితె కన్నులారఁగన్" (6. 62)

"ఆయతబాహు లుగ్రబలు లార్యులు పార్థులు వారి భూరిశౌ
ర్యాయుధసైపుణక్రియలయందుఁ బదాఱవపాలుఁ బోలఁ డీ
వాయపు రజ్జులాఁ డధిప వారలచందము వీనిచందముల్
నీయెడ నిక్కమై తెలిసెనే ఖచరేంద్రుల పోరిలోపలన్" (6. 63)

"కులమును సిరియును జెఱుపక
యలఘుస్థితి నింకనైన నపాండవులం
గలసి మనవయ్య నాదగు
పలుకు వినఁగదయ్య హితముఁ బథ్యముఁ జూమ్మీ" (6. 64)

దుర్యోధనుడు పితామహుని హితోక్తులను పెడచెవుల బెట్టి కర్ణశకులను జూచి నవ్వుచూ, వారితో గలసి లేచిపోయి నాడు. భీష్ముడు లజ్జితుడై తన గృహమునకు తానుపోయినాడు.

పిమ్మట కురురాజు మంత్రులను గూడి మరల మంతన ముండి, భీష్ముని వచనముల నుగ్గడించి, ఇక మనకు కర్తవ్య మేమని యడిగినాడు. అపుడు కర్ణుడు, 'మహారాజా! దుర్బుద్ధియు, కురుకులాధముడును నైన ఆ భీష్ముని పలుకులను నీవు సరకుసేయవలదు. అతడు పాండవ పక్షపాతముచేత నిన్నును నన్నును నిరసించి నిందించు చుండును. * మహావీరులుగా ఆ

* "జితా చ పాండవాః దూర్భామి శ్చతుర్భి ర్బలశాలిభిః
తా మహం తే విజేష్యామి ఏక ఏవ న సంశయః
సంపశ్యతు సుదుర్బుద్ధి ర్భీష్మః కురుకులాధమః
స పశ్యతు బలం మే ద్య ఆత్మానంతు విగర్హతు
అనుజానీహి మాం రాజన్ ధ్రువో హి విజయ స్తవ."
(అర. ౧౫౨. అ.)

ముదుకడు కొండాడు పాండవులు నలుగురుగూడి నరపతుల నిర్జించినారు. అది యొక శౌర్యమా? నే నొకడనే యనివారణ దిగ్విజయ మొనర్చి అఖండమహీమండలము నీకు కైవసము చేసెదను. నిష్కంటకంబైన సర్వసర్వంసహాచక్రమును నీవాఖండల విభవముతో పాలింతువుగాక. భీష్ముడు నా బాహుబల సంపదచూచి, నేటి తన యవివేక ప్రసంగమునకు తన్ను తాను నిందించు కొనుగాక" అని బీరముతో బిట్టుగా పలికినాడు. రాజరాజా పలుకుల కుబ్బిపోయి—

"నీయట్టి వీరవరుఁడు స
హాయుండై పడయరాని యదియుం గలదే
ధీయుత నా కెయ్యదియును"

అని కర్ణు నగ్గించినాడు.—

కర్ణుడు దుర్యోధను నెంతగా నమ్మించుచున్నాడో, అత డెంతగా నమ్ముచున్నాడో గమనించుచున్నారా?

(iii)

కర్ణుని యండ చూచుకొని రాజరాజు రాజసూయము చేయ సంకల్పించినాడు. పెద్ద లది విని, "పాండవులను జయింపక నీవు రాజసూయము చేయ వీలుపడదు. వైష్ణవ మను యజ్ఞ మొకటియున్నది. ఇప్పటి కది చేయు"మన్నారు. అతడు చేసినాడు. యజ్ఞాంతమున కర్ణుడు పలికిన పలుకులు మనము ముఖ్యముగా వినవలసినవి.

"భాగ్యముగాదె కౌరవనృపాల భవన్ముఖ మిష్టసత్క్రియా
యోగ్యత నిర్వికల్పముగ నొందెసమాప్తి; నశేషధాత్రియుఁ
భోగ్యమ నీకు నింక రణభూమిఁ బృథాసుతులన్ జయించి,స
మ్యగ్యశశాలివై భువనమాన్య యొనర్పుము రాజసూయమున్"
(అర. 6-92)

అని పొగడిక మాటలతో తిన్నగా పురిగొల్పినాడు. కాని దుర్యోధను డంతగా నుత్సాహమును సూచింపక ముభావముగా ఊరకున్నాడు. కర్ణు డాతని ముఖలక్షణ ముపలక్షించి, భావము పసిపట్టి,—

* "అది యెప్పుడు నగునో యని
మదిలో వగవంగవలదు మఘవతనూజుం
గదనంబునఁ జంపకయే
పదనఖధావన మొనర్పఁ బార్థివముఖ్యా" (6-93)

అని ప్రతిజ్ఞ చేసినాడు. ఆ మాటతో అవనీపతికి కలిగిన యానందమున కంతములేదు.

"అనినఁ గర్ణుఁ గౌఁగిటఁ జేర్చి యన్నరేంద్ర
నందనుఁడు నీ సహాయత నాకుఁ గలుగఁ
బాండవుల నోర్చు టెంతటిపని మహాత్మ
యని సహోదర సహితుఁడై హర్ష మొందె." (6-94)

రాజసూయము చేయవలసినదని కర్ణుడు కౌరవేంద్రు నట్లుసికొల్పుట యేమిటికి? నిజ మనోరథ సిద్ధికొరకే. అతని

---

* "త మబ్రవీ త్తదా కర్ణః శృణు మే రాజకుంజర,
పాదౌ న ధావయే త్తావ ద్యావ న్న నిహతోఽర్జునః"
(అర. ౨౫౬ అ)

కా యుబలాటము పుట్టించిననేగాని అతడు పాండవులతో పోరు పెట్టుకొనడు. అతడు పోరుపెట్టుకొనిననేగాని తన కర్జును నెదుర్కొనుట ఘటిల్లదు. అది ఘటిల్లజేసికొనుటకే యతనికి రాజసూయపు సివమెక్కించుట. "అర్జునుని చంపక నేను పాదప్రక్షాళనమైనను చేయు" నన్న కీలకపదోచ్చారణముతో దుర్యోధనున కా సివము పూర్తిగా ఎక్కిపోయినది.

ఈ విధముగా కర్ణుడు దుర్యోధనుని నమ్మించి, తన చేతి కీలుబొమ్మను చేసిపెట్టుకొన్నాడు నమ్మించిన పెద్దపులియైనను నమ్మునుగదా! కర్ణు డట్లు నమ్మించుట స్వార్థము కొరకుగాని, కురుపతి శ్రేయస్సుకొరకు గాదు.

ఈ కర్ణునే విమర్శకులు దుర్యోధనునకు పరమసఖు డనుట! అ ట్లనుటలో అర్థము కలదా?

## (4) కవచకుండలదానము

కవచకుండలములు కర్ణునకు మేనితో బుట్టినవి. అవి అమృతమయములు; అతనికి రక్షకములును. అతడు "అర్జునుని వధించి నిన్ను గెల్పింతు"నని దుర్యోధనునకు ప్రమాణముచేసి చెప్పియున్నాడు. అట్టి స్థితిలో కర్ణు డాకవచమును - కుండలములను ఇంద్రునకిచ్చివేసినాడే! అ ట్లియ్య వచ్చునా? విజయుని నిగ్రహింప దలచినవాడు - అందుకు కావలసిన సాధనసామగ్రి నధికముగా సంతనచేసికొనవలెనా? ఉన్నవాటిని పరులకు పందేరముచేయువలెనా? ఆ వస్తువుల

ప్రభావ మెరుగక కాని, అవి పోవుటవలనవచ్చు అనర్థము తెలియక కాని యిచ్చినాడా? లేదు. తెలిసియే యిచ్చినాడు. అతని కెట్లు తెలిసిన దందురేమో.

సూర్యు డొకనాడు కర్ణునికడకు వచ్చి, "కర్ణా! కవచ కుండలముల మహిమచేత నీ వర్జునున కజయ్యుడ వనియు, విప్రు డేదియడిగినను కాదనక యిత్తువనియు నెరిగినవాడు గావున, పాకశాసనుడు పాండవపక్షపాతియై నీ కవచకుండలములను హరించుటకు విప్రవేషమున యాచకుడుగా రానున్నాడు. నీ వా వస్తువుల నాతని కియ్యవలదు; ఇత్తువేని ఆహవరంగ మున నర్జునునిచే హతుడ వగుదువు" అని తెలిపినాడు.

కర్ణుడు- "దేవా! నే నీ యుపదేశమును మన్నింప జాలను; 'విప్రుడు వేడిన ప్రాణమైన నిత్తు'నని నా ప్రతిజ్ఞ. చావునకైనను సమ్మతింతునుగాని దానకీర్తిని పోగొట్టుకొన జాలను. మరియు నేననృతమునకు వెరచినంతగా అంతకునకును వెరవను. అనృతమాడి దుర్గతికి పోనొల్లను. కావున నింద్రుడు విప్రుడుగావచ్చి యాచించునేని- నాకు కీర్తి యైన నగుగాక- కవచ కుండలముల నతనికి తప్పక యిత్తు"నన్నాడు.

కాబట్టి కర్ణు డాదానము తెలిసిచేసినదే గాని, తెలియక చేసినది కాదు. ఇక నందలి గుణదోషములను పరిశీలింతము.

## I. స్వార్థప్రియత్వము

కర్ణునిశీలమున కీ దానము పరీక్షాస్థానము. ఒకవంక మిత్రరక్షణము, మరియొకవంక నిజదానకీర్తిరక్షణము. రెండును

పరస్పరవిరుద్ధములుగా తారసిల్లినవి. రెంటిలో నేది యాచరణ యోగ్య మన్నది సమస్య.

కర్ణుడు "చావునకైనను సమ్మతింతునుగాని దానకీర్తిని విడువజాల"నన్నాడు. దానప్రియత ప్రశస్యమే గాని, ఆ దాన మెట్టిదిగా నుండవలె? గోవును చంపి చెప్పులు దానముచేయుట వంటిదిగా నుండగూడదు గదా! కర్ణుడు దానముచేయ బూనుకొన్న దెవరికి? తన్ను నమ్మియున్న దుర్యోధనున కప కారమును- అతని విరోధి కుపకారమును చేయుటకై కపట యాచకుడుగా రానున్న వానికి. యాచకుడు కపటియని తెలిసియు చేయుదానము కపటదాన మగునేగాని ఋజుదాన మగునా? పాత్రదాన మగునా? మిత్రవినాశ హేతువైన త్యాగము పుణ్యము నిచ్చునా? కీర్తి నిచ్చునా? 'త్యాగ కాడ'ను పేరు దక్కినను, దానివలన వచ్చు మిత్రద్రోహ రూపాపకీర్తి తనకు తప్పదుగదా? "పండ్లు రాలగొట్టుకొనుట కే రాయియైన నేమి?"యన్నట్లు, లోకముచేత ఇసీ యని పించుకొనుట కే యపకీర్తియైన నేమి?

మరియు, కర్ణుడు తన దానకీర్తి నంతగొప్పగా చెప్పి కొన్నాడే! అస లాకీర్తి యతని కెక్కడినుండివచ్చినది. దుర్యో ధనుడు చేపట్టి యుండనిచో ఈ సూతసుతుడు బండితోలుకొను చుండవలసిన వాడేగదా! ఆతనిసొమ్ము కొల్లబెట్టి తాను దాతయై, ఆ దానకీర్తి అచ్చము తనసొంత మనుకొనుటయు,

"చావనైన నను చత్తునుగాని నా దానకీర్తిని విడువజాల"నని పగ్గెలు పలుకుటయు-ఏమి వివేకము?

దుర్యోధనుడు కర్ణునకు జీవనదాతగదా! ఆ దాతకొరకు తన కీర్తినేకాదు; తన మూర్తినిగూడా వెచ్చించుట కర్ణునకు ధర్మముగాని, దాతకు ముప్పుతెచ్చునట్టి కృత్రిమదానమును చేసియే తీరవలెనని పట్టుపట్టుట ధర్మమగునా?

ధర్మము కాదుగాని, కర్ణుడు ధర్మాధర్మము లెరుగని వాడు కాడు. ఎరిగియు నట్లుచేసెననగా! అతడు కురుపతిని మిత్రునిగా లెక్కింపలేదు. ఇక నతనిని గూర్చిన చింత యితని కేల? కర్ణు డాతనిని మిత్రముగా భావించియే యున్నచో, "అర్జునుడు నీ కజయ్యుడగు"నని సూర్యు డన్నప్పు డాతని మాట స్మరింపకుండునా? దుర్యోధను డాతని జ్ఞప్తిలో నేలేడు. * సూర్యు డటుపోయినది మొదలుకొని కర్ణుడు, ఇంద్రు డెప్పుడు వచ్చునా-యని యెదురుతెన్నులు చూడసాగినాడు.

ఇట్లుండగా నొకనా డింద్రుడు వచ్చుటయు, కర్ణుడు కవచకుండలము లిచ్చుటయు జరిగిపోయినది. కనుక, అతడు తన దానకీర్తిని ప్రధానముగా జూచుకొన్నవాడే గాని, దుర్యోధన మైత్రిని ప్రధానముగా పెట్టుకొన్నవాడు కాడు.

కర్ణుడు స్వార్థప్రియుడుగాని, దుర్యోధనప్రియుడు కాడు. దుర్యోధన ప్రియత్వ మభినయము. దాని ప్రయోజనము వేరు.

---

* "అని చెప్పి కమలహితుం డంతర్హితుం డయ్యెఁ గర్ణుండును వాసవు రాక కెదురుచూచుచుండె" (అర. 7-308)

## II. దానములో బేరము; పితలాటకము

కర్ణుడా దానమునైనను ధారాళముగా చేయలేదు. అందు కొంత పితలాటకమును చేసినాడు.

ఇంద్రుడు విప్రరూపమున వచ్చి కవచ కుండలములను యాచించినాడు.

కర్ణుడు, "బ్రాహ్మణుడా! కవచకుండలములు లేనిచో నేను సమరమున శత్రువులచేత భంగపడుదును. కావున వాటి నియ్యజాలను; నీకు వలయునేని కనక మిత్తును; కపుల నిత్తును; కాంతల నిత్తును; నా రాజ్యమునైన నిత్తును. కోరుకొ"మ్మని బేరముపెట్టినాడు. ఇదేనా దానపద్ధతి?

ఈ పద్ధతి సామాన్యదాతలకు చెల్లునుగాని "విప్రుడు వేడిన ప్రాణములనైన నిత్తు" నని బాసచేసిన కర్ణునకు చెల్లునా? అర్థి కోరిన వస్తువు నియ్యక, కోరని వస్తువుల పేరు లేకరువుపెట్టిన నర్థి తృప్తిపడునా? ఆ విప్రు డేమన్నాడో విన్నారా? * "కర్ణా! నీవు సత్యవ్రతుడవే యైనచో నీ కవచ కుండలములను కోసియిమ్ము. ఈజాలవేని నేను తిరిగిపోయెద" నన్నాడు. అట్లనిపించుకొనుటచేత కర్ణుని దానకీర్తి దగ్ధము కాలేదా? అతడు సూర్యునితో "నేను దానకీర్తిని పోగొట్టు కొనజాల" నన్నమాట కల్లయని తెల్లముగాలేదా?

---

* "ఏత దుత్కృత్య మే దేహి యది సత్యవ్రతో భవాన్"

(అర. ౩౧౯. ౪.)

ఇంకొక విషయము: కవచకుండలములను కోరుటను బట్టియే, వచ్చినవిప్రుడు వాసవు డని తెలియుచుండగా, తెలియనట్లు కర్ణు డీ యాట ఆడుట బూటకముకాదా? ఎందు కెక్కువ చర్చ; అతడు పోకిళ్లమారిగాని నిజాయితీగలవాడు కాడు. వచ్చినవా డింద్రుడుగాక, విప్రుడే అయ్యున్నచో కవచకుండలముల నిచ్చియుండెడివాడును గాడు. అత డింద్రుడగుట వెల్లడియైనపిమ్మటనే యిచ్చినాడు.

కాని, అతనికిని పేచీపెట్టక యియ్యలేదు. * "ఇంద్రా! నీకు నేను కవచకుండలములను కోసియిత్తునుగాని నీవు నాకు బాధలేకుండునట్లును, నా దేహము వికృతినందకుండునట్లును చేయవలె సుమా!" యని అక్కడను ఒక షరతుపెట్టినాడు. సామాన్య యాచకుడై యున్నచో, అంతటితోనే దానకథ కంచికిపోయి యుండెడిదే. $ ఇంద్రుడు వైద్యముగూడా నేర్చు

---

* "ఉత్కృత్య తు ప్రదాస్యామి కుండలే కవచం చ మే
నికృత్తేషుతు గాత్రేషు న మే బీభత్సతా భవేత్."
"న తే బీభత్సతా కర్ణ భవిష్యతి కథంచన
వ్రణశ్చైవ న గాత్రేషు యస్త్వం నానృత మిచ్ఛసి.
యాదృశ స్తే పితు ర్వర్ణ స్తేజ శ్చ వదతాంవర
తాదృశేనైవ వర్ణేన త్వం కర్ణ భవితా పునః"
(అర. ౩౦౯. అ.)

$ "ఆయుర్వేదామృతం సర్వం బ్రహ్మ బుద్ధ్వా ప్రజాపతిః
దదౌ దక్షాయ సోఽశ్విభ్యాం తౌ శతక్రతవే తతః"
(అష్టాంగ. సూత్ర. అ. ౧ వ్యా.)

కొనియున్న వాడగుటచేత, అందుకును సమ్మతించి "కర్ణా! నీకు వ్రణబాధయు నీదేహమునకు వికృతియు లేకుండునట్లే కాదు; నీ దేహము నీ తండ్రియైన యరుణకిరణునివర్ణ మెట్టిదో అట్టి వర్ణముతో వెలుగొందునట్లును చేయుదును. నామాట నమ్ము"మని పూచీ యిచ్చినాడు. అతని యక్కరగదా! కర్ణునకు కవచకుండలము లియ్యక తప్పినదిగాదు. ఇంద్రుడు తాను చెప్పిన ప్రకారముచేసి, తనపని చక్కబెట్టుకొని పోయినాడు.

వాసవుడు 'వ్రణచికిత్స సొప్పల్ల కా'దని యనియున్నచో, కర్ణుడు, "అట్లైన కవచాలులేవు; కుండలాలులేవు. వచ్చిన దారినే పొ"మ్మని అతనిని పంపియుండెడివాడే. ఆతని వితరణ లక్షణము విశదమైనదిగదా!

## III. దానములో సాహసము

వ్రణబాధ సహించి, ప్రాణాలకు తెగించి కర్ణుడా కవచకుండలములను కోసియిచ్చినాడనియు, అది మహాసాహస దానమనియు కొందరు పొగడుదురు. అది యవిచారితమైన పొగడ్త.

అతడు తనకు బాధ కలుగకుండ జేయునట్లు ఇంద్రుని చేత ముందుగా నొప్పెరుగందము చేయించుకొనియే - నిజ శరీర రక్షణము ప్రధానముగా చూచుకొనియే - ఆ వస్తువులను కోసియిచ్చినాడు. కావున అందు తెగింపుగాని, సాహసముగాని పొగడదగినంతగా లేవు. ఆ దానము నేడు జరుగుచున్న

* రక్తదానముకంటెను హెచ్చైనదికాదు. కొన్ని విధముల లొచ్చనియే చెప్పవచ్చును.

## IV. కుండమార్పు

కర్ణుడు కవచకుండలముల నిచ్చినది యింద్రునకుగాని, యాచకుడైన విప్రునకుకాదు గావునను, ఇంద్రుడు యాచకుడు కాడు గావునను. అది దానముకాదు.

మరియు నతనికైనను ప్రతిఫలరహితముగా నియ్య లేదు- ♦ "ఇంద్రా! నా కవచమును-కుండలములను నీ కిత్తునేని, నేను పరులవలని పరాభవమునకు పాలగుదును. వధ్యుడనునైత మగుదును. కాబట్టి వాటికి తగిన ప్రతివస్తువును నీవు నా కిత్తు వేని, నే నా వస్తువులను నీ కిత్తును. అంతేగాని, ఊరక యియ్యను" అని తిపిరిపెట్టి, ముందు తా నతనివలన 'శక్తి' యను నాయుధమును పుచ్చుకొని, తరువాత తన వస్తువుల

---

* రక్తము క్షీణించి మృత్యువు వాతబడనున్న దీనమానవుల నుజ్జీవింప జేయుటకు శ్రీ శ్రీపురము వేంకట నరసింహారావు బి.ఏ., డి.పి.ఈ., బి.ఎల్, గారు ఇప్పటికి ముప్పదిమూడు మారులు రక్తదానము చేసియున్నారు. ప్రతిఫలము లేదు; ప్రతిష్ఠకొరకు కాదు.

♦ "యది దాస్యామి తే దేవ! కుండలే కవచం తథా
వధ్యతా ముపయాస్యామి కించ శక్రావహాస్యతామ్
తస్మా ద్వినిమయం కృత్వా కుండలే వర్మ చోత్తమం
హరస్వ శక్ర కామం మే న దద్యా మహ మన్యథా".

(అర. 310. అ.)

నిచ్చినాడు. అది కుండమార్పు (వినిమయము) గాని, దానము కానేకాదు.

కర్ణుని ఆ యీవిని పూర్వకవులు 'కుండమా'ర్పనియే పేర్కొన్నారు.

"చండాంశుసుతుపోల్కిఁ గుండమార్పుఖు గాక,...
ఒసఁగ నేర్తువు యాచకవ్యూహమునకు" (కావ్యా. సం. 5-19)

## V. అనృతభయము

కర్ణుడు "నే సనృతమునకు వెఱతును; అనృతమాశి దుర్గతికి పోనొల్లను" అని సూర్యునితో నన్నాడుగాని, అది యును అటమటపు మాటయే.

"నే నర్జునుని వధించి నిన్ను గెల్పింతు" నని కౌరవ పతికి గట్టిగా నమ్మకము చెప్పి, ఆ చెప్పిన మాటను తుంగలో ద్రొక్కి కపటమార్గమున కౌంతేయులకు సాయముచేయుటలో అనృతదోషము లేదా? ఆ దోషము సద్గతి నిచ్చునా?

చర్చావిస్తరమేల: కర్ణుడు కార్యకాడుగాని, కల్లలాడ వెరచువాడుకాడు. అతడవకాశవాది గాని సత్యవాది కాడు.

అతని యీ కవచకుండలదానమున స్వార్థమున్నది; విశ్వాసద్రోహ మున్నది. అనృత మున్నది. అపాత్రత యున్నది; ప్రతిజ్ఞాభంగ మున్నది; ప్రతిఫలగ్రహణ మున్నది. కపట మున్నది. కావున గణనీయము కాదు.

'మహాదాత' యను కీర్తి కర్ణున కే దానముల వలన వచ్చినదోగాని, యీ కవచకుండల దానమువలన వచ్చిన దనుట కాస్కారము లేదు. ఇది దానమే కాదుగదా!

కర్ణుడు దుర్యోధనున కాప్తుడు కా డనుటకును, నిజాయితీ కలవాడు కా డనుటకును ఈ కథ యొకటిచాలదా?

## (5) మున్నాలిక బెల్లము; అంగిట విషము

ఇక్కడ చెప్పవలసిన విశేష మొకటి యున్నది.- ఇంద్రుడు కవచకుండలముల నిమ్మన్నప్పుడు కర్ణుడు,-"దేవా! యట్లయిన నఖిల శత్రుఘాతినియైన నీ యమోఘ 'శక్తి' ని నాకుం గృపసేసి కవచకుండలములు గొను" మన్నాడు. ఇంద్రుడు శక్తి నిచ్చుచూ,- "కర్ణా! ఇది నీ శత్రువులలో నొక్కనిమాత్రమే చంపి, మరల నన్ను జేరిపోవు" నన్నాడు. అనగానే కర్ణుడు- "నాకుఁగల పగతుం డొక్కరుండ; వానిని వధించుట మదీయ మనోరథం" బన్నాడు. ఆ మాటకు పురందరుడు నవ్వి,-

"నీ యభిలాష మేను మది నిక్కమెఱుంగుదు నుగ్రశౌర్యుఁ డే
జోయుతుఁ బార్థు నొత్తునని చూచెదు నీ కది యేల తీరు రా
ధేయ! దయావిధేయుఁడు విధేయజగత్త్రియుఁ డవ్యయుండు నా
రాయణుఁ డమ్మహాత్మునకు రక్షకుఁ; డేరికి వాఁడు సాధ్యుఁ డే?"
(అర. 7. 372)

అని స్పష్టముగా జెప్పినాడు.

కర్ణుడు నమ్ముకొనియున్న కవచకుండలములు పోయి నవి. అతడు కోరి తీసికొన్న 'శక్తి' యర్జునుసిపై పనిచేయు దని స్పష్టపడినది. అప్పుడైన నతనికి దుర్యోధనుని మాట తలపునకు వచ్చినదా? హృదయమున నున్నగదా తలపునకు వచ్చుట?

"నిన్ను గెల్పింతు" నని దుర్యోధనునకు చెప్పినాడే గాని, అది వట్టి పైపైమాట. ఆతని విషయమున కర్ణునకు మున్నాలిక బెల్లము; అంగిట విషము.

## (6) కర్ణుని ఆంతర్యము

కర్ణునితత్త్వము తెలిసికొనుటకు మన మిన్ని చిల్లకరథలు తడవి ఊహాలుచేయ నక్కరలేదు. శ్రీకృష్ణుడు రాయ బారమునకు వచ్చినప్పుడు కర్ణుడే, తన యాంతర్యమును కృష్ణునకు రహస్యముగా చెప్పియున్నాడు. ఎట్లనగా—

కృష్ణుడు కర్ణు నేకాంతమునకు తీసికొనిపోయి, అతని పుట్టుపూర్వములు తెలిపి, "నీవు కుంతికొడుకులలో పెద్ద వాడవు. ధర్మజాదులు నీ తమ్ములు. వచ్చి వారిలో చేరి పొమ్ము. వారందరును నీ యడుగులకు మడుగు లొత్తెదరు. నేను నిన్ను సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తునిజేయుదును; కదలి ర"మ్మన్నాడు. ఇంకను ఎన్నో యాశలుచెప్పినాడు. అప్పుడు కర్ణుడు,- "కృష్ణా! నీవుచెప్పినది హితమే గాని, నే నివు డట్లు చేయుటకు వీలులేదు. అర్జునుని జయింతునని కురుపతికి మాట

యిచ్చి యున్నాను. అతడు నమ్మియున్నాడు. ఇపు డతసని వదలివత్తునేని లోకము నన్ను నిందించును. అంత గొడవ యేమిటికి! పాండవవిజయ మేగదా నీ యభీష్టము! నే నీ పక్షమున నున్నను గెల్పు ధర్మజునిదే.

"అనుజులు బుత్విజులుగ, నీ
పని యిటు సేయుమని నీ వుపద్రష్టవుగా
విను కురుకుమారపశువిశ
సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁజేయుఁ—" (ఉద్యో. 4. 45)

"దానం బుణ్యభూమియగు కురుక్షేత్రంబున మము బోం
ట్లెల్లను సద్గతి వడయుదురుగాక." ( ,,— 4. 46)

అన్నాడు. కర్ణుని యాంతర్యము తెలిసినదిగదా?

తనతోసహా కౌరవు లందరును కదనమున గతింతు రనియు, ధర్మజుడే జేత యగుననియు చెప్పుచూ, కర్ణు డా పక్షముననుండుట, దుర్యోధనునకు మేలుచేయుట కేనా?

ఇంకను వినుడు.— కర్ణుడు కృష్ణునితో ని ట్లొక మాటయు చెప్పినాడు.—

"కృష్ణా! మరియొక రహస్యమును గలదు, * నేను తన

---

* "యది జానాతి మాం రాజా ధర్మాత్మా సంయతేంద్రియః
కుంత్యాః ప్రథమజం పుత్రం న స రాజ్యం గ్రహీష్యతి
ప్రాప్యం చాపి మహద్రాజ్యం త దహం మధుసూదన!
స్ఫీతం దుర్యోధనాయైవ సంప్రదద్యా మరిందమ! "
"స ఏవ రాజా ధర్మాత్మా శాశ్వతోఽస్తు యుధిష్ఠిరః"
(ఉద్యో. ౧౪౦. అ.)

కగ్రజుడనని తెలిసినయెడల ధర్మజుడు, రాజ్యమును నా కర్పించునుగాని తాను రాజుగానుండ నిచ్ఛగింపడు. ఆ విధముగా నాకు ప్రాప్తించినను, ఆ మహారాజ్యమును నేను దుర్యోధనునకే అర్పింపవలసి వచ్చును. రా జగుటకు ధర్మాత్ముడైన యుధిష్ఠిరుడే అర్హుడు. అతడే వసుధ యెల్ల శాశ్వతముగా పాలించుగాక. నీవు నా యీ జన్మవృత్తాంతమును గుప్తముగానుంచుము" అని చెప్పినాడు. కర్ణుని యాంతర్య మాకళింపైనదా? ఇంకను విశదమగుటకు వివరముగా చెప్పుచున్నాను.

అతడు,— కురురాజ్యమేలుటకు దుర్యోధను డర్హుడు కాడన్న భావము గలవాడు. * ధర్మజుడే యేకచ్ఛత్రాధిపతి కావలెనన్న కోరికగలవాడు. అందుకై తన జన్మకథను గుప్తపరిచి, చావనిశ్చయించుకొన్న వాడు; పరమమిత్రునివలె వర్తించుచు, దుర్యోధనుని దురంతమునకు దింపి, యతని కులవృక్షమును కూలద్రోయ పొంచు వేసికొని యున్నవాడు. ఈ కీలక మెరుగనివారు - కర్ణుడు దుర్యోధనునకు నెచ్చెలియనియు నమ్మినబంటనియు తలంచినారు.

కౌరవపతికి తోడ్పడవలెనన్న తలపు కర్ణున కెన్నడును లేదు. తన పుట్టుక చందము తెలియకముందు, శౌర్యమత్సర

* "కష్టముల నొందినట్టియు, సమర్థుడును నగు ధర్మజుండే సమ్రాట్టగుట కర్ణుని కిష్టము." ('పెండ్యాల'-పు. 275)

మున నర్జునుని సర్జింపవలె ననుకొన్నాడు. [1]పాండవులు తన వారని తెలియుటతో తత్వ్వము తిరిగిపోయినది. వారియెడ ననురాగమును-కనికరమును కలిగినవి. సహజమేగదా! నీళ్ళు నీళ్ళవంక బారక మిట్టలెక్కి పారునా?

అందువల్లనే, అర్జునుడుతప్ప తక్కిన పాండవులు తన చేతికి చిక్కినను చంపనని తల్లికి వరమిచ్చినాడు. అర్జును డెట్లును తనచే జచ్చువాడుకాడు. [2]ఆ విధముగా వారైదుగురును సురక్షితులై యుండుటయే, అతని యభీష్టము.

సవ్యసాచిని గెల్చుట తన కసాధ్యమని తెలిసియు, నతని నెదిరించి మరణించుటకే నిశ్చయించుకొని, కర్ణుడు కౌరవ పక్షముననే యుండుటలో భావ మదే.

అర్జును నెదిరించిననేగాని తనకు మరణమురాదు. తాను మరణించిననేగాని దుర్యోధనుడు పొలియడు. అతడు పొలిసిననేగాని ధర్మసుతుడు ధరణీపతి కాడు. అతడు చక్రవర్తియగుటయేగదా కర్ణుని కాంక్షితము.

---

[1] "కర్ణుడు లోకమునకును బాపమునకును వెఱచి పాండవులఁగూడుట నంగీకరింపలేదు. కాని, పాండవులపైఁ బ్రేమాంకురము మాత్రము కలిగెను." ('పెంద్యాల'-పు. 179)

[2] "తాను ముఖ్యముగా నమ్మిన బంటుగు కర్ణుఁడే...దొరకిన యుధిష్ఠిరాదులఁ ద్రుంపక సుయోధనుని మిషచే వంచన చేసెను." (,,-పు. 266)

"సవ్యసాచిచేతఁ జచ్చుటయును గీర్తికరమే" (ఉద్యో. 4. 69)
అని, కర్ణుడు తల్లితో ననుటలోను భావమిదే.

'తమ్ముల రాజ్యలబ్ధికొరకు తనువును తృణీకరించిన త్యాగమూర్తి' యనిపించుకొనవలె నని కర్ణునికోరిక. అతడు కాంక్షించినకీర్తి యిదే. (మన పొట్టి శ్రీరాములవలె.)—

ఇది మనసున బెట్టుకొనియే, అతడు, తన్ను పాండవ పక్షమునకురమ్మని కృష్ణుడు పిల్చినపుడు,—

"ఏను నర్జునుండు నెక్కటి యెక్కటి దల
పడఁగ యున్న నగరె పుడమిజనము;
లందు నాదువచ్చు టతనికి నపకీర్తి
యనిన నాకు వేఱ యడుగనేల?" (ఉద్యో. 4. 41)

అని యుక్తిగా సమాధానము చెప్పి తప్పించుకొన్నాడు.

## (7) కౌరవపతి బుద్ధిమాంద్యము

దుర్యోధనుడు కర్ణునిమాట నమ్ముకొని, గురు పితృ పితామహులమాట తిరస్కరించి, సంధి చెడగొట్టినాడు. యుద్ధము రానేవచ్చినది. కర్ణు డర్జునుని కూల్చుననియు, విజయలక్ష్మి వచ్చి త న్నాలింగనముచేసికొనుననియు నతడు మురిసిపోవుచున్నాడు. వెఱ్ఱివాడు. కాకపోతే, కర్ణుడుచెప్పిన జెప్పెగాక. అత డర్జునుని గెల్చునని తా నెట్లనుకొన్నాడు? చెప్పెడువారు చెప్పినను - వినువారికి వివేక ముండవలదా?

కర్ణుడు మత్స్యయంత్ర మప్పుడు క్రీడి నెదిరించెనే గెల్చినాడా? ఉత్తరగోగ్రహణమున, అశ్వత్థామాదులు,- "అర్జునుని

మనము గెలువజాలము; సంధిచేసికొనుట మేలు" అని చెప్పి నప్పుడు, వారినందరిని పిరికివారిక్రింద జమకట్టి,—

"వెఱచితిరేని నిల్వఁ డొకవీరుని కొక్కఁడ చాలఁగాక యుం
దఱు వలయుం? గపిధ్వజము దవ్వులవేల్మిడిఁ ద్రుంచి పుచ్చెదన్"
(విరా. 4-201)

"మీ, కెల్లఁ బోరుసూడ నిష్టమేని
చూడుఁ డట్లుగాక వేడుక లేదేని
సంతసమునఁ బసులజాడఁ బొండు." ( ,,- 4-205)

అని ప్రగల్భములాడి పోయెనే, అక్కడ ఏమైనది? అర్జునున కోడి పారిపోయినాడు.

పై రెండుఘట్టములును కురురాజెరిగినవి కావా! ఎరిగియు కర్ణునిమాట యెట్లునమ్మినాడు? అది యట్లుంచి, ఈ కథ వినుడు.—

దుర్యోధనుడు సమరసన్నాహమునకు ముందొకనాడు, భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ కర్ణులను,- "మీరొక్కొక్కరు పాండవులబలముల నెంతెంతకాలములో రూపుమాపగలరు!" అని ప్రశ్నించినాడు.

భీష్ముడు, "నాకు నెలదినములు పట్టు"నన్నాడు.

ద్రోణుడు, "నేను పెద్దవాడనైనాను. అయినను, నాశక్తి యంతయు వినియోగించిన, నేనును అంతకాలములోనే ముగింపగలనేమో" అన్నాడు.

కృపుడు, "నేను రెండు నెలలలోగాని ఆ పని పూర్తి చేయ జాల"నన్నాడు.

అశ్వత్థామ, "నాకు పదిదినములు చాలు"నన్నాడు.

కర్ణుడు, "పాండవసేనాసముద్రమును నా శస్త్రాస్త్రబడబానలమున నైదుదినములలోనే యింకింతు"నన్నాడు.

కర్ణునిపలుకులు కౌరవపతి కర్ణములకు కమ్మని రసాయనములైనవి. ఆ యానందమున నతనికి మూపులు మూడైనవి. భీష్మద్రోణ కృపాశ్వత్థామలకంటెను కర్ణుడే గట్టిజోదనుకొన్నాడు. వారితోడ్పాటు లేకపోయినను, తనకు కర్ణుడొక్కడున్న జాలు ననుకొన్నాడు. అంతేగాని, భీష్ముడు నెల దినములలోగాని చేయలేనన్న పనిని ఇత డైదుదినముల లోనే యెట్లుచేయగల డని గాని, గోగ్రహణమున నర్జును నొక్కనినే యోర్వలేకపోయినవాడు, ఏడక్షౌహిణుల సేనలతో గూడియున్నవాని నెట్లోర్వగల డని గాని అత డనుమానింపనైనను లేదు. మందబుద్ధి.

దుర్యోధనుని బుద్ధిమాంద్యము నవకాశముగా తీసికొనియే కర్ణు డన్ని యాట లాడుట.

## (8) పరిస్థితులలో మార్పు

దురమున దుర్యోధను నెగ్గించుకొరకు కిరీటిని గీటడచు తలపు కర్ణున కేనాడును లేదు. ఈ నా డట్టి తలపు కల్గినను

అత డందుకు సమర్థుడు కాడు. పరిస్థితులు పూర్తిగా మారి పోయినవి.

ఈ నాటి యర్జునుడు, అల్ల ఆనాటి యర్జునుడు కాడు. ఈలోగా నతడు పాశుపతము, దండము, వారుణపాశములు, కౌబేరాస్త్రము - ఇంకను పెక్కు దివ్యాస్త్రములు సంపాదించుకొన్నాడు. అక్షయతూణీరములు, అభేద్యరథము, అనర్ఘ్యరథ్యములు, కూడబెట్టుకొన్నాడు. ద్రోణభీష్ముల యనుగ్రహమును పొందియుండుటయే గాక, ఇపు డా ధనుష్మదగ్రణులకును దుర్ధర్షమైన శక్తిసంపత్తితో విరాజిల్లుచున్నాడు. అందువలననే గదా భీష్ముడు,—

"కిరీటి కొక్కనికి,నే నోర్వ నతండు శరసమ లెక్కుడౌయుంగుః"

(ఉద్యో. 4. 149)

అన్నది. ఈ యపరిమేయ పరికరస్తోమమున కు తోడు, అర్జును డలవరించుకొన్న గొప్ప అండ యింకొకటి యున్నది. ఘటనాఘటన సమర్థుడైన శ్రీకృష్ణుని సారథ్యమే-ఆ యండ. పేరుకు సారథియేగాని కృష్ణు డర్జునున కేడుగడ. అర్జునరక్షణభారము నా మహాత్ము డెంతగా వహించియున్నాడో యెరుగుదురా!

" కడుఁగూర్తుఁ గవ్వడికి న
య్యొడలు గలుగ నేను బ్రదికియుండుదుఁగా కె
క్కడి బ్రతుకు నాకు! నాతం
డెడలిన నపార్థుఁ గాతు నెల్లవిధములన్" (ద్రోణ. 2. 349)

"నాలో సగ మర్జునుఁ డే
నాలమునం దతని కగుట యరుదే! యెమ్మె్మ
వ్రాలెదనో, రిపు లెట్టులు
గూలెదరో చూడు, నాకుఁ గుఱుబలమెఱురే!" (,,-2. 350)

అని కృష్ణుడే కంఠోక్తిగా చెప్పినాడు. అర్జునుడు సంపాదించుకొన్న అండ అట్టిది.

ఈ విధముగా, అర్జునుని శక్తిసామర్థ్యములు వెనుకటి కంటెను వేయంత లధికమైనవి.

ఇక కర్ణుని కథయో:— * అతడు బ్రహ్మాస్త్రభార్గవాస్త్రములు సంపాదించుకొనియు, అనృత దోషమున గురుని ఘోరశాపమునకు గురియై, ఆ రెండస్త్రములను వ్యర్థముచేసికొన్నాడు. ప్రాణరక్షణ ప్రధానసాధనములైన కవచకుండలములను కోలుపోయి కొరలూడిన పామైనాడు. కౌరవపక్షమునకు జీవగఱ్ఱలును, నిష్పక్షపాత చిత్తులును, అధికారులును నైన భీష్మద్రోణులను వెంగలి తనమున వెగటుమాటలాడి వారి గర్హకు భాజనమైనాడు,- ఇక నతనికి దొరకిన సారథియో, "ఏదారి అంటే కోదారి" అనే శల్యుడు. అతడు పాండవులకు మేనమామ. ద్యూతసభలో కర్ణుడు పాండవుల నన్న మాట-

---

* "కపటంబున బ్రహ్మాస్త్రంబుఁ బరిగ్రహించి తది నీకు వలయు కాలంబునఁ దోఁపమియు, మృత్యుకాలంబైనఁ దోఁచుటయు, నాపద ముట్టినయెడ భార్గవాస్త్రంబు దోఁపకుండుటయుఁ గలిగెడుము"—అని జామదగ్న్యు శాపము. (కర్ణ. 2-89)

లకు మనసు నొచ్చియున్నవాడు. సమయము చిక్కినప్పుడు కర్ణున కపకరించి, పాండవుల కుపకరింప నిశ్చయించుకొని యున్నవాడు. కర్ణున కెట్టి యండయు దొరకపోగా, ఈ శల్య సారథ్యము పెద్ద వండ యైనది. ఇన్ని కారణములచేత కర్ణుని బలపరాక్రమములు "నానాటికి తీసికట్టు నాగంభట్లు" అన్న ట్లైనవి.

ఇట్లు, • అన్ని అందాలా లుకచెడియున్న కర్ణుడు, అట్లు బహుబలసాధనసముపార్జనముగల నూర్జితుడై యున్న అర్జును నెట్లు నిర్జింపగలడు? అది యాతని జన్మలో సాధ్యము గాని పని.

" ... ఎవ్వీరు మార్కొని గెలువఁగోరి
ద్రిమను సేసెద వతనిచేఁ జావు మీవు" (కర్ణ. 2. 90)

అని బ్రాహ్మణశాపము. "అర్జునుని చేతిలో చావు" మనిగదా దాని యర్థము. చావవలసినవాడు చంపుట సంభవించునా?

బ్రాహ్మణశాపమే కాదు. యముడు, అర్జునునకు 'దండ'మను నాయుధమిచ్చుచూ - "నీవు దీనిచేత సురారాతుల సహాయుండైన కర్ణుని వధింతువు" (అర. 1. 338) అని చెప్పి యున్నాడు. కాబట్టి కర్ణు డర్జునుని వధించుట వట్టిది.

---

• " శక్రాపనీత కవచో ఒ ద్ధరథః ప్రమాదీ
వ్యాజోపలబ్ధ విఫలాస్త్రబలో ఘృణావాన్
కర్ణోఒర్జునస్య కిల యాస్యతి తుల్యభావం
య ద్యస్త్రదాన గురవో దహ నేంద్ర రుద్రాః"
—దూత ఘటోత్కచము.

కర్ణార్జునుల శక్తిలోను, సాధనసామగ్రిలోను పాటిల్లిన యీ మార్పులును, అందలి తరతమతలును దుర్యోధనున కేమెరుక? దేశకాలపాత్రము లెరిగి, వెనుకముందులు విచారించుకొని, వ్యవహరించు వివేక మాతనిలో పూర్ణానుస్వారముగదా? కావున, కర్ణునిమాటనే నమ్ముకొని, కయ్యపు టూబిలో దిగి, దిగబడి, ఉద్ధరించు దిక్కులేక, అడుగంటి అట్లే హతమైపోయినాడు.

కురుకులమును కూలార్చినవాడు కర్ణుడే.

## (9) కర్ణ భీష్మ సంభాషణము

కురుకులద్రోహ మొకటే కర్ణుని చరిత్రలో గర్హ్యమైనది. దాని మూలముననే యతడు కౌరవుల మేలుగోరు పెద్దలకోపమునకు గురియగుట. ఈ విషయమును విశదము చేయునది కర్ణ భీష్మ సంభాషణము.

భీష్ము డంపశయ్యపై నుండగా కర్ణుడు దర్శించి, చరణములకు ప్రణమిల్లి,- "మహానుభావా! నా యపరాధము క్షమించి, కోపముమాని, వాత్సల్య శీతలదృష్టితో నన్నుదిలకించి, నాతో మాడలాడవే"యని ప్రార్థించినాడు. భీష్ముడు పుత్రవాత్సల్యముతో నొకచేత దగ్గరకుతీసికొని, కౌగిలించుకొని, చుట్టుపట్లనున్నవారి నావలకుపంపి, "కర్ణా! నీపై నేను కోపింతునా? * నీవు కులధ్వంసముచేయబూనుకొన్నావు గనుక,

---

* "కుల భేదభయా చ్చాహం సదా పరుష ముక్తవాన్"

(భీష్మ. ౧౨౪. అ.)

ఇది నీకు తగదని నిన్న నిష్ఠురములాడినమాట నిజమే. అది మందలింపుగాని రోషము కాదు; ద్వేషమును గాదు.- మఱియొక విశేషము: నీవు దైవికగర్భజాతుడవు. సామాన్య మానవుడవు కావు. కౌంతేయుడవుగాని రాధేయుడవుకావు. కావున నీయెడ నాకు వాత్సల్యమేగాని మాత్సర్యము లేశమును లేదు" అని బుజ్జగించినాడు. కర్ణు డంగీకరించినాడు.

కర్ణుడు కౌరవులకు ద్రోహము తలచినవా డనుటకును, భీష్ముడు వారిక్షేమముకోరినవా డనుటకును ఇది సాక్ష్యము కాదా!

## (10) భీష్ముడు; కోపము

కర్ణుడు భీష్మునితో- "కోపముమాని నాతో మాట లాడు"మన్నాడే అ ట్లనుటకు కారణమేమో తెలియునా?

భీష్ముడు త న్నర్ధరథులలో జేర్చినప్పుడు కర్ణుడు, మండి పడి- ఒళ్లు తెలియని ప్రసంగముచేసినాడు.- * "చిన్నకురా నిష్టములేక చిలిపిప్రసంగములు చేసెదవు. నేను కురుపతిని జూచి సహింపవలసివచ్చినది. లేకున్న నీపని చెప్పుదు"నన్నాడు. "లావును బీరమును లేని నీ వర్ధరథుడ వపుదువుగాని, నేనుగా" నన్నాడు.

అంతటితోనూరకొన్నాడా! "కౌరవనాథా! ఇతడు

* చూ. ఉద్యో. 4-238 మొదలు, - ,,-244 వరకును.

దుర్జనుడు. మనకు హితుడు కాడు. ఈతనిబల మెంత? ఈత డెంత? శత్రులనందరి నీతడే జయించునా? ఇత డొక్కడు లేకున్న మునిగిపోవునా? అస లితడు పాండవపక్షపాతి. పోరికి వచ్చినను సరిగా సమరముచేయడు.- ముదిసి మదితప్పినవాడు. ఇట్టి వెడగులమాటలు పాటింపదగినవి కావు. ఇతని నిప్పుడే వెళ్లగొట్టుము'' అని రాజుకు బోధయుచేసినాడు.

కర్ణు డానా డంతగా నోరుపారవేసికొన్న వాడు గనుక, భీష్ము డాకోపము మనసుననుంచుకొని, పలుకునో- పలుకడో! కన్నెత్తిచూచునో- చూడడో? యన్న సందేహముతో, ''కోపమువమాని మాటాడవే''యని, జంకుచూ-వేడుకొన్నాడు. తప్పుచేసినవారికి జంకుండుట సహజముగదా!

కర్ణుడుచేసినది క్షమింపరాని తప్పైనను, గాంగేయుడు క్షమించినాడు. మహాత్ములు దీర్ఘక్రోధులుకారు. వా రల్పుల జల్పనముల కలిగి యీర్ష్యపూనరు. భీష్ముడు కర్ణు నెంతగా నాదరించినాడో, ఎట్లు హితోపదేశముచేసినాడో, ఆయన హృదయ మెంతవిశాలమో, ఎంతనిర్మలమో మనము తెలిసికొనియే యున్నాము గదా!

అపరాధక్షమాశీలుడును, పరమ శాంతమూర్తియు నైన శాంతనవుని 'పక్షపాతి' యనియు, 'ద్రోహి' యనియు వావిడిచి వాదించువారి హృదయ సంస్కార మేమిచెప్పవలె!

## (11) అర్ధరథ వ్యవహారము

భీష్ముడు తన్నర్ధరథు డన్నందుకు, కర్ణు డాయన నంత వమగా నిందించినాడే, అందు భీష్ముని త ప్పేమున్నది?

[1] కవచకుండలములు పోవుట, గురు శాపమున నస్త్ర వీర్యము చెడుట, బ్రాహ్మణుడు శపించుట, కృపయు - మతిమఱ పును సహజములై యుండుట - కారణములుగా జెప్పి, గాంగే యుడు, కర్ణు డర్ధరథుడన్నాడు - [2] ద్రోణుడు, "అంతేకాదు; అతడు రణమున ముందు దుముకునుగాని, తటాలున పారిపోవు టకు రోయనివాడు. కనుక అర్ధరథుడే యగు" నన్నాడు.

వారు చెప్పిన లోపములు కర్ణునిలో లేవా! ఉన్నప్పుడు, అతడు దొంగకు తేలు గుట్టినట్లు - 'కి' మ్మనక కుండవలెగాని, హెచ్చుకుందాడుట యేమిన్యాయము? అర్హతకు మించినపదవి కోరి, ఆ పదవియొసగని యధికారులపై గినిసి, కారులు ప్రేలుట క్రమమగునా?

---

1 "వియుక్త కవచే నైష సహజేన విచేతనః
కుండలాభ్యాం చ దివ్యాభ్యాం వియుక్త స్సతతం ఘృణీ,
అభిశాపా చ్చ రామస్య బ్రాహ్మణస్య చ భాషణాత్
కరణానాం వియోగా చ్చ తేన మే ర్ధరథో మతః"
(ఉద్యో. ౧౬౭-౭-౭)

2 "రణేరణేభిమానీ చ విముఖ శ్చాపి దృశ్యతే
ఘృణీ కర్ణః ప్రమాదీ చ తేన మే ర్ధరథో మతః" (,,-,,-౯)

అది యట్లుండగా, - సేనలో చేరినవారు, సర్వసేనాధిపతి శాసనమును శిరసావహింపవలె గాని, పల్లెత్తి పలుకవచ్చునా? అది రణనీతికి వెలితికదా? భీష్ముడు-అవంతి దేశాధీశులైన విందానువిందులనుగూడా అర్ధరథులలోనే చేర్చినాడు. వారు కర్ణునివలె మొండొడ్డినారా? మేరమీరి ప్రసంగించినారా! ఆ రణవ్యవహార నియంత, కార్యక్రమము ననుసరించి, వారి వారి తాహతులకు తగిన స్థానము లిచ్చినాడు, అంతేగాని ఆయనచేసిన అక్రమ మేమియును లేదు.

వ్యవహారధర్మము నెరుగనివారు - భీష్ముడు పక్షపాతబుద్ధిచేత కర్ణు నర్ధరథులలో చేర్చి యతనిని నిరుత్సాహపరచినా డందురు. అది పాటింపదగిన మాట కాదు.

కాని, ఇక్కడ - "కర్ణుడు రణధర్మము లెరిగినవాడే గదా! మరి యతడు భీష్ము నన్నిల ధిక్కరించినాడు?" అన్న శంక యొకటి ఆపతిత మగుచున్నది. మనవిచేయుచున్నాను.

ఆ భీష్మావధీరణము కూడా - దుర్యోధనునకు తాను కల్పించిన విశ్వాసమును దృఢపరచుటకై కర్ణు డాడిన యాటలలో చేరినదే. అందుకే భీష్ముని పాండవపక్షపాతి యనుట యును, అతడు లేకున్న నేమి! నే నొకడనే శత్రువుల నెల్ల మడియింతు ననుటయును.

స్వప్రయోజనాపేక్షచేత దుర్యోధనునియెదుట ఆ విధముగా తూలనాడినాడు గాని, కర్ణుడు భీష్మునియెడ భక్తి

ప్రపత్తులు గలవాడు. కావుననే, తానుచేసిన యీ వ్యతిక్రమమునకు పశ్చాత్తప్తుడై - * అస్త్రశయ్యాగతుడైన భీష్మునికడ కరిగినప్పుడు, తండ్రియెడ తప్పుజేసిన తనయునివలె పాదములపై బడి, కంటనీరుపెట్టుకొని, గద్గదస్వరముతో - "మహాత్మా! నేనజ్ఞానవశమున ననుచితప్రసంగములుచేసి, నీకు ద్వేష్యుడనైనాను. నా యపరాధమును మన్నింపు" మని క్షమాపణ చెప్పికొన్నాడు.

అంతేకాదు; భీష్ముని పతనమునకు పరితాపమునంది యీ క్రిందివిధముగా ననియున్నాడు.

"దమమును సత్యముం దపము దానము శీలము నస్త్రవీర్యశౌ
ర్యములును భీష్మునంద కల వట్టి మహాత్ముడు పోరనీల్గె నిం
క మనకు నేటిబాహుబలగర్వము లెక్కడిసేన లక్కటా
సమసెనె కౌరవేశ్వరుని సంపద యంచు విషణ్ణమూర్తియై."

(ద్రోణ. 1-28)

---

* "స దదర్శ మహాత్మానం శరతల్పగతం తదా...
నిమీలితాక్షం తం వీరం సాశ్రుకంఠ స్తదా వృషః
అభ్యేత్య పాదయో స్తస్య నిపపాత మహాద్యుతిః
రాధేయోఽహం కురుశ్రేష్ఠ నిత్యం మక్షిగత స్తవ
ద్వేష్యోఽహం తవ సర్వత్ర ఇతి చైన మువాచ హ.-
దురుక్తం విప్రతీపం వా రభసా చ్చాపలా త్తథా
య న్మయేహ కృతం కించి త్త న్మే త్వం క్షంతు మర్హసి"

(భీష్మ. ౧౨౨. ౫ )

కర్ణునకు గాంగేయునియెడగల భక్తి యెట్టిదో, ఆయన ప్రతాపప్రభావములందుగల విశ్వాస మెట్టిదో విదితమైనది గదా! అట్టి భక్తివిశ్వాసములుగలవా డా పూజ్యుని నిజముగా నిందించునా? దుర్యోధనప్రీతికొఱ కట్లు దురుసునుడులు వెలార్చినాడే గాని- అది నిజమైన నిందకాదు.

ఒక్కమాట:- కర్ణుడు, 'భీష్ముడు సమయుటతో కౌరవేశ్వరుని సంపదయు సమసినట్లే' నన్న భావమును సూచించినాడు గదా! తన కట్టి భావము కలిగి నప్పుడు, వెంటనే దుర్యోధనుని యుద్ధమునుండి విరమింప జేయవలదా? ఏల చేయలేదు?

## (12) ఏ రో టి కా పా ట

భీష్ముడు కర్ణునకు- "నీవు కాంతేయుడవుగాని రాధేయుడవుకా"వని తెలిపి "కర్ణా! పాండవులకు కృష్ణుడు రక్షకుడై యున్నాడు; కావున వా రజయ్యులు; వారితోడి విరోధము నీకొప్పదు. నామాటవిని వారలంగలసియుండు" మని చల్లగా ఉపదేశము చేసినాడు.

కర్ణుడు తన మాటవిని కౌరవులనుండి విడివడు ననియు, నంతటితో యుద్ధపుబెడద తొలగి కౌరవ పాండవ వంశములు రెండును సుఖపడుననియు ఆ కురువృద్ధు డనుకొన్నాడు. కాని, కర్ణు డట్టి మాట యెట్లు వినగలడు? అది యాతని కెదురుచుక్క, కౌరవులను తుదముట్టించి, పాండవులకు ప్రాభవము చేకూర్పవలెనని గదా యతని సంకల్పము. అందువలన భీష్మున కిట్లు సమాధానము చెప్పినాడు.

మహాత్మా! నేను కౌంతేయుడ నగుట యింతకుముందే వినియున్నాను. [1] కృష్ణరక్షితులగు పాండవులను జయింప రామియు నెరుగుదును. అయినను నే నిపుడు వెనుదీయనొల్లను. క్షత్రియునకు రణమరణమే గదా యభిలషణీయము! అదియును గాక, [2] పాండవరక్షణమున పద్మనాభునివలె, కౌరవరక్షణమున నేను బద్ధకంకణుడనై నా సంపదను, ఆలుబిడ్డలను, నా కీర్తిని, నా జీవితమును, సర్వమును కురుపతికి జన్నె పట్టి యున్న వాడను. ఇట్టి దెప్పరపు సమయమున, సేవాధర్మ విరుద్ధముగా - నమ్మిన స్వామిని త్యజించుట న్యాయమగునా! మరియు నో మహా పురుషా! సర్వపృథివీక్షయమును దెల్పు నిమిత్తములు తరచు గోచరించుచున్నవి. ఆహావ మవశ్యంభావి. అది విధిసంకల్పము. దైవమును పురుషకారమున వారింప శక్యమా? కావున, ప్రసన్నుడవై, పార్థునితోడి బరమున కనుజ్ఞయి" మన్నాడు.

---

[1] "పాండవా వాసుదేవశ్చ విదితా మమ సర్వశః
అజేయాః పురుషై రస్యై రితి తాం శ్చోత్సహామహే,
విజయిష్యే రణే పాండూ నితి మే నిశ్చితం మనః"
"ఆచైత ద్వ్యాధిమరణం క్షత్రే స్యా నితి కౌరవ."

[2] "వసుదేవసుతో యద్వ త్పాండవార్థం దృఢవ్రతః
వసు చైవ శరీరంచ పుత్రదారా స్తథా యశః
సర్వం దుర్యోధనస్యార్థే త్యక్తం మే భూరిదక్షిణమ్."
(భీష్మ. ౧౨౮. అ.)

భీష్ముడు కర్ణుని తత్త్వము గమనించి - "కర్ణా! నేను లోకశాంతికొరకు నీ కింత దూరము చెప్పితిని. కాని నీ తలపు వేరుగానున్నది. నీవు 'పాండవులతోడి వైరము వదలుకొన జాలననియు, క్షత్రియునకు కయ్యపుచావే కామ్యమనియు, నంటివి గావున * నట్లే కానిమ్ము. ధనంజయునితో తలపడి వీరులు పొందదగిన లోకములను పొందుదువుగాక. అనుజ్ఞ యిచ్చితిని పొ"మ్మన్నాడు. కర్ణు డభివాదనముచేసి కౌరవ విభుని విడిదల కరిగినాడు.

భీష్ముడు పడిపోవుటచేతను, పాండవులకు శ్రీకృష్ణుని సాహాయ్యముండుటనుబట్టియు దుర్యోధనునకు పరాజయమే గాని జయముకలుగదని తెలిసియు కర్ణుడు, శాంతనవుని శాంతి వచనములను కైకొనక కయ్యమేకావలెనని గట్టిగా పట్టుటలోగల రహస్య మేమి? కయ్యముజరుగకున్న కౌరవు లంతరింపరు. వా రంతరించిననేగాని పాండవులకు సామ్రాజ్యము సంక్రమింపదు. అందుకే యతడు శాంతికి 'ససేమిరా' యని సంగరమున కంగలువేసినాడు. ఇదే అతడు రణము కావలె ననుటలోగల రహస్యము.

ఇట్టి సంకల్పముతోనే కర్ణుడు 'ఏరోటి కాపాట' యన్నట్లు కృష్ణ భీష్ములతో 'జయము పాండవులదే' ననియు, దుర్యోధనునితో 'నేను నిన్ను గెల్పింతు' ననియు చెప్పుట.

---

* "అహం త్వా మనుజానామి య దిచ్ఛసి త దాప్నుహి
క్షత్రధర్మజితా౯ లోకా నవాప్స్యసి ధనంజయాత్"
(భీష్మ. ౧౨౨. అ.)

## (13) పాత పాట

భీష్మునితో ఆవిధముగా ననిపోయి, ఆహవములో అడుగువెట్టుటతోనే,-

"ధర్మజ భీమపార్థులను...మ, తత్కార్ముక ముక్త చండశర ఖండిత దేహులఁజేసి యిత్తునేఁ, బేర్మిగఁ గౌరవేంద్రున కభీప్సిత రాజ్య రమా విలాసముఁ" (ద్రోణ. 1. 34)

అని తన పాతపాట మరల పాడనే పాడినాడు. కాని, యీసారి ఆ ప్రతిజ్ఞ ఒక్క మెట్టు క్రిందికి దిగినది.- "కౌర వేంద్రునకు రాజ్యరమావిలాసము నిత్తు" నని పలికి, వెంటనే,-

"కాదేని గాండివ జ్యా
నాదము సురదుందుభి ప్రణాదంబును నిష్
ఖేదుఁడనై వించు నధిక
మోదంబున నిత్యసౌఖ్యముం గైకొందుఁ" ( ,, 1-35)

"కౌరవులం గాచుచు రణ
శూరులఁ బాండవుల నోర్చుచుం గీర్తికర
స్ఫార విహారత భీష్మునిఁ
జేరం జనుకంటె నొప్పు సెప్పం గలదే!" ( ,, 1-36)

అనియు నన్నాడు.

ఈ పలుకులలో నతడు, తన జయము సందిగ్ధ మని సూక్ష్మముగా సూచించినాడు. కాని, దురాశాదూషితుడును, అంధవిశ్వాసియు నైన కురుపతి యెట్లు గుర్తింపగలడు! ఒక వేళ నతడుగుర్తించి, త న్ననుమానించియుండు నేమో! యను కొని, కర్ణు డట్టి యనుమానముతొలగునట్లు, మరియొక సారి,-

"అర్జునుదర్ప మడంచి నేఁడు సం, గ్రామము నుజ్జగించెద నకంటక సుస్థితి గల్గ మేటినై, భూమి యమర్చెదం గొనుము భూవర! నీకగు పుత్ర పౌత్రులఁ, శ్రీమహిమఁ సమస్తజనసేవ్యమహోన్నతి పొందునట్లుగన్."

(కర్ణ. 1. 234)

అని గట్టిగా చెప్పినాడు.

ఈప్రకారముగా కర్ణుడు, రాజరాజు తన్ను జేర్చుకొన్న గడియ మొదలుకొని, తన తుదిగడియ వరకును, ఈ మాటనే చెప్పుచూ అతనిని నమ్మించుచూ వచ్చినాడు; అతడు నమ్ముచూ వచ్చినాడు. చెప్పి చెప్పి కర్ణుడు చెరిచినాడు; నమ్మి నమ్మి దుర్యోధనుడు నాశమైనాడు.

"నిన్ను కురురాజ్య మేలింతు"నని ఆశపెట్టియు "పదునాల్గవయేట ఫల్గునుని జయింతు"నని బాణముముట్టి బాసచేసియు, "పార్థుని వధింపక పదనఖధావనమైన నొనర్ప" నని ప్రతినచేసియు, "నీచేత రాజసూయముచేయింతు"నని ఊరించియు, దుర్యోధనునకుపురిపెట్టి యుద్ధము ప్రవర్తిలజేసిన వాడు కర్ణుడే. అత డొకడు లేకున్న భారతయుద్ధమే లేదు. అందువల్లనే- "కర్ణునితల భారత"మన్న మాటపుట్టి, లోకమున శాశ్వతముగా నిల్చిపోయినది.

కొండంత కోరికతో, గంపె డాశతో, తన చెలిమి నాసించి, సామాన్యుని తనొక్క రాజును జేసి, సర్వోన్నత భోగములతో, తన్ను దనిపి, తాతతండ్రులను గురువునుగూడా

కాదని తన్నే నమ్ముకొనియున్న దుర్యోధనునకు కర్ణుడు చేసిన ప్రత్యుపకారము కులధ్వంసము.

అంతకంటెను కృతఘ్నత, అంతకుమించిన మిత్రవంచన మరియుండునా? * అట్టి వ్యక్తిని 'స్వామిభక్తు'డనీ, 'స్వార్థత్యాగి' యనీ, 'సత్యసంధు'డనీ వచించుటకంటెను లోకవంచన యుండునా?

విమర్శకులు భీష్మ ద్రోణులను 'స్వామిద్రోహు' లని నిరసించి, కర్ణుని 'స్వామిభక్తిపరు' డని ప్రశంసించుచు వ్రాసిన వ్రాత అసత్యము గావునను, అజ్ఞులేకాక ప్రాజ్ఞులును కొందరా వ్రాతను విశ్వసించుచున్నారు గావునను సత్యనిర్ధారణశక్తి కర్ణుని కలహాపు నేనిందు తెలుపవలసివచ్చినది.

కర్ణునకు లేని గుణములు చెప్పి విమర్శకు లాతనిని రచ్చకులాగి, యిట్లు విమర్శలకు గురిచేసినారు గాని, నిజమునకు అతనిలో చెప్పదగినది తంత్రజ్ఞత. వెట్టివానిగా నటించి యుగంధరుడును, ♦ జైనుడుగా వర్తించి కుమారిలభట్టును

---

* "కర్ణుడు నిర్దోషి. యోగ్యుడు. మహావీరుడు. స్వధర్మ నిర్వాహకుడు. ప్రభుభక్తిపరుడు. అట్టి వానిని దుష్టుడనుట యయుక్తము."
('పెండ్యాల' పు. 286)

♦ కుమారిలభట్టు వైదికుడు. జైనమతము నణగద్రొక్కినవాడు. ఆతడు జైనవేషముతో నొక జైనాచార్యుని శుశ్రూషించి, ఆ మతరహస్యము లన్నియు తెలిసికొని, పిమ్మట ఆ మతమును ఖండించి – వైదిక మతమును రక్షించినాడు.

తమతమ కార్యములను సాధించుకొన్నట్లు, కర్ణుడు దుర్యోధనునకు మిత్రుడుగా నటించి తన యభీష్టమును తీర్చుకొన్నాడు. అది ప్రశంసింపవలసిన ప్రజ్ఞ.

'నమ్మించిచెరచినాడనుటచేత కర్ణుడు దోషియని యేర్పడదా!'యని యందురేమో; అందును దోషములేదు. అది రాజధర్మము. రాజనీతిలో కార్యసాధనమే ప్రధానము. న్యాయాన్యాయవిచారణ దానికివెనుకనే.

ఉదాహరణ కెక్కడికో పోనక్కరలేదు. ధర్మనిరతులలో ధర్మరాజు ప్రథమగణ్యుడుగదా! అతడు కర్ణుని గడతేర్చుటకుచేసిన చేష్ట యెట్టిది? * "సమరసమయమున నిరాకరించిపలికి కర్ణునిమనసు కలతపరిచి - యతని దర్పము చెరిచి - పార్థుని బ్రతికించి తనకు జయము కలిగించవలసిన"దని శల్యుని ప్రార్థించి ప్రయోగించినాడు. "ఇది యకృత్యమని సంశయింపవల"దనియు గట్టిగా చెప్పి పంపినాడు. శల్యు డట్లే చేసినాడు. కర్ణుడు పడిపోయినాడు; ధర్మరాజు జయించినాడు.

అట్టిది రాజనీతి. కర్ణుడుపాటించిన నీతియు నదే. కావున నతడు దోషికాడు.- రాజనీతి యనగా లోకవ్యవహారమే.

---

* "తత్రపాల్యోఽసి నో రాజ న్యది మ ప్రియ మిచ్ఛసి
తేజోవధ శ్చ తే కార్యః సౌతే రస్మ జ్జయావహః
అక ర్తవ్య మపి హ్యేతత్కర్తు మర్హసి మాతుల" (ఉద్యో. ౮. అ.)

లోకమున కార్యవాదు లెల్లరును పాటించునీతి యదే. "తన్నుమాలినధర్మము మొదలుచెడ్డబేర"మన్న నానుడి ఆ ధర్మము ననుసరించి పుట్టినదే. భారతము లోకవర్తన కాదర్శమేగాని వేరుకాదు. కానివాని నే మార్గముననైనను కడముట్టించుట రాజనీతి యని భారతము తెల్పియు న్నది.

"తఱియగు నంతకు రిపుఁ దన
యఱకటఁ బెట్టికొని యుండునది దఱి యగుడుం
జెఱుచునది ఱాతిమీఁదను
వఱలఁగ మృద్ఘటము నెత్తివైచిన భంగిన్" (ఆది. 6. 115)

"తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మఁగా
నొడివియు సత్యమిచ్చియుఁ జనున్ జననాథ కృతాపకారులం
గడఁగి వధింపఁగా ననుట కావ్యమతం బిది గాన యొట్టులుం
గడుకొని శత్రులం జెఱుపఁగాంచుట కార్యము రాజనీతిపైన్"
( ,, 6. 119)

కర్ణుడు దుర్యోధనుని నమ్మించి చెరుచుట రాజనీతి కనుగుణమే. కనుక నది యాతనిలో గుణమేగాని దోషము గాదు. దానినిబట్టి యతనిని 'రాజనీతిపరు' డనవచ్చునుగాని, 'రాజభక్తిపరు' డనరాదు. కావున విమర్శకుల సిద్ధాంతము విసర్జనీయము.

---

## ౨౩. కర్ణుని సుగుణములు



కర్ణుడు కార్యవశమున - కౌరవపతి విషయమున - విశ్వాసద్రోహియైనను, అతనిలో కొనియాడదగిన గొప్ప గుణములు నున్నవి. వాటిలో మొదట చెప్పదగినది దానము. దానమున నతడు బలి దధీచి శిబి సదృశుడుగా సన్నుతి గన్న వాడు. 'దానకర్ణు' డని లోక మిప్పటికిని వాకొనుచుండుటయే యతని దాతృత్వమహత్త్వమునకు నిదర్శనము.

కర్ణుని సుగుణములలో రెండవది విప్రభక్తి.-

అతడు వేదపారగులైన విప్రులను సేవించి ధర్మములను- ధర్మసూక్ష్మములను - తత్త్వార్థమునుగూడా గ్రహించినవాడు. ఈ విషయమును శ్రీకృష్ణుడే యిట్లు తెల్పియున్నాడు.-

"ఉపాసితా స్తే రాధేయ బ్రాహ్మణా వేదపారగాః
తత్త్వార్థం పరిపృష్టా శ్చ నియమే నానసూయయా
త్వ మేవ కర్ణ జానాసి వేదవేద్యాన్ సనాతనాన్
త్వ మేవ ధర్మశాస్త్రేషు సూక్ష్మేషు పరినిష్ఠితః"

(ఉద్యో. ౧౩౯. అ.)

శూరత కర్ణుని గుణములలో మూడవది.-

"ఇష్వస్త్ర వేత్తృతయందును, శరసంధాన లాఘవము లందును నీవు ఫల్గునునితోను - కృష్ణునితోను సమానుడ" వని భీష్ముడు కర్ణుని ప్రశంసించియున్నాడు.-

"ఇష్వస్త్రే చాస్త్రసంధానే లాఘవే౽స్త్రబలే తథా
సర్వశః ఫాల్గునే నాసి కృష్ణేన చ మహాత్మనా."
(భీష్మ. ౧-౨౪. ౧౧.)

ఈ మూడు గుణములనే భీష్ముడు ముఖ్యముగా పేర్కొన్నది.

"జానామి సమరే వీర్యం శత్రుభి ర్దుస్సహం భువి
బ్రహ్మణ్యతాం చ శౌర్యం చ దానే చ పరమాం స్థితిమ్"

---

•

# ౨౪. కర్ణుని శూరత

కర్ణుడు శూరుడేగాని, ఆతని శూరత, వితరణము వలెను- విప్రభక్తివలెను అంత నిగ్గయినది కాదు. చంద్రునిలో మచ్చవలె నతనిశూరతలో పారుబోతుతన మను లోప మున్నది. అతని నర్ధరథులలోఁ జేర్చుట కది యొక కారణము గదా! అది గమనింపని కర్ణాభిమాను లతనిశౌర్యము నతి వేలముగా నుతియింతురు. అది యొక వేలమువెఱ్ఱి. మరియు వారు, కర్ణుడు గాండీవికలవిగాని గండరగండడనియు, కవచ కుండలములు పోకున్నచో, బండిచక్రము క్రుంగకున్నచో, ఫల్గునుని పడగొట్టియుండు ననియు నందురు. అదియు నసంగత వ్యాహారమే. కవచకుండల మండితుడై యుండగానే గదా, కర్ణుడు ద్రుపదునిచేత దెబ్బలుతిన్నదియు, మత్స్యయంత్ర ఘట్టమున మఘవసుతునితోడి ద్వంద్వయుద్ధమున మానము కోలుపోయినదియును? ఉత్తరగోగ్రహణయుద్ధమున నతని బండిగల్లు క్రుంగలేదుగదా! మరి యపు డెందు కోడిపోయి నాడు? కవచకుండలములు పోకున్నను, బండిగల్లు క్రుంగ కున్నను కర్ణు డర్జునునకు ఓడువాడేగాని, అతనిని గెలువ సమర్థుడుగాడు. కవచకుండలము లమృతమయములు గావున అవధ్యత నియ్యగలిగినవేగాని, అజయ్యత నియ్యజాలినవి కావు.

కర్ణు డర్జునునికంటెను తక్కువవారైన యోధుల కోడి యున్నాడు. ద్రుపదున కోడెనుగదా! అది చిన్ననాటికథ యందురేమో! అది పోనిండు. ప్రకృతయుద్ధమున సాత్యకి

కోడిపోలేదా? భీముడు బాణయుద్ధమున కర్ణుని సొమ్మసిలగొట్టి పట్టి నాలుకకోయబోవుటయు, శల్యు డడ్డుపడి కర్ణుని ప్రాణములు కాపాడుటయు మున మెఱిగినకథయేగదా! అట్టి కర్ణుని గాండీవికిమించిన గండుజోదనని కైవారముచేయుట యుచిత మగునా? అది యంధపక్షపాత మనిపించుకోనదా?

అర్జునుని కంటెను నే నధికవీరుడ నని కర్ణుడే యనుకొన లేదు. పార్థునితోడి యుద్ధమున బ్రతికి బయటబడుదునన్న నమ్మకమును అతనికి కలుగలేదు. ప్రాణాశవదలుకొనియే యత డర్జును నెదుర్కొన నిశ్చయించుకొన్నాడు.

ఆతని వాక్యములనే యుదాహరించుచున్నాను.

"కాండమహోత్తరంగముల గైకొల ముంచు
విజయాంబురాశికి వేల నగుదు"

... ... ... ...

విల్లు వట్టెడు వారికి నెల్ల నెక్కు-
డనగ నెగడిన గాండీవి నాహవమునఁ
దొడరఁ బ్రాణంబులకు నాసపడు లఘుప్ర
కారులకు వచ్చునే నాకుఁగాక శల్య!" (కర్ణ. 2–95)

"ఖండనంబునఁ బార్థుచేఁ బడక నేఁడు
మేలుచే గెలిచితినేనియు మృత్యువునకు
నొక్కఁడును నగపడ నాకు నివ్విధంబు
సంశయములేక చిత్తంబునందుఁ దోఁచె" (,,–2–107)

గాండీవి చండిమనుగూర్చి కర్ణుడే యిట్టి నిర్ణయముతోనుండగా, ఇతరులు 'గాండీవికంటెను కర్ణుడే యధికు'డని వాదించుటలో గుణమేమి?

# ౨౫. అర్జునుని పిరికితనము

ఈ పట్టున కర్ణపక్షమువా రిట్లు ప్రశ్నింతురు.—

"వెసకటికథ లెందుకు? కర్ణుని రెండవనాటియుద్ధమున నర్జును డతని విక్రమవిస్ఫూర్తిచూచి వెరచి, కృష్ణునితో,—

"...... కర్ణునిం జూచితె యేకవిక్రమో
ద్దండతఁ దెంపుసేసి పటుదర్పమునూపుమఁ జేతిచూపరా
కుండెడు నట్లుగా నలుక నుగ్రత మండెడు నిప్డు నేర్పుమై
నుండక యీసునం దొడరి యోటమి దెచ్చికొనంగ నేటికిన్."

(కర్ణ. 3-16)

* "వచ్చిన మఱి గెల్పు గొనన్
వచ్చునె తన యొడలు గలుగ వైరుల గెలువన్
వచ్చుం దఱివచ్చిన నది
మెచ్చు జయార్థులకు మరుదమిత్రధ్వంసీ." ( ,,- 3-17)

"పట్టపగలింటి సూర్యుని పగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచు నున్నవాఁడు
మనరథం బిప్డు మాధవ మరలనిమ్ము
బ్రదికియుండిన శుభములు వడయవచ్చు"- ( ,,- 3-18)

అని మొరపెట్టుకొనలేదా? కృష్ణు డతని తత్తరపాటును గమనించి, తావుమార్చి తాజాపరిచినగాని యితడు పురికొన డని

---

* "న చ శక్ష్యామి సమరే కర్ణస్య ప్రపలాయితుమ్
జీవన్ ప్రాప్నోతి పురుషః సంఖ్యే జయ పరాజయౌ
మృతస్య తు హృషీకేశ భంగ ఏవ కుతో జయః" (కర్ణ. ౬౫. ౮)

యూహించి,- "అర్జునా! కర్ణపరాభూతుఁడై యున్న మీ యన్నను పరామర్శించి వత్తము ర''మ్మని యుక్తిగా నతనిని శిబిరమునకు తీసికొనిపోలేదా? కర్ణు డర్జునుని మించిన శూరు డనుటలో తప్పేమి?'' అని కర్ణపక్షమువారి ప్రశ్న.

అదియును నిజమే. కర్ణుఁడు మించినశూరుఁడు గాకున్న గాండీవి యంతగా నేలవెరచును. భయపడి 'బండివెనుకకు త్రిప్పు' మనుటకు తగినట్లు అన్ననుచూచివచ్చుట కని ఆహవమునుండి తొలిగియు పోయెను. దానితో నతని పిరికితనము స్థిరపడినదే గాని - శూరత యేమిసూచితమైనది? ఆజన్మ విరోధియు, ప్రధానప్రత్యర్థియు, ఇతరాజయ్యుఁడును నైన కర్ణుఁడు కదనరంగమున వీరవిహారము చేయుచుండుట చూచిన వా డతని నెదుర్కొనవలెనా? ఇంటనున్న యన్నను చూడ బోవలెనా?

"ధర్మజుఁడు కర్ణునిచే నవమానితుఁడైనా డన్న మాటకు మనసు కలతచెంది, అగ్రజునియందలి భక్త్యతిశయముచేత నతనిని విచారించిరాబోయినాఁడు గాని, అర్జునుఁడు కర్ణునకు వెరచిపోలే''దని యొక సమర్థనము. అది కేవలము నీరసమైన వాదము.

క్రీడి వాడిచెడి యెత్తుపడుటచేత-అతని పరువుగాపాడుటకై అచ్యుతు డప్పటి కప్పుడా సాకు కల్పించినాఁడు గాని, అది యొక యవశ్యకృత్యమా? గాండీవి కర్ణునిపై గవిసి కయ్య

మునకే తొడగియున్నచో కృష్ణుడా కయ్యమూపి, అతనిని అన్నయ్యకడకు పిల్చుకొనిపోయి యుండునా!

ఎందుకు విస్తరము; ఈ పట్టున అర్జును డాడినమాటయే నిజము. ఆ యోటమి కృష్ణునకును అంటుకొన్నది. ధర్మజుడు, కర్ణునితోడి కలహము మాని తన్ను విచారింపవచ్చిన తమ్ముని నతి పరుషముగా నిరసించినాడు. అతనిని నిరసించుటలో, కృష్ణుడును పరాజితుడైనట్లే మృదువుగా సూచించినాడు.

"విను కర్ణున కే నోడితి
నన నేటికి నీవు నోడి తనిలజ మాద్రీ
తనయులు మున్నే యోడిరి
మనతోఁ గూడంగఁ గంసమర్దనుఁ డోడెన్" (కర్ణ. 3-53)

అని ధర్మరాజన్నమాట. అందు పొరపాటేమున్నది. అర్జునుని జయపరాజయములకు కృష్ణుడేగదా బాధ్యుడు!

అర్జును డన్నకెట్లో 'సమర్పకము' చెప్పుకొని,- "నేఁడు కర్ణు నే ననిఁ బడవైతు నీ పదము లాన" అని ప్రతిజ్ఞచేసి, మరల సమరమునకు వచ్చినాడు. కాని, అతనిలో దిట వేర్పడ లేదు. కర్ణుడు కంటబడుటతోనే కంగారైనాడు. గుండెలు జలదరించినవి. తను వాపాదమస్తకమును ముచ్చెమటలు క్రమ్మినవి. దిక్కుతోచక దిగాలుపడి నిలుచున్నాడు.

అచ్యుతుం డతని యవస్థ చూచి, ఇపు డెట్లైన నితనికి ధైర్యము నెక్కొల్పి పోరింపకున్న మాటదక్క దనుకొని, యిట్లు ప్రబోధించినాడు.

"పార్థా! నీ వి ట్లపార్థుడవు కానేల? అమరులకును అజేయుడైన అమరనదీతనూభవు నవలీలగా జయించిన వాడవు. అస్త్రగురుడైన ద్రోణుని దోరించినవాడవు. సైంధవుని నీవు సమయించిన తీ రద్భుతావహము. నిన్ను బోలిన వీరుడు భూలోకముననే కాదు, ఏ లోకముననను లేడు. అట్టి జగజెట్టికి నీ కీ కర్ణు డొక సరకా? నీ వి ట్లరవాయిగొననేల?" అని పొగడి ముం దుబ్బించినాడు. పిమ్మట, "కాదోయి కర్ణుడేగదా నీకు ముఖ్యవిరోధి. ఆనాటి కపటద్యూతమునకును, జతుగృహ దాహమునకును వాడే కారకుడు. ద్రౌపదికి మానభంగము చేయించినవాడు వాడే. నీ కొడుకు మరణమునకును వాడే మూలభూతుడు. అట్టి ప్రబలాపరాధిని హతమార్పని నీ శౌర్యమేల? నీ దివ్యాస్త్రశస్త్రసంపత్తి యేల?" అని పౌరుష మెక్కించి, "నీ వి త్తరి వీరిడివలె విషణ్ణుడవు కాదగదు; సమరమునకు సమకట్టు" మన్నాడు. కర్ణుని సంగర సంరంభ ముగ్గడించి, గాండీవికిం జూపి,-

"కేతనము రథముఁ దురగ
వ్రాతముఁ బొడిచేసి నీ శరంబులఁ గర్ణు
వే తునిమినఁ గని శల్యుఁడు
వా తెఱ యొండంగఁ బాఱవల దె కిరీటీ!" (కర్ణ. 3-128)

"పూనిక నెఱపి శోకం బుజ్జగించి లోకంబు సంస్తుతింప
సుఖివిగమ్ము" ( ,,- 3-129)

అని పురమాయించినాడు. ఆ మాటలతో తిన్నగా తేరుకొని

అర్జునుడు- "మహాత్మా! నీ తోడు పాటున్న నేను మూడు లోకములను గెలువగలను. తుక్కు కర్ణుని దొక లెక్కా? ఇక చూడు నాప్రతాప"మని గాండీవ మెత్తుకొన్నాడు.

ఆ నాడతనిని కర్ణునిపైకి పంపుట కంత'తతంగము' జరిగినది. కావుననే కర్ణాభిమానులు కవ్వడికంటెను కర్ణుడే గట్టిజోదన్నారు. అర్జునాభిమాను లంగీకరింపక విధి యేమున్నది!

కాని, యిక్కడ చెప్పవలసినవిషయ మొకటి యున్నది. కర్ణార్జును లిద్దరును అసహాయశూరులే. అయినను ఇద్దరికిని చెరియొక లోపమున్నది. కర్ణుడు మొగ్గరము సత్యోద్ధతితో చొచ్చుటయు- నడుమనే బీరముమాలి పారిపోవుటయు నెల్ల రెరిగిన దేగదా! అర్జును డాజిలో నడుగుపెట్టినపిదప మడమ త్రిప్పుట లేదుగాని, కలహమునకుదిగుటకే కళవళపడును. ఇది క్కావైచిత్ర్యము.

బీభత్సునకు పిరికితనము సంగ్రామ ప్రారంభదినమున- "సేనయో రుభయో ర్మధ్యే" ఒకసూరు వచ్చినది. మరల * ఈ నాడు వచ్చినది.- అప్పు డది బంధువులు మరణింతు రన్న వ్యథచేగలిగిన వైక్లబ్యముగా నతడు చెప్పుటయు, కృష్ణుడు - "అర్జునా! నీ చుట్టములు చచ్చినను వారియాత్మ

* " 'మాధవా...... పడయవచ్చు'- నను సమయమే విజయుని విజయ దశలో నీచతను సూచించు నవస్థయై యున్నది.

('పెండ్యాల'- పు. 257)

చావదు; అది నిత్యము; కావున నీవు వారిపోకకు పొగులవల” దని తత్త్వబోధచేసి, ఆ పెంటితనము నెట్లో పాయదట్టి సమరమునకు సముకొల్పుటయు జరిగినది.

ఈ నాటి వైక్లబ్య మట్టిదిగాదు. స్వమరణభీతివలన గలిగినది. వెనుకటి బోధవలన,- 'తానుచచ్చినను తనయాత్మ చావ' దని తెలిసియున్నను, గీతాచార్యునిశిష్యునకు నిజమరణ భయము నిగ్రహింపరానిదే యైనది. శ్రీకృష్ణుడు హెచ్చరిక పడి నుచ్చరకొట్టి నూలొక్కల్పకున్నచో గాండీవికథ యేదారి పట్టి యుండెడిదో! సరే; ఇది విషయాంతరము.

## ౨౬. కథా పరామర్శ

ప్రకృత కథాంశమునుగూర్చి యొకటి రెండుమాటలు.-

### I. అనౌచిత్యము

ఈ ఘట్టమున కర్ణుని విక్రమము మిడిసి మిన్నందినట్లును, పార్థుని పౌరుషము పల్చబారి పాతాళమునకు దిగజారినట్లును చెప్పబడినదిగదా! ఈ సంఘటన 'బెండుమునిగి-గుండుదేలిన' దన్నట్లు విపరీతముగా నున్నదిగాని విశ్వసింపదగియున్నదా?

కర్ణుడు మొన్నటి దినము సాత్యకికోడి పారిపోయినవాడు. ఈ నాడు భీముని చేతిలో చావుదప్పి బ్రతికినవాడు. అట్టివాని కింతలోనే అంతటి మగతన మెక్కడనుండి వచ్చినది? ఎవ్వరైనను వర మిచ్చినారా?

ఇక అర్జునుని విషయము. అతడు,-

"కన కోర్వీధర సానుసారరుచిమద్గాండీవ నిర్ముక్త ప
త్త్రినిపీతారుణ వారిశేషముఁ బతత్త్రి వ్రాతముల్ ద్రావ న
య్యని నాతోడఁ జతుర్దశాబ్దమున మాఱై పోరు కర్ణాది దు
ర్జన సంఘంబుల మార్తురం దునుముదున్ సంగ్రామరంగంబునన్-"

(సభా. 2. 297)

అని ప్రతిజ్ఞచేసియుండుటయే గాక, కర్ణుడు- "తిండిపోత నీకు భండనమేటికి? "అని భీము నెగతాళిచేసినందుకు, కినిసి,-

"ఏమిరకర్ణ! భీము కటు లేటికిఁ దిట్టి తతండుదోల ని
గ్గమియు లేక పాఱునెడ నెవ్వఁడు దిట్టెరి నిన్ను గెల్పుసం
గ్రామములోనఁ దప్పిదము గల్గినయంతన యింత గర్వమే
లా మును నిన్నెఱుంగమె చలంబున సాత్యకి యిప్డు గెల్వఁడే"
(ద్రోణ. 4-288)

అని యతనిని చీరికిగొనక చీవాట్లుపెట్టినవాఁడు. ఇదియు నిన్న గాక మొన్ననే జరిగినది. ఇంతలోనే యర్జునునికి అంత పంద తన మేలవచ్చినది? ఎవరైనను శాపము పెట్టినారా?

ఈ శంకలకు సమాధానములు కథలో కనబడవు. అందు వలన ఈ మార్పు కవికల్పిత మనియు, నందుకు కారణ మీ క్రిందివిధముగా నుండుననియు తోచుచున్నది.

ఈ యితివృత్తమున నర్జునుడు నాయకుడు; కర్ణుడు ప్రతినాయకుడు. ప్రతినాయకుడు ప్రతాపశాలియైననేగాని నాయకుని గెల్పున కౌత్కృష్ట్య మేర్పడదన్న భావముతో, నిందు కర్ణుని శౌర్యమున కాధిక్యము కల్పింపబడినట్లున్నది.

ప్రతివీరుని వీర్యాతిశయమును చెప్పి, అట్టి వానిని జయించినాడనుటద్వారా నాయకుని కుత్కర్షమును ప్రతిపాదించుట శాస్త్రోక్తమే.

"అథవా ప్రతిపక్షస్య వర్ణయిత్వా బహూన్ గుణాన్
తజ్జయా న్నాయకోత్కర్ష వర్ణనం చ." (ప్ర. రు.)

కాని, ప్రతినాయక గుణవర్ణన మెంతమాత్రముచేసిన

నాయకుని గుణములకు మెరు గెక్కునో అంతమాత్రమే చేయ వచ్చునుగాని, అంతకుమించి చేయరాదు.

"య ద్గుణేన రిపో ర్వర్ణనేన నాయకోత్కర్ష ప్రతిపాదకం తత్రై వాస్య తాత్పర్యమ్" (కా. ప్ర. వ్యా.)

ప్రతినాయక వర్ణన మతి విస్తరమైనచో తద్గతరసమే ప్రధానముగా ఆస్వాద్యమై, నాయకగతరస మాస్వాద్యము కాకపోవును గనుక అట్టి వర్ణనము తగదనియు శాస్త్రము చెప్పుచున్నది.

"అంగ స్యాప్రధాన స్యాతివిస్తరేణ వర్ణనమ్" (కా. ప్ర.)

"తథా చ తద్గతఏవ రసః ప్రాధాన్యే నాస్వాద్యేత న తు నాయకగతః ప్రధానో రస ఇతి దోషః" (వ్యాఖ్య)

ఈ కథలో కర్ణునిశౌర్యమున కాధిక్యమును, బీభత్సునకు కేవల భీరుత్వమును చెప్పుటచేత - కర్ణునియందు నాయకత్వ మును, అర్జునునియందు ప్రతినాయకత్వమును ప్రతీతము లగు చున్నవి. ఇది లక్షణవిరుద్ధము.

నాయకుడు ప్రతినాయకుని ప్రతాపమును ప్రశంసించి, వెంటనే,- "అయినను నాకేమిలెక్క!"యని ధీరతను ప్రకటించి, యాతని నెదుర్కొనినట్లు చెప్పుట యొప్పునుగాని, ప్రతినాయ కుని పరాక్రమాతిశయమును చెప్పి, దానికి జంకి చచ్చు ప్రసంగముచేసినట్లు చెప్పుట యొప్పదు.

ఉదాహరణకు,- కర్ణుడు భీమునిపైకి పోవుచూ, శల్యునితో,—

"తరమిడి చంపెఁ గీచకశతంబు నితం డదిరేల యొల్లెడన్
బిరుదనఁగా బలాఢ్యుఁడనఁ బెద్దయుఁ బేర్చినవాఁ డగుట్ వృకో
దరుఁ డటులైన నీతనిమదం బడఁగించుట లీల నాకు నీ
వరదము సమ్ముఖంబుగ రయంబునఁ బోవఁగనిమ్ము భూవరా!"
(కర్ణ. 2-207)

అన్నాడు. అది నాయకలక్షణము; అది రసోచితరచన.

అర్జునుడును అట్లేగదా చేసియుండవలసినది? "ఈనాడు కర్ణుకు తేరిచూడరాకున్నా"డనియు, "పట్టపగలింటి సూర్యుని పగిది నుగ్రమూర్తియై వెలుగుచున్నా"డనియు కర్ణుని తేజో విశేషమును వర్ణించినవాడు- అంతటితో యుద్ధమునకు చొచ్చియున్నచో రసోచితముగా నుండెడిది. అట్లుచేరక,-"ఈసునం దొడరి యోటమిఁదెచ్చుకొనంగనేటికిన్" అనియు, "బ్రతికి యుండిన శుభములుపడయవచ్చు- మాధవా మనరథమును మరలని"మ్మనియు పలుకుటచేత, అర్జునుని వీరత కోలుపడి భీరుతయే స్థిరపడినది. నాయకునకు భీరుత్వముచెప్పుట యనుచితము. అనౌచిత్యము రసభంజకము.

"అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్"

తుద కర్జునుడే గెల్చినట్లు కథ పర్యవసన్నమైనను, ముందు ఓటమిని జెప్పి, పిమ్మట గెల్పు నెంతగొప్పగా వర్ణించినను, అనౌచిత్య దోషము మాసిపోదు.

పిరికిపంద పోరుటయు గెల్చుటయు నుండునా? పందతనమునకును గెల్పునకును ఎన్నిచాళ్లపెట్టు? పందయెట్లో జయించి

నను, లోక మూ జయము కృత్రిమమనియే భావించునుగాని సహజమని సంభావింపదు. కాబట్టి పార్థునకు పందతనమును కల్పించి, అతడు గెల్చినాడనుటలో సొగసు లేదు.

గాండీవి కా పిరికికండ కల్పితముగాక స్వభావమే యగు నేని, అతడు కర్ణుని కంటెను తక్కువబంటన్న వాదమే తథ్య మగును. తన్మూలమున నాతని యూహావదోహలతను దెల్పు పూర్వకథ లన్నియు పురివిచ్చి పొలిపోవునుగదా!

ii. పూర్వకథా వైరుధ్యము

(1) పార్థుడు ఫాలనేత్రుని గెల్చిన బంటనియు, కాల కేయాది రాక్షసులను మర్దించిన మహావీరు డనియు, చిత్ర సేనాది గంధర్వుల గండడచిన భండన పండితు డనియుగదా పూర్వకథలు. ఆ కథల కీ పిరికితనపు కథ విరుద్ధముకాదా!

(2) అవి యేనాటికథలో యందు రేమో! పేడిగా నుండియు, పనికిమాలిన ఉత్తరసారథ్యముతోనే, కర్ణునేగాక - భీష్మ ద్రోణ కృపా శ్వత్థామ దుర్యోధనులనుగూడా ఒక్క పట్టున నలవోకగా నవజితులంజేసిన అసహాయశూరు డని గదా ఉత్తరగోగ్రహణ కథ?

అట్లా కథలో - యోధానుయోధుల నంతమందిని - అంత ఉలకనగా ఊదిపారవేసిన ఉక్కుతునుక - ఈ కథలో - నిండారిన పౌరుషమును, సర్వసమర్థుడైన చక్రపాణి సారథ్య మును గలిగియుండియు, ఒక్క కర్ణునకేచాలక - అతని యెదు

టికి పోవుటకే గుండెలులేక తేరు మరలించుకొని గుట్టుగా పోయి గుడారములో కూర్చున్నట్లుంచుట విరుద్ధముకాదా?

ఈ కథ చదివినవారు, * పై రెండు కథలును పక్షపాత కల్పితములుగాని సత్యములు కావనరా?

(3) భీష్ముడు పార్థుని పరాక్రమ మహాత్తను వర్ణించుచూ,-

"నరుఁ డీమానముఁ వాఁ డనంగ వశమే నా, కంతవా రెందు నె

వ్వరు లే,రింకను బుట్టగు"- (ఉద్యో. 4. 258)

అనిగదా అన్నది. అంతగా వర్ణితుడైన వీనిన కింతగా భీరుత్వమును జెప్పుట విరుద్ధముగాదా!

(4) కర్ణు డర్జునునకు దుర్నిరీక్ష్యుడై నిర్వైరగల్గించుటయే నిజమైన యెడల, అతడు విజయునకు మీనుమిగిలిన వీరుడనుట నిశ్చయముగదా! అతనిలో అంత శౌర్యముండగా, భీష్ము డతనిని అర్ధరథులలో జేర్చుట ప్రమాదమో-పార్థపక్షపాతమో కావలసివచ్చునుగదా! అగునా?

(5) గాండీవి యీనాడు 'కర్ణు నెదిరించినచో చచ్చిపోదు' నన్నంతగా వెరచరచుటకు హేతు వేమి! భార్గవాస్త్రప్రభావమునకు జడిసి కోచపారెనా? అది నమ్మదగినమాటయగునా? కర్ణు డేయస్త్రములునులేక వట్టిచేతులతో వచ్చుననియు

---

* "అర్జునకృతములగు ఘోషయాత్రా సందర్భపు గంధర్వవిజయమును, ఉత్తరగోగ్రహణము కల్పితములని కొందఱు తలంతురు."

('పెండ్యాల'- పుట. 256)

సులభముగా గెలువవచ్చుననియు తోలుత ననుకొని, అతడు భార్గవాస్త్రముతో వచ్చుట చూచి భయపడినాడా-పార్థుడు? అట్లు భయపడుట కతడు భార్గవాస్త్రము నెుగ నెరుగడా? ఆపాటియస్త్రము లతనికడ లేవా? ఇంతయెందుకు? అతని యస్త్రశస్త్రములకును - అతని బాహుబల వీర్యములకును అలవిగా నంతగా కర్ణుడు విక్రమించినను, ఆనాడు చక్రముపట్టి భీష్మునిపైకి దూకిన శ్రీకృష్ణు డీనాడు సవ్యసాచిని కర్ణుని చేతిలో చావనిచ్చునా? కర్ణుడు, చక్రిచక్రమునుగూడా అతిక్రమించి తన్నువధించు నని తలంకె ధనంజయు డట్లు తల్లడిల్లినా డనుట తగదుగదా!

అర్జునునకు పిరికితనము కల్పితమన్నచో రచన రుచి తప్పును. సహజమన్నచో, నతని విక్రాంతినిదెల్పు పూర్వ కథలకేకాక, అతనికిగల * 'విజయు' నామమునకుగూడా విఘాతము గల్గును.

ఏమైనను భారతకథితము గావున నారాయణాస్త్ర సదృశము. నమస్కరింపవలసిన దే.

---

* 'విజయు'డనగా యుద్ధమున కుత్సాహముతో ముందంజవేయువా డనియు, శత్రువులను జయింపక వెనుమరలనివా డనియు నర్థము.

"అభిప్రయామి సంగ్రామే య దహం యుద్ధదుర్మదాన్
నాజిత్వా వినివర్తామి తేన మాం విజయం విదుః"

(విరాట. ౪౪. అ.)

"ఎట్టివారినైన నెదిరినం బోర జ
యంబుగొనుట విజయుం డంద్రు నన్ను" (తిక్కన)

# ౨౭. కర్ణుడే శూరుడు

"కర్ణుని జయించినాడు గనుక అర్జునుడే శూరు" డని యర్జునాభిమాను లందురుగాని, అది యొప్పదగిన మాటకాదు. ఎందువల్లననగా.—

కర్ణుడు నాగాస్త్రమును కవ్వడి కంఠమునకు గురిచేసి విడువగా, కృష్ణుడు రథమును క్రుంగద్రొక్కి - గురితప్పించి - కవ్వడి తల కాపాడినాడు. అందు పార్థుని ప్రయోజకత్వ మేమియును లేదు. పిమ్మట కర్ణుడు, కుండవరకును చక్రము దిగబడి, ఒడ్డగెడవైన తన రథము నెత్తుకొనుచున్న సమయమున నర్జును డతని తల నరకినాడు. అది కేవల మక్రమము. కావున కర్ణుని యోటమి ఓటమియును గాదు; కిరీటి గెల్పు గెల్పును గాదు.

ఆ గెల్పు బ్రాహ్మణుడు, భార్గవుడు, ఇంద్రుడు, శల్యుడు, కృష్ణుడు సంపాదించిపెట్టినది. అందులో వారి కందరికిని తలా కొంచెము భాగమున్నది. అందును పెద్దభాగము కృష్ణునిది. అర్జుననిది పీసపాలు.

ఆ పద్ధతిలో కర్ణ నర్జునుడే యేమి? ఉత్తరుడును గెలువ వచ్చును. కర్ణు డట్టి వెలితిగెలుపున కాసించు కక్కుఱితికాడు కాడు. అతడు కీర్తిప్రియుడు. అర్జును డర్థలోభి.

కర్ణుడు, తమ్ముల యభ్యుదయమునకై తన ప్రాణములను గుప్తముగా బలియొసగిన దయామయహృదయుడు.- అర్జునుడు తన్నెత్తిపెంచిన తాతగారిని స్వలాభమునకై దొంగవ్రేటులతో క్రుంగించిన కఠినహృదయుడు.

కర్ణుడు, పలువురు తన విక్రమమునకు విరుపులు నెరపి నను దైన్యపడక, దర్పముచెడక క్షత్రియోచితముగా పోరిన ధీరుడు. అర్జునుడు, ఎంతోమంది యెత్తులుపెట్టినను, వాసుదేవుడు వత్తాసిగానుండి అడుగడుగునను ఆదుకొనుచున్నను బీరముచాలక క్షత్రియానుచితముగా-చావుకు జంకుచూ - పెనగిన భీరుడు.

కర్ణునిది ధర్మయుద్ధము; అర్జునునిది యధర్మయుద్ధము. అధర్మముచే హత మైనను ధర్మము హైన్యమును పొందదు. ధర్మవిదుల దృష్టిలో కర్ణుడే శూరుడు.

## చర్చాసారాంశము

ద్రోణ భీష్ములు పాండవపక్షపాతముచేత దుర్యోధనునకు ద్రోహముచేసినా రనువాదము నిరాకరము. భారతమును సరిగా నరయక కొందరును, అరసియు దుస్సంకల్పముతో కొందరును వారిపై నిందలుమోపినారుగాని నిజానికి వారు నింద్యులుకారు. ఆ యిరువురకును కౌరవులయెడను-పాండవుల యెడను సమభావమేగాని భేదభావము లేదు. ఆ రెండు కుటుంబములును సుఖముగానుండుటయే వారి యభీష్టము. * శ్రీకృష్ణసహాయముగల పాండవులను జయించుట కౌరవులకు

* "శ్రీకృష్ణుఁడు రాజకీయ పురుషాగ్రేసరుడు. భీష్మ ద్రోణ విదుర సంజయులకు... శ్రీకృష్ణుని రాజకీయపరిజ్ఞానము బాగుగఁదెలియును. భీష్మాదు లీసంగతిని దుర్యోధనకుఁ బెక్కుసారులు తెల్పిరి. కాని నేఁటి కాలమునఁ గేవలము పశుబలమునే నమ్మి మోసపోయిన 'జర్మనీ కైసరు' వలె దుర్యోధనుఁడు కేవల సైన్యబలాధిక్యమునే నమ్మి మోసపోయి యున్నాఁడు." ('పెండ్యాల'- పు. 163)

శక్యముకా దని వారు ముందుగనే గ్రహించినారు. పోరు తారసిల్లినచో కౌరవు లెల్లరును నశింతురనియు, పాండవు లైదుగురును బ్రతికినను వారిపక్షమునను బహుప్రజానాశము కాకతప్ప దనియు వారికి రూఢిగా తోచుటచేత, రారాజును యుద్ధ ప్రసక్తినుండి విరమింపజేయుటకు అనేకవిధముల యత్నించినారు. నయాననూ - భయాననూ చెప్పిచూచినారు. ప్రయోజనము లేకపోయినది. దుర్యోధనుడు తన మూర్ఖతకు కర్ణచోదనము తోడగుటచేత వారిమాట వినక భండనమే కావలెనని భల్లూకపుపట్టు పట్టినాడు. అప్పుడు పితామహుడును - గురుడును,—

"కురునృప విను సంసారము
దరి ద్రొక్కినవార మింకఁ దలఁకెద మే సం
గరమునకు నేము నీకై
పొరలితి మెట్లయిన నగును. (ఉద్యో. 4-26)

కాని"య్మన్నారు.-

"వడ్లతో తట్టు" యన్నసామెతగా, దుర్యోధనునితో పాటు వారును దురమున దుమికినారు. ముందు వారును, పిమ్మట సబంధుపరివారముగా కర్ణదుర్యోధనులును భండన పిశాచికి బలియైనారు. ద్రోణభీష్ములు చెప్పినట్లు పాండవు లైదుగురు మాత్రమే మిగిలినారు.

నిస్స్వార్థమతితో, నిష్కళంక హృదయముతో దుర్యోధనునకు తోడుపడిన ద్రోణభీష్ములను 'స్వామి ద్రోహు'లనుటయు, స్వార్థమతితో, కపటవర్తనముతో దుర్యోధనుని కుల వృక్షమును కూకటివేళ్లతో కూల్చిన కర్ణుని 'స్వామిభక్తి పరు' డనుటయు అవిమృశ్యకారిత. కాదా, కాపురుషత.

## ఉపసంహారము

భారతము పంచమవేదము. సకల శాస్త్రార్థసారము. స్వార్థరహితులును, సర్వసమభావులును, విశ్వశ్రేయఃకాములును నైన మహర్షులచేత సంతరింపబడిన మహేతిహాస మది. ఇటు ఐహిక జీవయాత్రకును - అటు ఆముష్మికార్థ సాధనకును మన కది మార్గదర్శి. చంటుమొదలు ప్రభువువరకును - శ్వపచుడు మొదలు బ్రహ్మర్షి వరకును అన్ని యంతరముల మానవులకును వలయు- అన్ని తెరగుల ధర్మములును- అందు నిక్షేపింపబడియున్నవి.

మన మా పవిత్రగ్రంథమును ప్రమాణబుద్ధితో పఠించి, పరిశీలించి అందలి పరమార్థమును గ్రహించుట శ్రేయము. అరగొరజ్ఞానముతో-అదితప్పు; ఇదితప్పు-అని, ఆక్షేపించుట శ్రేయముగాదు. భారతసంప్రదాయార్థము వేదవిదులు కానివారికిని, శాస్త్రజ్ఞులు చదువనివారికిని అగమ్యగోచరము.

భారత వీరుల యొక్కయు, భారత నారుల యొక్కయు జన్మకథలలోను - చరిత్రములలోను దోషము లున్నట్లు మన యపరిణత బుద్ధికితోచును. పరిణత బుద్ధు లందు ధర్మసూక్ష్మమున్న దందురు.

ఉదాహరణము.- పాండవుల జన్మవృత్తాంతము నీచమని యీ నాటి విమర్శకులు గర్హించుచున్నారుగదా! ధర్మవిదులైన ప్రాచీనులు-"పాండవుల జన్మమే కాదు; వారి వంశమంతయు నట్టిదే"యని వ్యాఖ్యానించి, ఆ నీచతలోనే గొప్ప ధర్మసూక్ష్మమున్న దనుచూ-పాండవుల చరిత్రము నెట్లు కీర్తించియున్నారో తిలకింపుడు.

* "కానీనస్య మునేః స్వసోదరవధూవైధవ్య విధ్వంసినః
నప్తారః కిల గోళకస్య తనయాః కుండాః స్వయం పాండవాః
పంచైతే చ సమానయోని నిరతాః ఖ్యాతా జగద్విశ్రుతాః
తచ్చారిత్ర మశేష పాపహరణం ధర్మస్య సూక్ష్మా గతిః."

పాండవులను కీర్తించిన పూర్వులకన్నను-గర్హించుచున్న యీ నాటివారు పండితులా? పరిశీలకులా? పవిత్రాత్ములా? 'మన మెరుగని చెవులకు మద్దికాయలా?'- విమర్శకుల చిత్త సంస్కారముకొలదిని అర్థభావము లవగత మగుచుండును.

"యాదృశీభావనా యస్య సిద్ధి ర్భవతి తాదృశీ."

మహాపతివ్రతలుగను, మహాపురుషులుగను మహాభారతము ప్రస్తుతించిన వ్యక్తుల నెత్తుకొని - కుంతి కులట; ద్రౌపది ధర్షిణి; ద్రోణ భీష్ములు ద్రోహులు; కృష్ణుడు కొంటె; వ్యాసుడు పక్షపాతి-యని యుద్ఘాటించుటవలన వక్త అల్పజ్ఞత వ్యక్తమగునేగాని, దానివలన లోకమునకు క్రొత్తగాగలుగు మేలేమున్నది? మేలు లేకపోగా కీడు తప్పదు. అట్టి తప్పు ప్రచారమువలన, సామాన్య ప్రజకు భారతముపై నింతకు ముందున్న గౌరవము జారిపోయి, వారి బుద్ధులు విపరీతభావ పరంపరాశంకిలము లగును. ఆ విధముగా వా రపకృతు లగుదురేగాని, ఉపకృతులుగారు.

---

* పాండవులతాత - వ్యాసమహర్షి - పెండ్లిగాని పిల్లకు పుట్టినవాడు; విధవలైన తన తమ్ముని భార్యలకు పిల్లలను పుట్టించినవాడు. పాండవుల తండ్రి - పాండురాజు - విధవకు కలిగినవాడు. ఇక పాండవులో, కుండులు (కుండు అనగా భర్తయుండగా ఇతరునికి పుట్టినవాడు)-పైపెచ్చు వా రైదుగురును ఒక్క స్త్రీతో కాపురము చేసినవారు. వంశ వృత్తమును ఆత్మవర్తనమును ఇట్టివైయున్నను వారు జగద్విశ్రుతులు. వారి చారిత్రము అశేష పాపహరణము. ధర్మసూక్ష్మమిట్టిది - అని శ్లోక తాత్పర్యము.

భారతకథ లెన్నో వేలసంవత్సరముల క్రిందటివి. అప్పటి మానవుల మనస్తత్వములును, సాంఘికాచార వ్యవహారములును, బల శౌర్య వీర్య మహిమలును - అవి వేరు. ఇప్పటి మనకథలు వేరు. వారికిని మనకును అన్ని యంశములలోను హస్తిమశకాంతరము. నాటి ధర్మములకును నేటి ధర్మములకును పొంతన కుదురదు. దేశకాలావస్థలనుబట్టి ధర్మములు మారుచుండును. అట్టి మార్పులను గమనించి మనము కాలానుకూలముగా సమన్వయించుకొనవలెను. అట్టి మెలకువలేనివారి విమర్శలు తప్పుదారులు పట్టుచుండును.

ధర్మనిర్ణయము తేలికయైనపని కాదు. పరిపక్వమతులకును ధర్మాధర్మములను గుర్తించుట కష్టము. ధర్మసూక్ష్మమును గుర్తించుట అంతకంటెను కష్టము. ధర్మస్వరూపమెట్టిదో చెప్పుమని ధర్మరాజుడుగగా, భీష్ముడిట్లు చెప్పినాడు.

ఆ. "ధర్మములకు సంజ్ఞ దద్వయలగు మహా
త్ములు దగంగఁజెప్పుదురు నరేంద్ర!
వినుము కాలపాకమున నది యన్యథా
త్వంబుగలిగి యవిశదత్వ మొందు." (అను. 5. 407)

వ. ఎట్లంటేని. (5-408)

క. అనఘ! యధర్మము ధర్మం
బనుమతిఁ బుట్టించుఁ దృణసమావృతమై ప్ర
న్నని తలము చందమునఁదోఁ
చిన నూయుంబోలె సూక్ష్మచిత్తత లేమిన్. (5-409)

క. తప్పక కాన్పఁగ లేమిం
జెప్పెడు వారలును దద్విశేషము దప్పం
జెప్పఁగ ధర్మంబు తెరవు
దప్పు; నది క్రియాపరులకు దైన్యము దెచ్చున్. (5-410)

వ. కావున ధర్మంబు సూక్ష్మప్రకారంబు (5-411)

క. శ్రుతముఁ బరిత్యాగముఁ గల
మతిమంతుల నడుగు లోభమదమోహసమా
వృత బుద్ధులుఁగాని సమం
చిత చరితుల వలనఁ దెలియు శీలనిరూఢా." (5. 412)

భీష్ముఁడేమన్నాడు? "ధర్మము యొక్క స్వరూపమును ధర్మవిదులు చెప్పగలరుగాని నేను సరిగా చెప్పజాల" నన్నాడు. "సూక్ష్మ చిత్తులు కానివారికి అధర్మము ధర్మముగానే తోచును. వారదే ధర్మ మని యితరులకుబోధించుటయు, దాని ననుష్ఠించువారు చెడుటయును తటస్థించుచుండును. కాబట్టి, పెద్దలవలన చక్కగా వినియున్నవారును, త్యాగమతులును, లోభ మోహ మదమత్సరగ్రస్తచిత్తులు కానివారును నగు విజ్ఞులవలన ధర్మ సూక్ష్మప్రకారము తెలిసికొను" మన్నాడు.

సమస్తధర్మము లెరిగినవాడును, ధర్మములు చెప్పుటకే పూనుకొన్నవాడునునైన అంతటిమహనీయుడే, "ధర్మస్వరూప 'మిదమిత్థ'మని నేను చెప్పనేర" ననియుండగా, ధర్మము వాసన నైన నెరుగని మనబోంట్ల మందరకును, వేదికలకెక్కి నిర్భయముగా - నిరాఘాటముగా ధర్మ నిర్ణయోపన్యాసములు చేయుట సాహసముకాదా!

"ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః"

ఓం తత్సత్



# పునర్ముద్రణము కావలసిన గ్రంథములు.



1. చాటుపద్య రత్నాకరము
2. సారంగధర చరిత్ర ('జితకాశి' టీకాసహితము)
3. ప్రణయ కుసుమము (ఖండకావ్యము)
4. భారతి (గొల్లభామ కథ:- 'భూపతిఁ జంపితిన్' అను చాటు పద్యము ననుసరించి రచింపబడిన కావ్యము)
5. సువర్ణమేఖల ('ఎరువుల సొమ్ములు బరువుల చేటు'- అను లోకోక్తికి తార్కాణమైన కథ)
6. కాలము (కాలమహిమానువర్ణనము)
7. నెల్లూరి గాలివాన
8. ఓదార్పు (ప్రణయ కుసుమముమీది ఆక్షేపణలకు సమాధానము. ఇందు చక్కని సారస్వత చర్చగలదు.)
9. కుమార కథామంజరి (దశకుమార చరిత్ర కథలు-వచనము)
10. పంచరాత్రము (భాసకృతికి అనువాదము. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము- (1959.-60). ప్రీయూనివర్సిటీ కోర్సుకు పాఠ్యము.)
1. విష్ణూప దశావతార స్తవము (తెనాలి రామకృష్ణకవి రచిత పద్యములు. సంస్కృతవ్యాఖ్య; తెలుగు టీకాతాత్పర్యములును గలవు.)
12. మేఘదూతి (కాళిదాస మేఘసందేశమునకు స్వేచ్ఛానువాదము)

# విక్రయమునకు సిద్ధముగా నున్నవి.

1. సాహిత్య సమీక్ష ... 3-00

   (ఇందు శబ్దరత్నాకరాది నిఘంటువులలోను, శృంగార నైషధాదుల వ్యాఖ్యానములలోను దొరలిన శబ్దార్థ దోషములు చర్చింపబడి యున్నవి. పండితుల ప్రశంసలందిన విమర్శ. ప్రతి గ్రంథాలయములోను ఉండదగిన గ్రంథము.)

2. రఘువంశము (వచనము)-మొదటిభాగము... 2-00
3. ,, ,, -రెండవభాగము ... 2-00
4. మధ్యమ వ్యాయోగము ... 1-25
5. దూతవాక్యము ... 1-00
6. కర్ణభారము ... 0-75
7. ఊరుభంగము ... 1-50
8. దూత ఘటోత్కచము ... 0-50

—

ప్రతులకు:—

దీపాల పిచ్చయ్యశాస్త్రి,

నెల్లూరు - 2.